# శ్రీకృష్ణ రాసలీల - యోగత్రయీహేల



"శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః
ఆయే ధామాని దివ్యాని తస్థుః
వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"


రచయిత:

**మేళ్లచెర్వు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

విశ్రాంత సంస్కృతాధ్యాపకులు

1. శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి
   సంస్కృతాంధ్రకళాశాల, ఒంగోలు (71-95)

2. శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృతాంధ్ర కళాశాల
   తిమ్మసముద్రము, ప్రకాశంజిల్లా (95 నుండి)

**రెండవ ముద్రణ** : మే, 2014

ప్రతులు : 1000



**తెనాలి.**

**సెల్ : 9908163627, 9248375848**

ముద్రాపకులు : **శ్రీ నారాయణ తీర్థ తరంగిణి**

C/o. లక్ష్మీ గణపతి ఆర్ట్ ప్రింటర్స్

2/4, బ్రాడీపేట,

గుంటూరు– 522 002

**వెల : రూ. 65/-**

ముద్రణ : **లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్**

2/4, బ్రాడీపేట,

గుంటూరు– 522 002

ఫోన్ : 2235036



బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారిని సత్కరిస్తున్న
శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణ దంపతులు

## కృతజ్ఞతలు

శ్రీ మేళ్లచెరువువారు మా కుటుంబానికి ఆప్తులు, కొన్ని విషయాల్లో మార్గదర్శకులు. మా తండ్రిగారైన స్వర్గీయ శ్రీఆదినారాయణ గారిని అభిమానించిన ఆత్మీయులు. వారి గ్రంథం ప్రచురణచేసే భాగ్యం నాకు కలుగటం ఎంతో అదృష్టం. ఈ గ్రంథం తప్పనిసరిగా చదువవలసిన గ్రంథాలలో అగ్రశ్రేణిలో ఉన్నది. చదువరులకు సులభంగా అర్థమయ్యేరీతిలో, శ్రీమత్ భాగవతంలోని రాసలీల ఘట్టాన్ని సప్రమాణంగా వివరించడంలో రచయిత కృతకృత్యులయ్యారు.

సంస్కృత పదాలకు ఏ సందర్భంలో అర్థం చెప్పుకోవాలో సప్రమాణంగా విశదీకరించిన తీరు అమోఘం. రాసలీలపై అభ్యంతరకర వ్యాఖ్యలు చేసే వారికి ఈ గ్రంథం కనువిప్పు.

భాగవత మార్గాన్ని జోడించి చక్కని 'అక్షరాంజలి' అందించిన డా॥ ధూళిపాళ రామకృష్ణ గారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించిన శ్రీ లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి, శ్రీ బి.వి.ఎస్. శాస్త్రి గారికి నా కృతజ్ఞతలు.

శ్రీ మేళ్లచెరువు సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి పాదాభివందనములు.

**- గుండ్లపల్లి వేంకటకృష్ణయ్య**

# అక్షరాంజలి

**- డా॥ ధూళిపాళ రామకృష్ణ**
సంస్కృత విభాగాధ్యక్షులు
మారిస్ స్టెల్లా కళాశాల, విజయవాడ

## వ్యాసమహర్షి యొక్క పరోపకార దృష్టి :

భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వం వేదం. వేదాన్ని ప్రపంచంలోని మరే వాఙ్మయంతో పోల్చడం కుదరదు. అది అనంతం. ద్వాపరయుగం చివర, కలియుగ ప్రారంభంలో ఋషి, సంఘశ్రేష్ఠుడు, దయామయుడూ అయిన వ్యాసమహర్షి భావితరాల బలహీనతలను పసిగట్టి, వేదవాఙ్మయాన్ని సరళతరం చేసి పలువిధాలుగా అందించాడు. వేదాన్ని నాలుగుగా విభజించాడు. ఆ నాలిగింటిని ఎన్నో శాఖలుగా చేశాడు. ఒక్కొక్క శాఖను తన ఒక్కొక్క శిష్యునికి బోధించి, వారిని దేశంలోని ఒక్కొక్క ప్రాంతానికి పంపాడు. వారా ప్రాంతాల్లో ఆ వేదశాఖను వ్యాపింప చేశారు. అలా మౌఖికంగా, నియమంగా జరిగే అధ్యయన ప్రక్రియతో కొన్ని వేదశాఖలు నేడు మనకు మిగిలాయి.

నియమంగా అధ్యయనం చెయ్యలేని వారికి వేదాన్ని సరళతరం చేసి అందించడంలో భాగంగా పద్దెనిమిది పురాణాలు, పద్దెనిమిది ఉప పురాణాలు, మహాభారతం, హరివంశం మొదలైన గ్రంథ సంపదను నిర్మించి ఇచ్చాడు. ఆయన చిట్టచివరి రచన శ్రీమద్భాగవతం.

## భాగవత స్వరూపం :

**అర్థోయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః ।**
**గాయత్రీ భాష్య భూతోసౌ వేదార్థ పరిబృంహితః ॥**

**పురాణానాం సారభూతః సాక్షాద్భగవతోదితః ।**
**గ్రంథోష్టాదశసాహస్రః శ్రీమద్భాగవతాభిధః ॥**

భాగవత వ్యాఖ్యాతలతో ప్రముఖులెందరో ఉటంకించిన ఈ శ్లోకాలు "బ్రహ్మసూత్రాలకు అర్థము, భారతం యొక్క అర్థాన్ని నిర్ణయించింది, గాయత్రీ మహామంత్ర భాష్యం, వేదముయొక్క అర్థాన్ని విస్తరించి చెప్పేది, అన్ని

పురాణాల సారం, సాక్షాత్తూ భగవంతుడే చెప్పినది, పద్దెనిమిది వేల శ్లోకాలున్నది, శ్రీమద్భాగవతమనే పేరు గలది" అని భాగవత స్వరూపాన్ని సూటిగా చెప్పాయి. ఈ శ్లోకాల వల్ల భాగవతం వ్యాసుడి చివరి రచన అని తెలుస్తోంది. ఆయన అందించిన వాఙ్మయ మంతటి సంగ్రహరూపమనీ తేలింది. అందుకే

**ధనంజయే హాటక సంపరీక్షా, మహారణే శస్త్రభృతాం పరీక్షా ।**
**విపత్తికాలే గృహిణీ పరీక్షా, విద్యావతాం భాగవతే పరీక్షా ॥**

అగ్నిలో బంగారానికి, పెద్ద యుద్ధంలో ఆయుధధారులకు, ఆపదలలో ఇల్లాలికి, భాగవతంలో విద్యావంతులకు 'పరీక్ష' అని నిర్ణయించబడింది. భాగవతాన్ని అనుసంధానం చేసేవారందుకే "భక్త్యా భాగవతం జ్ఞేయం న వ్యుత్పత్త్యా న టీకయా' భాగవతాన్ని భక్తితో తెలుసుకోవాలిగాని నేర్చిన చదువుతోనో, వ్యాఖ్యానాల నన్వయించుకొనో కాదు అంటున్నారు. ఎవరిమీద భక్తివల్ల? అనే ప్రశ్నకు ఉపనిషత్తు.

**యస్యదేవే పరాభక్తి : యథాదేవేతథాగురౌ ।**
**తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥**

దైవమందు, గురువుయందు పరాభక్తి అంటే అహైతుకీభక్తి అంటే కారణం లేకుండానే భక్తిగల మహాత్ముడికి గ్రంథాలలో చెప్పిన విషయాలు బోధపడతాయంటోంది. కంచిపరమాచార్య 'తస్యైతే కథితాః' అనేచోట 'అకథితాః' అని కూడా తీసుకోవాలి. అంటే గ్రంథాలు చెప్పిన పైకి కనబడేవేకాదు. పరోక్షంగా ఉన్నవి. చెప్పనివికూడా బోధపడతాయి అని చెప్పారని మా గురువర్యులు బ్రహ్మలీన శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రులవారు పలుమార్లు చెప్పారు. దీన్నిబట్టి

## భాగవతం ఎవరికి అర్థమౌతుంది?

భాగవతం లాంటి గ్రంథం దైవంపైన, గురువుపైన కారణంలేని భక్తిగలవాడికే అర్థమౌతుందని తేలిపోయింది. అలాంటి భాగవతంలో 'రాసపంచాధ్యాయి' అంటే రాసలీల ఘట్టం శుక మహర్షి లాంటి జీవన్ముక్తులకు నిత్యపారాయణ గ్రంథం. దానిని జిజ్ఞాసువులకు తేటతెల్లం చెయ్యడంతో బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు భారతీయ ఆధ్యాత్మిక విషయాసక్తులందరికీ శిరసా అభివందనీయులయ్యారు.

## “శ్రీకృష్ణరాసలీల - యోగత్రయీహేల” గ్రంథకర్త సమాజానికి చేసిన మహోపకారం :

‘కలిస్సాధుః’ అని విష్ణు పురాణం చివర, ‘కలిం సభాజయంత్యార్యాః’ అని భాగవతంలో వ్యాసమహర్షి చెప్పాడు. కలియుగం మంచిది. కలియుగాన్ని పెద్దలు అలంకరిస్తారు. అంటే కలిలో పుట్టాలనుకుంటారు. పుడతారు అని ఆపంక్తులకర్థం. ఈ వ్యాసవచనాలను నిజం చేసి బ్రహ్మర్షి తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు (చందోలు) అవతరించారు. వారిపై అహేతుకమైన, అపారమైన భక్తితో ‘శ్రీగురుచరితమ్’ ను వారి ప్రియశిష్యులు, శ్రీ మేళ్లచెర్వు వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వెలువరించారు. ఆ గ్రంథమే వారి గురుభక్తికి నిదర్శనం. గురువులు ఉపదేశించిన మార్గంలో వారి సాధనానుష్ఠానాలు, ఇష్టదేవతపై భక్తిని, ఇష్టదేవతానుగ్రహాన్ని వారికి పుష్కలంగా ప్రసాదించాయి. ఈ విధంగా వారు అనాదియైన గురుశిష్య పరంపరలో సంప్రదాయము నెరిగినవారు. వారు సంస్కృతాంధ్ర సాహిత్యములు, వ్యాకరణం, వేదాంతం, జ్యోతిషం, మంత్ర, యోగశాస్త్ర రహస్యవేత్తలు. ఆదిశంకరులు భగవద్గీతా భాష్యంలో “అసంప్రదాయవిద్ సర్వశాస్త్ర విదపి మూర్ఖవదుపేక్షణీయః” అని శాస్త్రాలు తెలిసినవాడైనా సంప్రదాయం తెలియనివాణ్ణి, మూర్ఖుణ్ణిలాగా పట్టించుకోకూడదు అంటారు. శ్రీశాస్త్రిగారు సత్సంప్రదాయంలో అన్ని శాస్త్రాలను ఆపోశన పట్టారు. ఆదికవి మొదలుకొని ప్రముఖ కవులందరినీ మించిన కవితావేశంతో వెలకట్టలేని సాహిత్యాన్ని వెలయించిన ప్రతిభామూర్తి. అపరశంకరుడైన బెల్లంకొండ రామారావుగారి గంభీరమైన వేదాంత గ్రంథాలను తెలుగుచేసి తెలుగులకు వెలుగునిచ్చిన మహనీయుడు.

ప్రస్తుత రచనలో జ్ఞానపరంగా, కాలపరంగా, ఖగోళపరంగా, యోగపరంగా, వేదపరంగా, దేహపరంగా, మంత్రశాస్త్రపరంగా, జీవన్ముక్తుల అనుభూతులపరంగా శ్రీకృష్ణరాసలీల పరమార్థాన్ని ప్రామాణిక గ్రంథాల ప్రమాణాలను చూపుతూ హేతుబద్ధంగా ఆవిష్కరించారు.

## ద్వితీయ ముద్రణలో ప్రత్యేకత :

2001వ సంవత్సరంలో తొలిసారిగా ముద్రించబడిన ఈ గ్రంథం ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, విద్యాభిమాని, విద్యాదాతలైన స్వర్గీయ

శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణ పంతులుగారి కుమారులు, తండ్రి ఆశయాలను నెరవేర్చటానికి త్రికరణశుద్ధిగా పూనుకొన్నవారు న్యాయమూర్తి గౌ॥శ్రీ కృష్ణయ్యగారి ప్రోత్సాహ సహకారాలతో రెండవ పర్యాయం ముద్రించ బడుతోంది. ఈ ముద్రణలో రచయిత సంస్కృతంలో ఇచ్చిన ప్రమాణ వాక్యాలన్నింటికీ అర్థవివరణ ఇవ్వడం జరిగింది. కేవలం ప్రమాణం చూపితే భాష తెలియనివారికి అసౌకర్యంగా ఉంటుంది. జిజ్ఞాసువులందరికీ గ్రంథంలోని విషయమంతా అక్షరశః తెలియాలనే ఆకాంక్షతో ప్రకాశకుల విజ్ఞప్తి మేరకు ఈ రకంగా గ్రంథం పునర్నిర్మించబడింది.

ఆదర్శ వ్యక్తిత్వం, కుటుంబ జీవనం, మానవ సంబంధాలు, సామాజిక బాధ్యతల గూర్చి నొక్కిచెప్పే రామాయణ భారత భాగవతాలు మన భారతీయ సంస్కృతికి మూలగ్రంథాలు. రామాయణంలో వాలి వధ, భారతంలో ద్రౌపది పాతివ్రత్యం, భాగవతంలో రాసలీలల వంటి అంశాల విషయంలో అపోహలు తొలగించబడితే, శంకలకు సమాధానమీయగలిగితే మన సంస్కృతీ సంప్రదాయాల విలువ పెరుగుతుంది. యువతరానికి ఇతర సంస్కృతులకన్నా మన సంస్కృతి ఎంత ఉన్నతమైనదో అర్థమౌతుంది. వారికప్పుడు బాటతప్పాలనిపించదు. ఆవిధంగా మన జాతిని సంస్కృతీబద్ధులను గావించే ఇలాంటి రచనలే నేడు అత్యావశ్యకం. 'రాసలీల' అంశంపై శ్రీ మేళ్లచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి రచనవంటి సమగ్రమైన రచన ఇంతవరకూ ఏ భాషలో వెలువడలేదు. ప్రపంచ సంస్కృతికే తలమానికమైన భారతీయ సంస్కృతి ఔన్నత్యాన్ని, భారతీయ సాహిత్యంలో దాగివున్న విలువల్ని అందరికీ అర్థమయ్యేలా అందించాలనే సదాశయం గ్రంథకర్తకు, ప్రకాశకులకు నిండుగా ఉంది. ఈ గ్రంథం అనేక పర్యాయాలు చదివి అవగాహనతో విషయాన్ని వివేచించుకుంటే భారతీయ సాహిత్యం ఎన్ని విలువైన విషయాలను ఇముడ్చుకుంటుందో బోధపడుతుంది. ఎలాంటి ప్రశ్నలను సంధించే వారికైనా సమాధానమీయగల సామర్థ్యాన్నిచ్చే విజ్ఞానసర్వస్వం ఈరచన. ఇలాంటి గ్రంథాన్ని అందించిన బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి, ప్రకాశకులు శ్రీ గుండ్లపల్లి కృష్ణయ్య గారికి నమోవాకములర్పిస్తున్నాను.

**– డా॥ ధూళిపాళ రామకృష్ణ**

# ఆత్మ నివేదనము

**ఓం నమో గురవే జగద్గురవే చ**

ఒంగోలు లాయరుపేటలో సాయిమందిరములో 1993 ఏప్రిల్‌లో నేను ''రాసలీల - అంతరార్థము'' అను పేరున జరిపిన 16 రోజుల "బ్రహ్మరాత్రము"లోని సారాంశమే యీ "శ్రీకృష్ణ రాసలీల - యోగత్రయీ హేల" అను విమర్శగ్రంథము.

'రాసలీల'పై గల అనేక భ్రమలను, అపవాదములను, దృష్టిలో ఉంచుకొని నేను భావించిన వాస్తవార్థమును సహృదయులకు నివేదించితిని. సాధ్యమయిన ప్రమాణములను, తదాధారమయిన ఊహలను ప్రదర్శించితిని.

ఇందులో నేను శబ్దశక్తిని అర్థశక్తిని వినియోగించి అంతరార్థములను చెప్పితిని. అంతేగాని పదపదాంశములను చితకగొట్టి పచ్చడిచేసి నాయిష్టమైన అర్థమును పిండలేదు. మాస్టర్ ఇ.కె. అవలంబించిన సున్నితమయిన పద్ధతిలో సాగితిని. వ్యాస సాహిత్యవీణ నుండి సున్నితముగా అంతరార్థకాక లీతరంగములను పలికించిన పురాణజగత్ప్రాణుడాయన.

ఈ గ్రంథము జిజ్ఞాసువుల కొఱకు వ్రాయబడినది. నాస్తికుల ఖండనకు గాని సంప్రదాయవాదుల మండనకుగాని నేను ఉద్దేశింపలేదు. ఎంతో శ్రమించి రాసలీలకు వస్త్రాపహరణమునకు "యోగ, జ్ఞాన, ప్రకృతి, వేద" పరముగా సాధ్యమయిన అర్థములను సూచించితిని. కనుక సహృదయులయిన పరిశీలకులకు ఇందు స్వాగతము. కనుక -

**"ప్రాజ్ఞంమన్యమనాః హఠేన పఠితీ మాస్మిన్ ఖలః ఖేలతు"**

ఈ గ్రంథ ప్రథమ ముద్రణ విషయంలో ప్రూఫులు దిద్ది నాకు సహకరించిన శ్రీ సోమాశి బాలగంగాధరశర్మకు ముద్రణ సహాయంగా తనంత తానుగా 500/- రూపాయలు ఇచ్చి ప్రోత్సహించిన బ్రహ్మశ్రీ శ్రిష్టి

లక్ష్మీకుమారశర్మ గారికి ధన్యవాదములు. ప్రథమ ముద్రణమును మొత్తం నా సొంత ధనంతో పూర్తిచేసి పాఠకలోకానికి అమూల్యంగా అందించాను.

దీనిని చదివి గాఢంగా మెచ్చుకొని పునర్ముద్రణ చేయవలసినదిగా కోరి అందుకుతగ్గ ముద్రణ వ్యయమును పూర్తిగా సమకూర్చిన శ్రీ జి.వి.కృష్ణయ్య గారికి కృతజ్ఞతలు. వీరి సూచన మేరకే ఈ ద్వితీయ ముద్రణలో సంస్కృత ప్రమాణములకు తెలుగు తాత్పర్యములను పాద సూచికలుగా ఇచ్చాను. ఈ గ్రంథము కంప్యూటర్ చేయుటకు కావలసిన ధన సహాయము చేసిన శ్రీ బి.యస్.మూర్తి గారు Ex-Officio Secretary to Central Government, Telecom Authority (Rtd.) వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. శ్రీ మూర్తిగారు ఇంతకుముందు నేను ప్రచురించిన బ్రహ్మసూత్ర కరదీపికకు భూరివిరాళము ఇచ్చినారు. వీరు ఈ శ్రీకృష్ణరాసలీలను ఆంగ్లీకరించి అంతర్జాతీయంగా అందుబాటులోకి తేవటానికి కృషిచేయుచున్న ధన్యజీవులు. ఈ వదాన్యులందరికి వినయపూర్వక ధన్యవాదములు, శుభాశంసనలు. ఈ ద్వితీయ ముద్రణ గ్రంథమును తమ **శ్రీనారాయణతీర్థ తరంగిణి (రి)** ట్రస్టు ద్వారా ప్రచురించి అమ్ముటకు ఆ ధనమును ఆ సంస్థకు సంబంధించిన కార్యకలాపాలకు వినియోగించుకొనేందుకు గాను ఉచితముగా అనుమతి ఇచ్చుచున్నాను. ఈ గ్రంథమును సకాలమున ముద్రించి ఇచ్చిన శ్రీ బి.వి.యస్.శాస్త్రి గారు శ్రీ లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్, గుంటూరు వారికి వారిపరివారమునకు కృతజ్ఞతలు.

ఇందరు ఋత్విక్కుల సహకారముతో నిర్వహింపబడిన యీ యజ్ఞము విష్ణుస్వరూపము, విష్ణువే శేషి.

**"యజ్ఞో వై విష్ణుః యజ్ఞ ఏవాంతతః ప్రతితిష్ఠతి"**

కనుక ఆ విష్ణుపాదారవిందములకు **నారాయణ అష్టాక్షరీ** పురస్సరముగా ఈ గ్రంథమును సమర్పించుచున్నాను.

"ఓం నమోనారాయణాయ మంగళదేవ ।
తాలాస్యరంగవక్షస్థలాయ ।
ఓం నమోనారాయణాయ తే శతకోటి ।
నక్షత్రదీపనీరాజితాయ ।
ఓం నమోనారాయణాయసంకర్షణా ।
నల్పపన్నగతల్పకల్పనాయ ।
ఓం నమోనారాయణాయ శార్ఙ్గధరాయ ।
చక్రాయుధాయ పీతాంబరాయ"

"గంధసింధుర గాంగేయ విదుర పార్థ
నంద కుంతీ కుచేల కుబ్జాది వివిధ
భక్తవరవర్గనేత్రోత్సవామృతాంశు
మాలినే తే నమోస్తు నారాయణాయ"

ఇట్లు
**మే॥ వే.సు.శా.**

# చరణారవింద షోడశీ

“తేజఃపదార్థగణమౌక్తికమల్లికాభిః
రమ్యాంతరం తతచరాచరవిశ్వశీర్షే
ఛత్రం సమస్తపరితాపలతాలవిత్రం
**వందే మహాపురుష తే చరణారవిందమ్”** **1**

విశాలచరాచర ప్రపంచముపైన వేసిన గొడుగు నీ (వామనావతార) పాదారవిందము. సూర్యనక్షత్రాది తేజోవస్తువులు ఆ గొడుగులో అమర్చిన ముత్యాలమల్లెల దండలు. ఈ గొడుగు మాసమస్త సంతాపలతలను తెంచు కొడవలి. మహాపురుషా! అట్టి నీ చరణారవిందమునకు నా నమస్కారము.

“శక్త్యా నిషేవితమనంతపదార్థమూలం
నీరాజితం రవిసుధాంశుకరప్రదీపైః
తారాసుమార్చిత ముషోహరిచందనాంకం
**వందే మహాపురుష తే చరణారవిందమ్”** **2**

శక్తిమంతము, అనంత (ఆకాశాది) పదార్థములకు మూలము, సూర్యచంద్రకిరణ నీరాజనలు పొందినది, నక్షత్ర పుష్పాల పూజలను అందినది, ఉషోరుణ చందన చర్చితమయిన నీ పాదారవిందమునకు మహాపురుషా! నమస్కారము.

“ఐరమ్మదేన ఘనధూపరవాన్వితేన
యస్యాభిషేకవిధినా మఘవత్కృతేన
తీర్థం నిపీయ ధరణిః దిశతి ప్రసాదమ్
**వందే మహాపురుష తే చరణారవిందమ్”** **3**

మేఘసంబంధమయిన ధూపము, నాదములతో విద్యుద్దీపముతో ఇంద్రుడు చేసిన నీపాదాభిషేక జలమును పీల్చుకొని భూమి మాకు రకరకాల పంటలను ప్రసాదముగా నిచ్చుచున్నది. మహాపురుషా! అట్టి నీ పాదారవిందమునకు నమస్కారము.

"ఏష్యద్దివాకరకరై రభిరంజితాగ్రం
నైశచ్ఛవిస్ఫురితబిందుసుధాంశురాగం
నిత్య ప్రకృత్యుపయమోత్సవచిహ్నరేఖం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **4**

ఉదయ సూర్యకిరణాలతో ఎఱ్ఱవారినది, రాత్రికాంతి (పసుపు)తో కలిసిన చుక్కలు, చంద్రుడు, (సున్నము) కలిసి ఎఱ్ఱని రంగు కలది అయిన నీచరణము ప్రకృతిలో జరిగే నిత్యకల్యాణ చిహ్నమయిన పారాణిని ధరించినట్లున్నది. అట్టి నీ చరణమునకు నమస్కారము. (నిశ = రాత్రి, పసుపు) (సుధ = అమృతం, సున్నం)

"యద్ వ్యోమకేశశిరసి స్థితమబ్జతుల్యం
మేఘంకరో హరిహయశ్చ యదభ్యషించత్
నీరాజ్యతే యదనిశం చపలాకటాక్షైః
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **5**

ఆకాశ శీర్షుడయిన శివుని తలపై పద్మములాగా ఉన్న నీ చరణమును మేఘ సహాయుడైన ఇంద్రుడు సూర్యుడు అభిషేకించును. విద్యుద్వనితల కటాక్షకాంతులు హారతియిచ్చు నీ చరణమునకు మహాపురుషా! నమస్కారము.

"ఏకక్షణే కిల చకార బలిం బలారిం
యోగ్యాధిపత్యనిరతౌ స్వరతాంతరంగౌ
యద్భూస్సువస్థితసహస్రదళాబ్జతుల్యం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **6**

నీయందు అంతరంగమును నిలిపిన బలిని ఇంద్రుని ఒకే క్షణంలో తగిన ఆధిపత్యాలలో నిలిపినది నీ చరణం. భూర్భువస్సువర్లోకాల తలపై వెలిగిన సహస్రదళ పద్మము వంటి నీచరణమునకు, మహాపురుషా! నమస్కారము.

"యత్సంతతం వహతి మంగళదేవతాయాః
శృంగారవిభ్రమతరంగితహస్తసంగం
నిత్యభ్రమద్భ్రనచరాచరచక్రదండం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **7**

మంగళదేవత అయిన లక్ష్మి శృంగార హస్తములతో నిత్యము సేవలందుకొనునది నీ చరణము. నిత్యము వలయంగా తిరిగే చరాచర చక్రమునకు మధ్య దండంవలెనున్న నీ చరణారవిందమునకు నమస్కరించెదను.

"నిత్యానపాయికమలానయనద్వయేన
సత్యానసూయకమజస్రవికస్వరం యత్
ఏకాంబుజం సరసిజాసనయోః శిరస్థం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **8**

నిత్య సహచారిణి అయిన లక్ష్మి నేత్రకమలాల అందానికి నిజముగా అసూయపడనిది, నిత్య వికాసయుక్తము, లక్ష్మీబ్రహ్మల తలమీద నుండు ఒకే ఒక పద్మమయిన నీ చరణాంబుజమును నమస్కరించెదను.

"ఇంద్రాపరాధ కుపితోద్ధతగౌతమర్షి
నిర్యాతశాపకృతశైలకదర్యమూర్తిం
యచ్ఛోద్దధార కృపయా కృపణామహల్యాం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **9**

ఇంద్రుడు చేసిన తప్పుకు కోపించి గౌతముడు వదలిన శాపమువలన శిలారూపము పొందిన దీనురాలయిన అహల్యను ఉద్ధరించిన నీచరణారవిందమునకు మహాపురుషా! నమస్కారము.

శుష్కాస్థిపంజరకదుందుభిదేహభావం
సుగ్రీవతర్పణధియా యదవాకిరత్ ద్రాక్
తత్సాక్షివానరదృగంబుజదత్తమాల్యం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **10**

ఎండిన అస్థిపంజరంగా ఉన్న దుందుభి రాక్షసుని దేహపదార్థమును సుగ్రీవ సంతృప్తికై ఎగదన్నినది నీ చరణము. ఈ లీలకు సాక్షులుగా ఉన్న హనుమదాది వానరుల నేత్రకమలములను మాలలుగా ధరించిన నీ చరణారవిందమునకు నమస్కారము.

"య న్నిత్యసేవనసమర్పితభాగ్యయోగా
శ్రీపాదుకా భరతమూర్ధని సింహపీఠే
స్థిత్వా చతుర్దశసమాః అవతిస్మ లోకాన్
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **11**

నీ పాదమును నిత్యము సేవించిన కారణంగా వచ్చిన సుకృతం వలన నీ పాదుక భరతుని శిరస్సున, సింహాసనమున కొలువుదీరి ప్రజలను 14 సంవత్సరములు పరిపాలించినది. అట్టి నీ పాదారవిందమునకు మహాపురుషా! నమస్కారము.

లంకాధిరాజ్యమదనిర్భరరావణేన
నిష్కాసితఃసకృదుపాస్య విభీషణో యత్
సామ్రాజ్యమన్యదురవాపమవాప నిత్యం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **12**

లంకాసార్వభౌమపదవీమదంతో రావణాసురుడు వెళ్లగొట్టగా ఏపాదమును ఒకసారి శరణువేడినంతనే విభీషణుడు ఇతరదుర్లభమయిన సామ్రాజ్యమును పొందెనో, మహాపురుషా! అట్టి నీ పాదమునకు నమస్కారము.

"కుబ్జాత్రివక్రతనుసంస్కరణప్రవీణం
త్రైలోక్యపావనమహాతటినీశరణ్యమ్
త్రైగుణ్యసంభృతజగద్భువనస్య మూలం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **13**

కుబ్జవంకరలు తీర్చుట కుపయోగపడిన పాదము, లోకత్రయ పావనము, మహానదికి పుట్టినిల్లు, త్రిగుణాత్మకమయిన మూడంతస్తులుగానున్న

ప్రపంచభవనానికి నిట్టాడి అయిన నీచరణమునకు – మహాపురుషా! నమస్కారము.

హత్వా చ యన్ముసలశల్యశిలీముఖేన
స్వర్గం జరా అభజదాశు బలిస్తుశీర్ష్ణే
ధృత్వా చ యత్సుతలరాజ్యమవాప చిత్రం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **14**

ముసలశల్యంతో తయారయిన బాణముతో నీపాదాన్ని కొట్టిన 'జరా' అనువ్యాధుడు స్వర్గమును పొందాడు, తలపై ధరించిన బలి సుతలరాజ్యమును పొందాడు. అట్టి చిత్రఫలదాయకమయిన నీ పాదమునకు నమస్కారము.

"మైత్రేయభీష్మవిదురార్జునగోపగోపీ
కుంతీకుచేలహృదయేషుమణిప్రదీపమ్
మాదృఙ్మనోరణివిభాస్వరవిస్ఫులింగం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **15**

మైత్రేయమహర్షి, భీష్ముడు, విదురుడు, అర్జునుడు, గోపకులు, గోపికలు, కుంతి, కుచేలుడు వీరిహృదయములకు మణిదీపము నీచరణం. మా వంటివారి హృదయాలలో మెరిసేనిప్పు రవ్వ. అట్టి నీపాదమునకు నమస్కారము.

"యః స్పర్శవత్ సకలవిశ్వవపుష్షు లభ్యః
తస్యాచ్యుతస్య తవ యేన న చాస్తి గమ్యం
అస్మచ్చరాచరజగద్గతిహేతు, గమ్యం
**వందే మహాపురుష తే చరణారవిందమ్"** **16**

'స్పర్శ' వలె సకల ప్రపంచ శరీరములందు సర్వత్ర లభించు నీవంటి అచ్యుతునకు ఈ పాదముతో నడిచి చేరవలసిన గమ్యమేలేదు. కాని మాకు, ఈ చరాచరప్రపంచమునకు గతి కల్పించునది, అందరికి గమ్యమయినది. అయిన నీచరణారవిందమునకు మహాపురుషా! నమస్కారము.



# అంకిత పద్యమ్

"గో గోప గోపవనితామధురాంతరంగ
"తన్మాత్ర" దర్శన నిదర్శన మర్పయామి
గ్రంథం మహాపురుష తే చరణారవిందే
బాహ్యార్థ ముగ్ధతమ మాదృశ సుప్రభాతమ్"

**– మే॥ వే.సు.శా.**

అంకితపద్యము : నా గ్రంథం భాగవత బాహ్యార్థంలో అజ్ఞానంలో పడిన నావంటివారికి సుప్రభాతము. గోవులు, గోపకులు, గోపికలు వీరి అంతరంగములోని మాధుర్యభక్తిని, సప్రమాణంగా చూపించే యీ గ్రంథాన్ని మహాపురుషా! నీ పాదారవిందమునందు సమర్పిస్తున్నాను.

# విషయసూచిక

# శ్రీకృష్ణరాసలీల - యోగక్రియా హేల

## ప్రథమ పింఛము

### ప్రాచీన వాఙ్మయము - పరోక్ష వైఖరి

“యదాయదా హి ధర్మస్య గ్లానిః భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్” 1
“పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే” 2
“యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోకః తదనువర్తతే” 3
“యదిహ్యాహం నవర్తేయం జాతు కర్మణ్యతంద్రితః
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః” 4
“ఉత్సీదేయు రిమేలోకాః నకుర్యాం కర్మచేదహమ్
సంకరస్య చ కర్తాస్యాం ఉపహన్యా మిమాః ప్రజాః” 5
సక్తాః కర్మణ్యవిద్వాంసః యథా కుర్వంతి భారత
కుర్యాత్ విద్వాంస్తథాసక్తః చికీర్షుః లోకసంగ్రహమ్” 6
“ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ” 7

ఈ విధముగా ధర్మసంరక్షణార్థమే తన అవతారమని, తాను ధర్మము తప్పిన సందర్భమున్నచో అది ఆదర్శముగా తీసికొని ప్రజలందఱు భ్రష్టు

---

1) ధర్మమునకు ఇబ్బంది, అధర్మమునకు అభివృద్ధి వచ్చిన ప్రతిసమయమున నేను అవతరించెదను.

2) శిష్ట రక్షణకు, దుష్టశిక్షణకు ధర్మసంస్థాపనకు నేను ప్రతియుగమున అవతరించెదను.

3) శ్రేష్ఠుడు ఏదిచేస్తే సాధారణ జనం దానినే ఆచరిస్తుంది. అతను దేనిని ప్రమాణంగా కనబరిస్తే దానినే ఇతరులు అనుసరిస్తారు.

4) నేను ఆచరణలో జాగ్రత్తగా లేకపోతే మనుష్యులు నన్నే అన్నివిధాల అనుసరిస్తారు.

5) నేను కర్మాచరణను వదలితే ఈ లోకములు చెడిపోవును. సంకరము జరుగును. ఈ ప్రజలను చెడగొట్టిన వాడనగుదును.

6) అర్జునా! అజ్ఞానులు కర్మను ఆసక్తితో చేసినట్లుగా జ్ఞానులు అసక్తితో చేస్తారు.

7) అర్జునా! నేను జీవులలో ధార్మికమయిన కామముగా ఉన్నాను.

లగుదురని కనుక తాను అసంగ ధర్మాచరణము చేసెదనని ప్రతిజ్ఞ చేసిన కృష్ణపరమాత్మ 'రాసక్రీడలలో' వ్యభిచారము చేసినట్లున్న కథాభాగము ఎట్లు సమన్వయము కావలయును. ఈ సందేహం "పరీక్షిత్తు"కు గూడ కలిగెను.

**"సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్యచ**
**అవతీర్ణో హి భగవాన్ అంశేన జగదీశ్వరః 8**
**స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాభిరక్షితా**
**ప్రతీపమాచరేద్బ్రహ్మన్ పరదారాభిమర్శనం" 9**

అని శుకమహర్షిని ప్రశ్నించెను.

ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుటకు ముందు ఆర్షగ్రంథ స్వభావము పరామర్శింపవలయును. అంతేగాక రామాయణ భారతములు 'వేదమునకు' భాషాస్వరూపములు. భాగవతము గూడ అంతియే. చూ॥

ఎ) "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

బి) "భారతం పంచమో వేదః"

సి) "నిగమకల్పతరోర్గలితం ఫలం
శుకముఖాదమృతద్రవసమ్మితమ్" 10

కనుక మూలమయిన వేదమునుండి తన్మూలకమయిన పురాణముల వఱకు వాఙ్మయస్వభావము సూక్ష్మముగా పరిశీలింతము.

శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు రచించిన "రామాయణతత్త్వ కథనము"లో వ్రాసిన విషయములు ఇచ్చట సారాంశముగా ముచ్చటించుకొందుము.

---

8) ధర్మస్థాపనకు అధర్మశాంతికి ఈశ్వరుడు అంశగా అవతరించాడుగదా!

9) అట్టి అవతార పురుషుడు ధర్మనియమ వక్త, కర్త, రక్షకుడు - అయిన ప్రభువు పరస్త్రీలను ఎలా స్వీకరిస్తాడు?

10) ఎ) రామాయణ రూపంగా వేదమే వాల్మీకి నుండి వచ్చినది. బి) భారతము ఐదవ వేదము. సి) వేదకల్ప తరువు నుండి చిలుక కొట్టగా జారిపడిన అమృత మధురమయిన ఫలమే భాగవతము.

నిత్యమయిన వేదములో అనిత్యమయిన వ్యక్తుల కథాంశములు ఎట్లు సమన్వయము చేయవలయును అన్న ప్రశ్నకు సమాధానమేమనగా –

1) అవాంతరకథలు – కథాపరంగా కనబడును. కాని మహాతాత్పర్యము ఆలోచించినచో వేదకథలు అన్నియు విద్యాపరమే అనగా జ్ఞానపరమే.

(వేదం = అనగా జ్ఞానము అని అర్థమన్న సంగతి ఇచ్చట అనుసంధానము చేయవలయును.)

దీనివలన పైకి కథలమధ్య భేదమున్నట్లు తోచును. అవాంతర తాత్పర్యమునకు అసలు తాత్పర్యమునకు మధ్య భేదమున్నట్లు తోచును.

యాస్కమహర్షి తన నిరుక్తములో "శబ్దగతివిభుత్వాత్ ఋచాం వివిధార్థాః భవంతి" అన్నారు. అనగా శబ్దశక్తివలన ఋక్కులకు అనేక అర్థములు స్ఫురించును. దీనికి దుర్గాచార్య వ్యాఖ్య.

**"న హి మంత్రేషు అర్థస్య ఇయత్తావధారణమస్తి మహా**
**ర్థాహ్యేతే దుష్పరిజ్ఞానాశ్చ యథా అశ్వారోహవై**
**శేష్యాత్ అశ్వః సాధు తరశ్చ భవతి ఏవమేతే మంత్రాః**
**వక్తృవై శేష్యాత్ సాధూన్ సాధుతరాంశ్చ అర్థాన్ స్రవంతి"**

**తస్మా దేతేషు మంత్రేసు యావంతోర్థాః**
**ఉపపద్యేరన్ సర్వ ఏవతే యోజ్యాః"**

అనగా 'రౌతు' శక్తినిబట్టి గుఱ్ఱము చిత్రగతులతో నడచినట్లు వక్త సంస్కారమునుబట్టి యీ మంత్రములు అనేక ఉత్తమ అర్థములను ఇచ్చును. కనుక ఆ అర్థములన్నియు స్వాగతింపదగినవి.

(వక్త సంస్కారము దుష్టమయినచో దుష్టార్థములు రాగలవు. అవి వర్జనీయములు. కనుక 'శంకరులు' చెప్పినట్లు "శ్రుతిమతః తర్కోను సంధీయతామ్" – రచయిత)

కనుకనే ఋగ్వేదానుక్రమణికలో మాధవభట్టు

**"నానావిధైరభిప్రాయైః ఋచోదృష్టామహర్షిభిః"** **11**

---

11) మహర్షులు అనేక అభిప్రాయాలతో ఋక్కులను దర్శించారు.

అని అన్నారు. దీనినిబట్టియే విద్యారణ్యస్వామి "అహల్యాయైజార" అను మంత్రమునకు అర్థము వ్రాయుచు -

1) అహల్యా - గౌతమస్యభార్యా - తస్యా ఇంద్రోజారః 12

ఇతి పురాణే ప్రసిద్ధమ్ - అని కథాపరముగా వ్యాఖ్యానించిరి. తరువాత

2) అత్ర నిరుక్తకారః "ఆదిత్యోత్ర జార ఉచ్యతే రాత్రేర్జరయితా" 13 3.3.4. (వేదనిత్యత్వపరముగా) అనగా ఈ మంత్రము సూర్యునిగూర్చి చెప్పుచున్నదని నిరుక్తకారులు వ్యాఖ్యానించినారు. అహల్య అనగా రాత్రి. ఆ రాత్రిని కరిగించువాడు (జారుడు)= సూర్యుడు అని అర్థము.

3) వార్తికకారా అపి

**"ఏవం సమస్తతేజాః పరమైశ్వర్యనిమిత్తః ఇంద్రశబ్ద వాచ్యః సవితైవ అహని లీయమానతయా రాత్రేః అహల్యా శబ్దవాచ్యాయాః, క్షయాత్మక జరాయా హేతుత్వాత్ 'జీర్యత్యస్మా, దనేనైవోదితేన' ఇతి ఆదిత్యఏవ 'అహల్యా జార' ఇత్యుచ్యతే నతు పరస్త్రీవ్యభిచారాత్"**

అనగా కాంతినిధి కనుక ఆ ఐశ్వర్యము ఉన్నదృష్ట్యా సూర్యుడు, ఇంద్రుడు అని చెప్పబడెను. అహస్సు అనగా పగటియందు, లీనమగును గనుక రాత్రిని 'అహల్య' అనిరి. అట్టి రాత్రిని జీర్ణము చేయును గనుక సూర్యుడే అహల్యాజారుడు. అంతేగాని 'పరస్త్రీ వ్యభిచారము' కాదు. భట్టభాస్కరులు వ్రాసిన భాష్యములో,

**"అహల్యావాక్, తస్యాః జారః, ప్రేరకః, తస్యాః జరయితా గుణానాం ఆనంత్యాత్ వైదికస్తుతి రూపా వాక్ త్వయి జీర్యతే - జరయతేః స్తుతికర్మణః"** 14

12) అహల్య - గౌతముని భార్య. ఆమెకు ఇంద్రుడు విటుడని పురాణకథ.

13) ఇచ్చట నిరుక్తకారుడు ఇలా అన్నాడు. ఆదిత్యుడే జారుడు. జారుడు అనగా కరిగించువాడు. సూర్యుడు రాత్రిని కరగించును.

14) అహల్య అనగా వాక్కు. దానిని ప్రేరేపణ చేయువాడు అనంతగుణములు గలవాడగుట వలన వాక్కులు ఇంద్రునిపట్ల జీర్ణమగును.

అనగా వేదరూపమయిన వాక్కు నీయందు జీర్ణమగుచున్నది అని ఇంద్రపరముగా కూడా చెప్పవచ్చును. ఇదియును వేదనిత్యత్వమున కుపయోగించు తాత్పర్యార్థము.

ఇట్టి యర్థములు చెప్పుటకు కారణము మనమే. మనము మందమధ్యమ ఉత్తమాధికారులుగా విభజింపబడినాము.

1) ఇందులో మందమతులు 'కథా' రమ్యతనుబట్టి విని యానందించువారు. వారికొఱకు కథార్థము – వీరికి 'శ్రవణ' పుణ్యఫలము ప్రయోజనము. అందుకు "ఆకర్షణ" కోసం కథావిచిత్ర శరీరము.

2) మధ్యములు కథలోని మంచిచెడ్డలను గ్రహించి భక్తి, పాపభీతి మొ॥ విషయములు తెలిసికొందురు. తద్వారా వారికి, భక్తి జ్ఞాన వైరాగ్యములకు మార్గము ఏర్పడును.

3) ఉత్తములు – వీరికి 'జ్ఞానము' ప్రయోజనము. వేద తాత్పర్య పరిజ్ఞానముతో సంపూర్ణ ప్రయోజనము పొందువారు. కనుకనే 'మంత్రరామాయణం'లో నీలకంఠాచార్యుడు

**"మంత్రహ్రదాత్కథాకుల్యా విద్యాకేదారమాగతా**
**మోక్షస్య చ ప్రసూర్మధ్యే పీయతే కర్మమార్గగైః"**

అనగా వేద సరస్సునుండి బయలుదేరిన ''కథలకాలువ'' జ్ఞానక్షేత్రమునకు ప్రవహించి మోక్షసస్యము ఫలింపజేయును. మార్గమధ్యమున కర్మమార్గరతులచే ఉపయోగింపబడును అని.

కనుక వేద వాఙ్మయమునకు కథలయందు అవాంతర తాత్పర్యము తప్ప అసలు తాత్పర్యములేదని, ఆ అసలు తాత్పర్యము 'జ్ఞానము'నందే అని, అవాంతర కథలన్నియు జ్ఞానమునందే లయము కావలయునని అదే ఉత్తమాధికారమని శాస్త్రనిర్ణయము. అనగా ప్రతి కథకు పై యర్థముతోబాటు జ్ఞానపరముగా అంతరార్థము భావింపవలెను.

# శ్రీశంకరాచార్య భాష్యములు

**1. ఛాందోగ్యము :**

**మం॥ "దేవాసురాహవై యత్రసంయేతిర ఉభయే ప్రాజాపత్యాః
తద్ధ దేవాః ఉద్గీధమాజహ్రుః అనేనైనానభిభవిష్యామః"**

అనగా దేవతలు రాక్షసులను 'ఉద్గీథము' అనగా ఓంకారముతో జయించెదమని దలచిరట. అస్త్ర ప్రయోగముతో సమరవ్యూహ సన్నాహములతో రాక్షసులను జయించుట ప్రసిద్ధమే. ఈ ఓంకార ప్రయోగము చిత్రముగా నున్నది. దీనికి వ్యాఖ్య వ్రాసిన ఆచార్య శ్రీశంకరులు–

**భా॥ "దేవాః దీవ్యతేః ద్యోతనార్థస్య శాస్త్రోద్భాసితాః ఇంద్రియ
వృత్తయః అసురాః తద్విపరీతాః స్వేష్వేవ అసురాః విష్వ
గ్విషయాసు ప్రాణనక్రియాసు రమమాణాః స్వాభావిక్యః
తమ ఆత్మికాః ఇంద్రియ వృత్తయ ఏవ"**

అని రహస్యోద్ఘాటన చేసిరి.

అనగా శాస్త్రబద్ధమయిన ప్రవర్తనగల శమదమాది ఇంద్రియవృత్తులు దేవతలు, విరుద్ధమయిన కామక్రోధాదులు రాక్షసులు అని మర్మము వివరించిరి. ఇంకా :

**భా॥ "అన్యోన్యాభిభవోద్భవ రూపః సంగ్రామ ఇవ సర్వప్రాణిషు
ప్రతిదేహం దేవాసురసంగ్రామః అనాదికాలప్రవృత్త ఇత్యభి
ప్రాయః.........ప్రజాపతిః కర్మజ్ఞానాధికృతః పురుషః"**

అనియు చెప్పిరి.

అనగా శమదమ×కామక్రోధముల మధ్య జరుగు హెచ్చుతగ్గులే. దేవరాక్షసుల యుద్ధము వారి జయాపజయములు. ప్రజాపతి అనగా కర్మజ్ఞానాధికారము గల సాధకుడు అని స్వామి వివరణ.

**బృహదారణ్యకము :**

**మం॥ "ద్వయా హవై ప్రాజాపత్యా దేవాశ్చ అసురాశ్చ తతః కానీయసా ఏవ దేవాః జ్యాయసా అసురాః త ఏషు లోకేషు అస్పర్ధంత తేహ దేవా ఊచుః హంతాసురాన్ యజ్ఞఉద్గీథేనాద్యయామేతి" 15**

ఇచ్చటగూడా "ఉద్గీథం"తో రాక్షసులను జయించుట ప్రస్తావింపబడినది. ఇచ్చుట 'భాష్యము' వ్రాయుచు ఆచార్యులు-

**భా॥ "కే తే దేవాశ్చాసురాశ్చ తస్యైవ ప్రజాపతేః ప్రాణా వాగాదయః కథంపునః తేషాం దేవాసురత్వమ్ ఉచ్యతే" "శాస్త్రజనిత జ్ఞానకర్మభావితాద్యోతనాత్ దేవా భవంతి" త ఏవ స్వాభావికప్రత్యక్షానుమానజనిత దృష్టప్రయోజన కర్మజ్ఞానభావితా అసురాః స్వేష్వేవాసుషు రమణాత్ సురేభ్యోన్యత్వాద్వా" 16**

అని చాందాగ్యోపద్ధతిలోనే వ్యాఖ్యానము కావించిరి. అయితే "వాక్" మొ॥ కర్మేంద్రియాలనుగూడా దేవరాక్షస విభాగములోనికి తెచ్చినారు. పైగా దేవతలు తమ్ములు రాక్షసులు అన్నలు అని గదా సంప్రదాయము. చూ॥ పూర్వదేవాః సురద్విషః". అన్నియు, అందఱు కేవలము మన మనోవ్యాపారము లయిన శమదమాదులు అయినపుడు 'చిన్న, పెద్ద' అను తేడా దేనినిబట్టి వచ్చినట్లు అను శంకకు శంకరులు-

---

15) ప్రజాపతి సంతానము రెండువిధాలు. సురలు అసురులు. సురలు చిన్నవారు. అసురులు పెద్దవారు. వారు ఈ లోకములలో పోటీపడిరి. అసురులు ఉద్గీథంతో చేసే యజ్ఞంద్వారా ఎదుర్కొందామని సురలు భావించిరి.

16) అయ్యా! సురలు - అసురులు ఎవరు? - వారు ప్రజాపతి ప్రాణములు వాగాది - ఇంద్రియములు - అయితే వారిని దేవాసురులని ఎందుకన్నారు? శాస్త్ర ప్రకారం వచ్చిన జ్ఞానం కర్మల వలన భావింపబడిన వారయి ప్రకాశించడంవలన వారు దేవతలు. సహజమయిన ప్రత్యక్షాది ప్రమాణమువలన కనబడే ఫలితాలు కర్మల వలన వచ్చినవారు అసురులు. తమ తమ ప్రాణములందు శ్రద్ధగలవారు గనుక అసురులు. సురలు కారు గనుక అసురులు అనిగూడా అనవచ్చును.

భా॥ **"అతఏవ కనీయస్త్వందేవానాం శాస్త్రజనిత ప్రవృత్తేరల్ప త్వాత్. అత్యంతయత్నసాధ్యాహిసా. జ్యాయసా అసురాః స్వాభావికీహి కర్మజ్ఞాన ప్రవృత్తిర్మహత్తరా"**

అని వివరించినారు.

అనగా – ప్రతి జీవునియందు ముందు శమదమాదులు పుట్టవు. సహజమయినవి కామక్రోధాదులు. వానికే బలము కూడా ఎక్కువ. అందువలన రాక్షసులు అగ్రజులు. శమదమాదులు నిరంతర జిజ్ఞాసా సాధనల వలన ఎప్పటికో లభించును. కనుక అవి 'అనుజులు'.

ఐహికాభిలాష, తత్సాధనార్థము కామక్రోధాదులను స్వీకరించుట అనేది రాక్షస విజయము. వైరాగ్యము దానికొఱకు 'శమదమాదులు' సాధించుట అనేది దేవవిజయము. అని ఆచార్యులు వివరించిరి.

ఇందులో రాక్షసులు జయిస్తే అనగా కామక్రోధ కలుషితమయిన జీవితము సాగిస్తే చెట్టు, చేమలు మొ॥ నీచజన్మలదాకా వచ్చును. దేవతలు జయించినచో "ప్రజాపతి" పదవిదాకా సాధకునకు సంక్రమించును. దేవరాక్షస గుణములు సమానమయినచో మనుష్యత్వము వచ్చును. అని స్వామివారి వ్యాఖ్య – చూ॥

భా॥ **"ఏవం దేవానాంజయే ధర్మభూయస్త్వాత్ ఉత్కర్షః ఆప్రజా పతిత్వప్రాప్తేః. అసురజయే అధర్మ భూయస్త్వాత్ అపకర్షః ఆస్థావరత్వప్రాప్తేః. ఉభయసామ్యే మనుష్యత్వప్రాప్తిః"**

దీనినిబట్టి "దేవాసుర సంగ్రామములు" అన్నియు మన శరీరములో జరుగునట్లు అంతరార్థము. ఆచార్య సమ్మతమని సాంప్రదాయికమని వేదకథకు శాశ్వతప్రయోజనమని తేలుచున్నది. లేనిచో "ఉద్గీథము"తో రాక్షసులను జయించుట – అనుమాట ఎట్లు సమన్వయమగును? కనుక అంతరార్థము తప్పనిసరి. ఇదే పరిస్థితి గోపికావృత్తాంతమునకు సమన్వయము చేయవలసి యుండును. ఈ కథలోని 'ఉద్గీథమే' గోపికా కథలోని మురళీధరుని 'ఉద్గీతము' అని భావించుట అసంగతమా?

"బృహదారణ్యకములోనే "ద" అను అక్షరము గూర్చి వివరించుచోట గూడా అంతరార్థము ఇట్లే చెప్పబడినది. చూ॥5. అ. 2 బ్రా.

**"త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్య మూషుః దేవాః మనుష్యాః అసురాః ఉషిత్వా బ్రహ్మచర్యం దేవా ఊచుః"17**

అను మంత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు, ఆచార్య స్వామి,

**"అథవా, న దేవా అసురా వా అన్యే కేచన విద్యంతే**
**మనుష్యేభ్యః మనుష్యాణామేవ అదాంతా యే అన్యై**
**రుత్తమైర్గుణైః సంపన్నాస్తేదేవాః లోభప్రధానామనుష్యాః**
**తధా హింసాపరాఅసురాః"**

అని అనుగ్రహించినారు. అర్థమేమనగా, దేవతలు రాక్షసులు అవి వేరే లేరు. మనుష్యులలోనే శమదమాది ఉత్తమ గుణవంతులు దేవతలు. లోభవంతులు మనుష్యులు. హింసాక్రౌర్య గుణాలవారు రాక్షసులు" అని మనుష్యులే మూడు విధములు అని వివరించిరి.

కనుక 1) శమదమాదిగుణాలు = దేవతలు
కామక్రోధాదిదుర్గుణాలు = రాక్షసులు
2) వాగాది ఇంద్రియాలు = దేవతలు
ఎముకలు మొ॥ శరీరభాగాలు = రాక్షసులు
3) పైవిగలవారు మనుష్యులు 3 విధములవారు.

వీటికే దేవరాక్షస మనుష్యాది నామకరణ మున్నట్లు దీనిని ఆలంబనముగా జేసికొని అంతరార్థ పరముగా వేదమునకు తత్సహాయకము అయిన పురాణ వాఙ్మయమునకు అర్థము చెప్పుట సమంజసమని తెలియుచున్నది.

---

17) ప్రజాపతి సంతానమయిన మూడు రకాలవారు తమతండ్రి అయిన ప్రజాపతివద్ద బ్రహ్మచర్మంగా ఉండిరి. దేవతలు మనుష్యులు అసురులు బ్రహ్మచర్యంచేసి ఇలా అనిరి.

## భగవద్గీత :

వేదములయందేగాక గీతయందు గూడా శ్రీకృష్ణభగవానుడు దైవాసుర సంపద్విభాగయోగములో వ్యక్తిగత గుణసంపదనే దైవసంపదగాను ఆసుర సంపదగాను వింగడించెను. చూ॥

**అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్**
**అహింసా సత్య మక్రోధః త్యాగ శ్శాంతి రపైశునమ్ 18**
**దయాభూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలం**
**తేజః క్షమాధృతిః శౌచ మద్రోహో నాతిమానితా**
**భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత"**

– ఇది దైవీగుణసంపద

**"దంభో దర్పో తిమానశ్చ క్రోధః పారుష్య మేవచ**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్" 19**

– ఇది ఆసురీగుణసంపద

ఇందులో దైవీగుణసంపద మోక్షసాధనమని, ఆసురీగుణసంపద బంధసాధనమని, గీతాచార్యుని నిష్కర్ష.

**"దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా"**

## సంప్రదాయము – పురాణాలు :

1) తారాశశాంక కథ గౌణముగా ఆధ్యాత్మికముగా వ్యాఖ్యానించుట సంప్రదాయసిద్ధము. లేనిచో చంద్రవ్యభిచారము, తారాదోషమునకు ఏమి

---

18) అభయం, సత్త్వగుణము, జ్ఞానయాగములు, దానము, దమము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఋజుత్వము, అహింస, సత్యము, క్రోధరాహిత్యము, త్యాగము, శాంతి, పిశున (పిసినారి) గుణం లేకుండుట, భూతదయ, లోలత్వం లేకుండుట, మృదుత్వము, హ్రీ, చపలత్వం లేకుండుట, తేజస్సు, క్షమ, ధృతి, శౌచము, ద్రోహబుద్ధి లేకుండుట, అతి మానము లేకుండుట ఇవి దైవసంపద.

19) దంభము, దర్పము, అతిమానము, క్రోధము, కాఠిన్యము, అజ్ఞానము, ఇది అసురసంపద.

ప్రాయశ్చిత్తము జరిగినట్లు. బుధుని పవిత్రత యేమని చెప్పవలయును. గురువు చంద్రునేల శపింపడు. శివుడు మొదలగువారు చంద్రునేల వధింప లేకపోయిరి. పైగా తలపై తాల్చుట ఏల?

2) భాగవతములోని "నిరంజనోపాఖ్యానము" మొదలగునవి.

3) త్రిపురా రహస్యములో కథలు అన్ని.

4) వేదములలోని అర్థవాదలు మొదలగునవి అంతరార్థ పరముగా వ్యాఖ్యానింపబడినవి.

5) కనుకనే హరివంశములో త్రిపురాసుర సంహారానికి "దీప" వ్యాఖ్య వ్రాసిన వ్యాఖ్యాత అంతరార్థము చెప్పుచు

**"ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ తత్ర కానీయసా ఏవ దేవాః జ్యాయాంసోసురాః..... ఇత్యాదినా బృహదారణ్యకోక్త రీత్యా అధ్యాత్మ విద్యాయాం అత్ర 'శమాదయో దేవాః కామక్రోధాదయో సురాః' ఇత్యభిప్రేత్య సమాధత్తే"** **20**

అని చెప్పి కథ అంతా సుగుణదుర్గుణ సమ్మర్దముగా, శివుని సాధకునిగా వర్ణించెను. అంతరార్థమునకు సంబంధము లేకుండా బాహ్య కథాశరీరము కోసము జరిగిన వర్ణనలను ఏదోరకముగా అంతరార్థము లోనికి బలవంతముగా లాగి పీకి సమన్వయము చేయకుండగా –

**"విశేషణాంతరాణి కథాశోభార్థాని"** **21**

అని చెప్పినారు.

అనగా – అంతర్యామి ఆత్మగాను, బాహ్యకథ శరీరముగాను భావించి కథావ్యాఖ్యానము చేసినారు. కనుక పురాణ వ్యాఖ్యాన సంప్రదాయమిది.

---

20) దేవాసురులు ప్రజాపతి సంతానము. అందు దేవతలు చిన్నవారు. అసురులు పెద్దవారు అని మొదలుపెట్టి బృహదారణ్యకం చెప్పిన తీరుగా, ఈ అధ్యాత్మవిద్యలో శమాదులు దేవతలు, కామక్రోధాదులు అసురులు – అని భావించి సమాధానం చెప్తున్నాడు.
21) కథలో మిగిలిన విశేషణాలు కథాశోభకోసం చేసిన కల్పనలు.

ఇంతేగాక, "భారతాంతమున 'త్రిపురాసురవధ' మూడవసారి చెప్పబడినది. అందుకు కారణము అందలి తత్వాంశమును, భారతతత్వమునకు పోల్చి సమన్వయమును గ్రహింపుమని వ్యాఖ్యాతలు అంతరార్థమును సూచించిరి.

శ్రీ కామకోటి స్వామివారు తమ ఉపన్యాసములో (చూ॥ సాధనమండలి వారి జగద్గురు బోధలు)

**"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః**
**మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ"**

అను గీతాశ్లోకమునకు అంతరార్థము ఇట్లు దేహపరముగా అనుగ్రహించిరి.

**సారాంశము :**

| | | |
|---|---|---|
| ధర్మక్షేత్రే | = | ధర్మాచరణ స్థానమయిన |
| క్షేత్రే | = | శరీరమునందు |
| కురు | = | కర్మాచరణ (ధర్మము) చేయుము. |
| మామకాః | = | "మమ"కార సంబంధమయిన రాజసతామస గుణములు. |
| పాండవాః | = | తెల్లనివి అనగా సాత్వికవృత్తులు యుద్ధ సన్నద్ధమయినవి. |
| కిం | = | ఏదో, అనుభవైక వేద్యమును |
| అకుర్వత | = | చేసిరి |
| సన్ | = | సత్పురుషుడవై |
| జయ | = | జయము పొందుము |

కనుక "అంతరార్థ కథనము" ఆ అంతరార్థముగూడా దేహపరముగా జ్ఞాన, యోగ సంబంధముగా చెప్పుట సంప్రదాయగుప్తము అని స్పష్టమగు చున్నది.

## పరోక్ష వైఖరి :

అంతరార్థము ఒకటి, బాహ్యార్థము ఒకటిగా చెప్పే యీ పద్ధతిని "పరోక్షవైఖరి" అందురు. ఈ "పరోక్షవైఖరి" వేదములో ఒక పద్ధతిగా అనూచానముగా నున్నది. కనుకనే బృహదారణ్యము - 4లో -

**"పరోక్షప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్విషః ఇంధో హ**
**నామైష యోయం దక్షిణేక్షన్ పురుషః తం వా ఏత మింధం**
**సంతం ఇంద్ర ఇత్యాచక్షతే పరోక్షేణైవ, పరోక్షప్రియా ఇవ**
**హి దేవాః ప్రత్యక్షద్విషః"**

అనగా మనదేహమున దక్షిణ నేత్రమున దర్శనమిచ్చు జీవుడు "ఇంధుడు" వానినే "ఇంద్రుడు" అని పిలుచుచున్నారు. ఎందుకనగా దేవతలు తమ పేరు ప్రకటించుట ఇష్టపడరు గదా. కనుకనే పురాణ గాధలలో కొన్ని విషయాలను "దేవరహస్యములు" అందురు. కనుక వారి గాథలు, వారిపేర్లు, పరోక్షీకరించి చెప్పబడుట వేదపురాణ సంప్రదాయము. మఱొకచోట "ఇదింద్ర, ఇంద్ర" అనియు చెప్పబడినది.

## తంత్ర గ్రంథాలు :

ఈ పరోక్షవైఖరి మన తంత్ర గ్రంథములలో గూడా కన్పడుచున్నది. అంతరార్థము తెలియనిదే ఈ గ్రంథముల నుపయోగించలేము, చూ॥

**"గంగా యమునయోర్మధ్యే బాలరండా తపస్వినీ**
**బలాత్కారేణ గృహ్ణీయాత్ తద్విష్ణోః పరమం పదమ్"**

ఈ పద్యమునకు బాహ్యార్థ మేమనగా-

"గంగ, యమున" అనే పుణ్య నదులమధ్య ఒక బాలవేశ్య తపస్సు చేయుచున్నది. ఆమెను బలాత్కరించినవారికి వైకుంఠము లభించునని యర్థము. ఈ యర్థము ఎంత చక్కగా కుదురునో తెలియుచున్నది. ఈ "ప్రహేళిక"కు వ్యాఖ్యగా యీ క్రింది పద్యము చూచినచో అంతరార్థము బోధపడును.

**"ఇడా పింగళయోర్మధ్యే బాలరండా చ కుండలీ**
**తస్మాత్సంచాలయేన్నిత్యం సుఖసుప్తా మరుంధతీం"**

| | | | |
|---|---|---|---|
| అనగా – | గంగాయమునలు | = | ఇడాపింగళనాడులు |
| | బాలవేశ్య | = | కుండలినీశక్తి |
| | బలాత్కారము | = | ప్రాణసాధన |
| | వైకుంఠము | = | యోగసిద్ధి అని అర్థము. |

**2) 'రుద్రయామలము'లో**

**"మద్యం మాంసం చ మత్స్యంచ ముద్రాంమైధున మేవచ**
**మకారపంచకం ప్రాహు ర్యోగినాం ముక్తిదాయకమ్"**

అని ఉన్నది. అనగా పంచమకారములు – మద్యము, మాంసము, మత్స్యము ముద్ర. మైధునము – ఇవి యోగులకు ముక్తిని ఇచ్చునట. ఇది నిజమయితే అందఱు యోగులే. మఱి అంతరార్థ మేమిటి? రుద్రయామళము వంటి గ్రంథము ఇటువంటి అనర్థకరములైన అర్థములు చెప్పునా అని ఆలోచించ వలయును. ఈ శ్లోకమును, ఈ పంచమకారములను "ఆగమసారము" ఇట్లు వివరించెను.

**1. "వ్యోమ పంకజ నిష్యంద సుధాపాన రతో భవేత్**
**మద్యపాన మిదం ప్రోక్తం ఇతరే మద్యపాయినః"**

అనగా – సహస్రారము నుంచి స్రవించు ఆనందామృతమే "మద్యము" మామూలు కల్లుకాదు. అటువంటి మద్యమే యోగికి మోక్షదాయకమగును.

**2. పుణ్యాపుణ్యోభయం హత్వా జ్ఞానఖడ్గేన యోగవిత్**
**పరే లయం నయేచ్ఛిత్తం స మాంసాశీ నిషేవ్యతే"**

మాంసము అనగా : మన పాపపుణ్యములు పశువులు. వాటి ఫలము "మాంసము". వాటిని జ్ఞానపూర్వకముగా తటస్థముగా అనుభవించుటయే "మాంసము" తినుట.

**3. "మన" ఆదీంద్రియగణం సంయమ్యాత్మనియోజయేత్**
**సమీనాశీ భవేద్దేవి ఇతరేప్రాణఘాతకాః"**

**గంగా యమునయోర్మధ్యే మత్స్యౌ ద్వౌ చరత స్తథా**
**తౌ మత్స్యౌ భక్షయేద్యస్తు స భవేత్ మత్స్యసాధకః"**

అనగా "మత్స్యము" అనగా మామూలు చేపకాదు. ఇంద్రియములతో కలిసి పనిచేసే "మనస్సు" అని జ్ఞానపరముగాను ఇడాపింగళలలో సంచరించు "ప్రాణము" అని యోగపరముగాను చెప్పబడినది. అట్టి మనస్సును సాధనలో రహితము చేయుటయే "మత్స్యభక్షణము".

4. ముద్ర (ఇదియు ఇట్టిదే. వివాదాస్పదము కాదుకనుక వివరించలేదు.)

5. మైథునమనగా మామూలు "సురతము, కామక్రీడ" అని అర్థము చెప్పరాదు.

**"సహస్రారోపరి బిందౌ కుండలినీమిలనాత్ శివే**
**మైథునం పరమం దివ్యంయతీనాం పరికీర్తితమ్"**

సహస్రార చక్రమునందు కుండలినీశక్తి బైందవ స్థానమున లీనమగుటయే అనగా శరీరములోని "శివశక్తుల" సమ్మేళనమే "మైథునము".

కనుక ఆధ్యాత్మిక గ్రంథములు ఉపాసనా గ్రంథములు ఈవిధముగా పరోక్షీకరించి చెప్పబడినవి. ఇంతేగాక లలితా సహస్రనామ భాష్యములో భాస్కరరాయలు ఉదాహరించిన "చింతామణిస్తవ" శ్లోకము గూడా పైకి అశ్లీలార్థమును, ఆంతర్యమున యోగార్థమును వ్యక్తపఱచుచున్నది చూ॥

**"కులాంగనైషాపృథ రాజవీథీః**
**ప్రవిశ్య సంకేత గృహాంతరేషు**
**విశ్రమ్య విశ్రమ్య పరేణ పుంసా**
**సంగమ్య సంగమ్య రసం ప్రసూతే"**

– చింతామణిస్తవః

బాహ్యార్థ మేమనగా "ఒక కుల స్త్రీ రాజవీధులలో తిరుగుచు సంకేత గృహములకు పోయి పరపురుషునితో విశ్రమించి ఆనందము పొందుచున్నది" ఇది యేమి స్తోత్రము?

అంతరార్థ మేమనగా – కులచక్రమునందున్న కుండలినీశక్తి సుషుమ్నా మార్గమున ప్రయాణించుచు కుడ్యచక్రములందు ఆగుచు క్రమముగ "పరమ పురుషునితో" కలిసి సాధకునకు ఆనందరసమును వర్షించును – అని.

ఇది యోగపరమయిన స్తోత్రము కాదా?

కనుక పరోక్ష పద్ధతి అంతరార్థ ప్రాధాన్యము, మన వాఙ్మయమున అనూచానము, సనాతనము.

ఆర్షగ్రంథములు ఆరాధనాగ్రంథములు. ఇవియేకాక "కాళిదాసాది" ప్రాచీన కవులు గూడా తమ గ్రంథములను అంతరార్థములతోనే తీర్చిదిద్దిరి. వారి గ్రంథములు పురాణ మూలకములే కదా. ఇందుమతీ స్వయంవర ఘట్టము చక్కని "యోగవిజయ" ఘట్టము. "పరమాత్మ – కుండలిని" సంయోగమే ఇందుమతి స్వయంవరము. అందలి పేర్లు విశేషణములు ఆయర్థమునే సూచించును. ఉదా॥

**"న హి ప్రఫుల్లం సహకార మేత్య**
**వృక్షాంతరం కాంక్షతిషట్పదాళిః"      22**

ఇందులో వికసించిన ఆజ్ఞాచక్రమును చేరిన తరువాత ఆరుపద్మము లందు తిరిగిన "అళి" అనగా "శక్తి". ఇక దేహాంతరమును కోరదు అనగా జీవన్ముక్తి వైరాగ్యము కల్గును. ఇట్లే ఇతర సమన్వయము.

ఈ ప్రస్థానమున శ్రీహర్షుడూ సుప్రసిద్ధుడే.

'గ్రంథి గ్రంథి రిహ క్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా' అన్నవాడు. తన గ్రంథములో గ్రంథులు పెట్టినట్లు వానిని గురువును ఆరాధించి తెలిసికొనవలెనని చెప్పెను. ఇక ఆర్షగ్రంథముల గూర్చి చెప్పవలసినదేమి?

---

22) వికసించిన మామిడిచెట్టును లేదా ఆజ్ఞాచక్రమును చేరిన తుమ్మెదల గుంపు / షచ్చక్రముల స్నేహితురాలయిన కుండలిని మరొక వృక్షమును / దేహమును కోరదు. సహకారం అనగా హకారముతో గూడిన ఆజ్ఞాచక్రం. ఆజ్ఞాచక్రంలో "హం, క్షం" అని రెండు బీజములుంటాయి. షట్పదమంటే ఆరుచక్రాలు. ఆళి – అనగా స్నేహితురాలు.

## వ్యాసఘట్టములు :

భారతము విషయములో వ్యాసుడు స్వయముగనే చెప్పెను.

**"అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోకశతానిచ**
**అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా నవా"**

అనగా భారతములో '8,800' దుర్బోధమయిన శ్లోకములు గలవు. వీటిని వ్యాసఘట్టములు అందురు. ఇవి వ్యాసునకు తెలియునట. శుకునకు తెలియునట. సంజయుడు ఎఱుగునో ఎఱుగడో అనుమానమట. ఈ పరిస్థితిలో భారతముగూర్చి మనకు అంతా తెలియుననుకొనుట ఎంత అసంగతమో. ఇక స్వయముగా ఆధ్యాత్మిక గ్రంథమయిన "భాగవతము" గూర్చి దాని అంతరార్థములగూర్చి సందేహము అసంగతము గదా.

## పరోక్షవైఖరికి కారణము :

1) ప్రత్యక్షంగా వేదాంతము చెప్పినచో దానికి శాస్త్రమునకు భేదములేదు. పురాణములు మిత్రసమానములు. ''రామునివలె ఉండవలసినది రావణునివలె ఉండరాదు" అని ఉదాహరణ ముఖముగా మిత్రునివలె నచ్చ చెప్పును. కనుక 'కథారూపము'గా చెప్పవలయును. 'ఇతిహాస సముచ్చయము' అనుగ్రంథములో –

**"మునిర్వివక్షుః భగవద్గుణాన్నః**
**సఖాపి తే భారత మాహకృష్ణః**
**యస్మిన్ నృణాం గ్రామ్యసుఖానువాదైః**
**మతిః గృహీతాను హరేః కథాయామ్"**

అని చెప్పబడెను.

అనగా – "మనుష్యులకు నచ్చే సుఖాలను ప్రస్తావిస్తూ తద్వారా విష్ణు కథలయందు పాఠకులకు ఆసక్తి కలిగింపదలచినవాడై 'వ్యాసమహర్షి' భారతము వ్రాసెను. లేకపోతే "భగవద్గీత, కపిల దేవహూతి సంవాదము" వలె నిర్లక్ష్యమునకు గుఱియగును.

2) పురాణములు అన్నియు అధ్యాత్మ విద్యాగ్రంథములు. యోగజ్ఞాన కాండలు. 'రెండు' సమన్వయమై నడచును. కొన్ని యోగరహస్యములు అర్హత లేనివారు తెలిసికొనరాదు. గురువు పర్యవేక్షణలో శిష్యుడుండి తెలిసికొని ఆచరింపవలయును. బ్రహ్మంగారు శరీరములోనున్న చక్రముల గూర్చి బోధించుచుండగా విన్న ఒక 'బోయవాడు' "తన భార్య శరీరములో ఉన్న చక్రములను చూచినచో తనకు ముక్తి కల్గునని' కుతూహలముతో భార్యను కత్తితో చీల్చిచంపెను. చక్రములు కనబడక బ్రహ్మంగారి వద్ద విలపించెను. అప్పుడాయన వానిని మందలించి తన మహిమతో వాని భార్యను బ్రతికించెనట. కనుక యోగవిద్య శ్రుతపాండిత్యముతో ఆచరింప దగినదికాదు. అందువలన పురాణములలో అది "పరోక్షము" చేసి కథగా చెప్పబడును.

3) అంతేగాక యోగ విద్యారహస్యములు గురుశిష్యుల మధ్యగోప్యముగా నుంచవలెనని శాస్త్రము. యోగ మహిమలను రహస్యములను ప్రకటించుట ప్రారంభించినచో శక్తి క్షీణించును. యోగవిద్య జడపదార్థము కాదు. పరాశక్తి. చైతన్యరూపము. శాస్త్రనియమమును ఉల్లంఘించి ఆత్మోత్కర్షకు పాల్పడినచో శిక్ష తప్పదు. మఱల అక్షరాలవద్ద నుంచి ప్రారంభమే. విశ్వామిత్రుని కథ యిందుకు ఉదాహరణము. అందువలననే వేదశాస్త్రములు ఇట్లు చెప్పుచున్నవి.

**"విద్యా హ వైబ్రాహ్మణ మాజగామ**
**గోపాయ మాం శేవధిష్టేహమస్మి**
**అసూయకాయానృజవేయతాయ**
**న మాం బ్రూయా వీర్యవతీ యథా స్యామ్"**

అనగా బ్రహ్మవేత్త అయిన వానివద్దకు వచ్చి బ్రహ్మవిద్య ఇలా అడిగినదట. అయ్యా నీవు నన్ను జాగ్రత్తగా కాపాడుము. కపటాత్మునకు అసూయాగ్రస్తునకు అనర్హునకు అనగా నియమ రహితునకు నన్ను వెల్లడి చేయవద్దు. లేనిచో నా బలము నశించును" అని.

యోగవిద్య గుఱించి

**"యోగవిద్యా పరా గోప్యా యోగినాం సిద్ధి మిచ్ఛతాం**
**దేవీవీర్యవతీ గుప్తా నిర్వీర్యా చ ప్రకాశితా" 23**

అని యున్నది. యోగవిద్య వెల్లడి చేసినచో ఫలహీనము అగును. ఇంతేకాదు. ప్రతివారును తాము జపించు 'మంత్రమును' ఇతరులకు వెల్లడింపరాదు. అను నియమము జగమెఱిగినదే. కేవలము శిష్యుడై చేరినవానికి దప్ప ఎవరికి 'మంత్రము' చెప్పరాదు కనుకనే –

**"రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ"** అన్నారు.

అనగా రాజ్యము ధారవోయువచ్చును. శిరస్సు కత్తిరించి యీయవచ్చును. షోడశాక్షరి మాత్రము యివ్వదగినదికాదు అని. మంత్రము "స్వమాతృజార వద్గోప్యం" అని ఆమ్నాయములు చెప్పును.

ఏతావాతా, తేలినదేమనగా మన గ్రంథములకు "పరోక్షధోరణి, అంతరార్థ ప్రాధాన్యము అనునవి సనాతన అనూచాన లక్షణములు. కనుక మనము కథా విరోధములను అంతరార్థ పరముగా సమన్వయము చేయవలయును. మన దృష్టి అంతరార్థమువైపు మళ్ళించుటకే కథలో కొన్ని **"అసంగతులు"** కల్పించెదరు. ఉదా॥ గజేంద్రమోక్షములో –

1) గజేంద్ర మకరేంద్రులకు నిరాహారంగా 1000 సంవత్సరములు పోరాట మెట్లసాగును. మకరమయినా వేరే ఆహారమునకు పోదా. ఈ 1000 సంవత్సరాలు ఆ సరస్సునకు మఱొక ప్రాణి రాలేదా? పోనీ–

2) ఆ సరస్సులో మకరేంద్రుని అనుచర మకరేంద్రులు లేరా? వారంతా కలిసి గజేంద్రుని ఎందుకు లోపలికి లాగలేదు.

3) మకరేంద్రుని నుంచి విడిపించుటకు 'గజము' నిర్గుణస్తోత్రము చేయుట ఏల? ఇంద్రాది దేవతలలో ఎవడయినా విడిపింపగలడు కదా.

4) చివఱకు 'గజేంద్రుడు' గజ శరీరముతో బ్రతుకదలచలేదని, మోక్షమిమ్మని వాపోవనేల?

23) సిద్ధి కావాలనుకొనే యోగులు తమ యోగవిద్యను రహస్యముగా ఉంచవలయును. గుప్తంగా ఉంటే శక్తి శక్తిమంతంగా ఉంటుంది. వెల్లడిస్తే నిర్వీర్యమవుతుంది.

**"జీజీవిషే నాహ మిహాముయాకిం**
**అంతర్బహిశ్చావృతయేథయోన్యా"** **24**

5) 'గ్రాహము మోహము' అను రెండు పదములతో గ్రాహము నుంచి గాక మోహమునుంచి ముక్తి యివ్వమని గోరుట ఏల?

**"ఇచ్ఛామి కాలేన న యస్య విప్లవః**
**తస్య ఆత్మలోకావరణస్య మోక్షణమ్"** **25**

వ్యాసమహర్షి గూడా కథ ముగింపులో -

**"గజేంద్రో భగవత్ స్పర్శాత్ విముక్తో జ్ఞానబంధనాత్"** **26**

అని చెప్పిరి. కనుక ఈ "వ్యంజకముల" వలన వ్యంగ్యమయిన అంతరార్థమే గ్రహింపవలెను. పురాణములను ఒక రకమయిన "అప్రస్తుత ప్రశంసాలంకారములుగా" వ్యాఖ్యానించినచో చక్కగా సమన్వయమగును.

**బాహ్యార్థ ప్రయోజనము :**

అంతరార్థము అందఱికి తెలియదు గదా. బాహ్యార్థము అప్రస్తుతము గదా. మఱి 'సామాన్యులు' భారత – భాగవతాదులు చదివినందున ఫలమేమి?

1) శ్రవణఫలము – కీర్తన ఫలము.

2) బాహ్యార్థ పరామర్శ వలన వచ్చే ధర్మాధర్మ జ్ఞానము.

3) భగవల్లీలానుసంధానము – మననము.

4) **"అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతో ఽపి వా**
**యః స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః"** **27**

అన్నట్లు ఈ కథలన్నియు 'భగవల్లీలలు' గనుక మనము ఎట్లు స్మరించినను పవిత్రత కలిగించును.

5) ఇదిగాక లలితా సహస్రనామ భాష్యములో చెప్పిన–

---

24) లోపల, బయట మొద్దుతనం ఆవరించిఉన్న యీ గజశరీరంతో నేను బ్రతుకగోరను.
25) కాలంవలన చెడని ఆత్మలోకానికి ఆవరణ మయిన అజ్ఞానము నుంచి మోక్షం కోరుచున్నాను.
26) భగవానుని స్పర్శచేత గజేంద్రుడు అజ్ఞానబంధము నుంచి బయటపడెను.
27) పవిత్రుడయినా అపవిత్రుడయినా ఏ అవస్థలోనున్నా పుండరీకాక్ష స్మరణచేసినవాడు లోనబయట పవిత్రుడగును.

**"అయోగిభిరపిభావనా మాత్రేణ సర్వాప్యేషా ప్రక్రియా (యోగప్రక్రియా) సంపాద్యతే"** **28**

అను మాటప్రకారము అందఱును సంధ్యావందనతత్వము గాయత్రీరహస్యము తెలియకపోయినను 'సంధ్యావందనము' ఆచరించినట్లు 'తత్వము' తెలియక పోయినను ప్రామాణ్య బుద్ధితో తీవ్రభక్తితో భగవత్కథాను సంధానము చేయవలయును. అట్టి ప్రపన్నులకు భగవంతుడు-

**"దదామిబుద్ధియోగం తం యేనమామనుయాంతితే"**

అను ప్రతిజ్ఞ ప్రకారము జ్ఞానమీయగలడు. వాల్మీకి, శబరి, గుహుడు, కన్నప్ప, నారదుడు అట్టివారే కదా. దేవీభాగవతంలో సత్యవ్రతుడు, సుదర్శనుడు అట్టివారే కదా.

అర్థమేలేని "మరా, ఏ క్లీ" అను పదములను నిరంతరము ఉచ్చరించుట వలన గదా వాల్మీకి, సత్యవ్రతుడు, సుదర్శనుడు తరించిరి. ఇక ఏదో ఒక అర్థము గ్రహించుకొని భాగవతాదులను అనుసంధానము చేసినవారు తరింపరా. కనుక అంతరార్థము తెలియకపోయినను బాహ్యార్థముతోనైనా 'భగవత్కథా పరిచయభాగ్యము గల్గుట కొఱకే గ్రంథములు వ్రాయబడినవి.

ఆచార్య శంకరులు చెప్పినట్లు -

**"శ్రుతిమతస్తర్కోను సంధీయతాం"**

అని గ్రంథానుకూల సాంప్రదాయిక సమాలోచనము చేయవలెను. వ్యతిరేక ధోరణి పతనహేతువు. కనుక భాగవతమునందలి "రాసలీలా ఘట్టము" వ్యభిచారముగాక 'యోగాచారమ'ని గ్రహింపవలయును. ఆ విషయమై ప్రమాణములు ఈయబడుచున్నవి.

**భాగవత వ్యాఖ్యాతలు :**

**"రాసక్రీడావిడంబనం కామవిజయఖ్యాపనాయేత్యేవ తత్వమ్"**
**"శృంగారకథావ్యపదేశేన విషయతోనివృత్తి పరేయమ్"**

అని వ్యాఖ్యాతలు నిర్ణయించిరి.

28) యోగం తెలియని వారయినా ఈ యోగప్రక్రియ తమలో జరుగుతున్నట్లు భావన చేయాలి.

అనగా పైకి శృంగారకథగా ఉన్న ఈ వృత్తాంతము 'విషయవైరాగ్యము'ను వివరించుచున్నది. ఈ 'రాసక్రీడా' వృత్తాంతము "కామవిజయము"ను సూచించును, అని అర్థము. వ్యభిచార శృంగారకథ 'వైరాగ్యము'ను ఎట్లు సూచించును. కామునకు భగవంతుడే లొంగినట్లున్న కథ కాముని జయించునట్లు సూచించుట యెట్లు సాధ్యము. అది కేవలము అంతరార్థపరముగానే సాధ్యము.

## సనాతన గోస్వామి :

ప్రసిద్ధ కృష్ణభక్తుడయిన ఈ స్వామి తన గ్రంథములో –

**"హ్లాదినీశక్తి విలాస లక్షణ పరమప్రేమమయీ ఏవ ఏషా రిరంసా నతు కామమయీ"** అని స్పష్టీకరించినారు.

అనగా భగవంతునిలోని 'ఆనంద – స్వభావము' హ్లాదినీశక్తిగా కృష్ణ సంప్రదాయము వారు చెప్పెదరు. ఆమెయే రాధ. భగవంతునిలో ఆత్మారామ ఆనంద లక్షణములే ఈ కథయందు 'రాసలీల'గా చెప్పబడినవి. పద్మపురాణాది పురాణాంతర పర్యాలోచన వలనగూడా ఈ 'రాసలీల' ఆధ్యాత్మికమని ముందు పేజీలలో వ్యక్తము కాగలదు.

## గ్రంథములో ఉన్న 'ఆధ్యాత్మిక' సూచనలు :

1) ఈ రాసలీలోత్సవమును "బ్రహ్మరాత్రము" అన్నారు. అనగా జ్ఞానరాత్రి అంతేగాని కాలరాత్రి కాదు. కామరాత్రి కాదు. బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన 'రాత్రి'.

2) రాసలీలకు పోరాదని కొందఱు గోపికలను వారి పెద్దలు నిరోధించిరి. కాని వారి మనస్సు భగవంతునియందు లీనమయినది. ఆగలేని పరిస్థితి వారిది. అందువలన తక్షణమే భగవద్ధ్యాన తీవ్రతతో దేహమును విడిచిపెట్టిరట. అనగా మరణించిరి. లేదా అచ్చటనే సమాధిలో లీనమయిరి చూ॥

**"జహుః గుణమయం దేహం సద్యః ప్రక్షీణ బంధనాః"**

3) తన దగ్గఱకు వచ్చిన గోపికలతో భగవంతుడు "ఇళ్ళకు వెళ్ళండి నా శరీర సంగము వలన మీకు ప్రయోజనము లభించదు.

'శ్రవణదర్శనధ్యానము'ల వలన కీర్తన వలన తరింపగలరు అని చెప్పెను. ఈ మాటలు 'కాముకుని మాటలు' కావు. కామినులకు విరుద్ధమయిన యీ మాటలు 'భగవంతునకు, ఉపాసన చేయువారికి మధ్య జరిగిన 'పరివస్యా రహస్యము' లంటేనే చక్కగా కుదురును. చూ॥

**"శ్రవణాద్దర్శనాత్ ధ్యానాత్ మయి భావో నుకీర్తనాత్**
**న తథా సన్నికర్షేణ ప్రతియాత తతోగృహాన్" 29**

4) గోపికలను 'భగవంతుడు' అనుగ్రహించు విషయసన్నివేశములను మహర్షి ప్రయత్నపూర్వకముగా 'ఆధ్యాత్మిక సన్నివేశము'తో పోల్చి వర్ణించు చుండెను. గజేంద్ర మోక్షములోగూడా గ్రాహమును మోహముగా వర్ణించుట ఇట్టి వ్యంజకమే. అట్లే గోపికలు –

**1) "దేహో యథాదిపురుషో భజతో ముముక్షూన్" 30**

**2) "తన్నః ప్రసీద పరమేశ్వర మాస్మ భింద్యాః**
**ఆశాం చిరాత్ త్వయి ధృతాం అరవిందనేత్ర" 31**

కృష్ణుని 'పరమేశ్వర' అని పిలుచుట, వేణుగానముతో వారియందు రేగినట్లు మనకు కనబడిన ఆశ వారియందు ''చిరాత్'' ఉన్నదని చెప్పుచున్నారు. (చిరాత్ = చిరకాలంగా)

3) "యోగీవానంద నిర్భరా" ఒక గోపిక స్థితి ఇది.

4) చుట్టూ గోపికలు మధ్య 'హరి' ఈ దృశ్యము.
"పురుషః శక్తి భిర్యథా" అని వర్ణింపబడినది.

"తన శక్తుల మధ్యనున్న (జీవాత్మ) పరమాత్మ" వలె కృష్ణుడున్నాడట. దీనికి వ్యాఖ్యాతలు–

---

29) శ్రవణం, దర్శనం, ధ్యానం, సంకీర్తనం వలన తరించినట్లు నా సమీపములో ఉండడం వలన తరించరు. కనుక మీ యింఢ్లకు వెళ్లుడు.
30) సేవించు మోక్షకాములను ఆది పురుషుడు స్వీకరించినట్లు మమ్ము ఆదరింపుము.
31) పద్మనేత్ర, మాయందు దయయుంచి ప్రసన్నుడవుకమ్ము. నీయందు చిరకాలంగా పెట్టుకొన్న ఆశలను వమ్ము చేయకుము.

"ప్రకృత్యాద్యుపాధిభిః సత్వాదిభిః ఉపాసకః జ్ఞానవీర్యబలాదిభిః"**32** అని వివరించినారు.

ఉపాసకునిలోని సద్గుణములకు గోపికలకు సామ్యము చెప్పిరి.

5) జరిగిన కథలో యమునా తీరములో స్వామి అంతర్ధానము, గోపికా గర్వభంగము, సామూహిక ఆనంద నృత్యము - ఇవియన్నియు కథలోని అలౌకికత్వమును సూచించుచున్నవి.

6) గ్రంథములోని కొన్ని "ప్రత్యేకతలను" బట్టిగూడ "కథ" అంతరార్థమును గ్రహింపవచ్చును.

**7) అసహజత్వము :**

ఒకబాలుడు 7 ఏండ్ల వయస్సువాడు - ఇంతమంది స్త్రీలతో విహరించుట.

గోపికలు భగవంతుని పాదములను స్తనములపై నుంచుమని కోరుట.

కృష్ణుని జారత్వమునుగూర్చి గోపికలు యశోదతో ప్రస్తుతించి తమ నట్లుండుట నందుడు కృష్ణుని ఉపేక్షించి శిక్షింపక వదలివేయుట.

తమ 'గోపికల'ను ఇంటివద్ద నిరోధించిన గోపవృద్ధులు కృష్ణునిగూర్చి ఏమీ అనకపోవుట.

గోపికలకు అపూర్వ ఆవేశం ఆ శరద్రాత్రిలోనే కలుగుట.

కృష్ణుని వేణునాదానికి చరాచర ప్రపంచము "నరుల నుంచి దేవతలదాకా" పరవశులు అగుట.

కృష్ణునిది "అస్ఖలిత శృంగారమని" ప్రత్యేకించి చెప్పుట.

ప్రత్యేకముగా 'శరదృతువు'ను గ్రహించుట.

కృష్ణుని "వనమాల"ను ప్రతిసారి వర్ణించుట.

కృష్ణుని 'విశేషణములు' మొదలగునవి.

---

32) శక్తులు అంటే ప్రకృతి మొ॥ ఉపాధులు, సత్వం మొదలయినవి, జ్ఞాన వీర్యబలాదులతో కూడిన ఉపాసకుడు.

# ద్వితీయ పింఛము

## కామము

మానవ బాలుడుగా చూచినచో ఈ కామక్రీడ అసంభవము. దైవంగా ఆలోచిస్తే భౌతిక శృంగారముకాదు. దైవానికి భౌతిక శృంగారము అవసరము లేదు గనుక. అవసరమనుకొన్నను తత్కాలముననే కొందఱు స్త్రీలను సృష్టించి క్రీడ సాగింపవచ్చును. పరస్త్రీలు పరకన్యలు కావలసిన అవసరము గాని సంఘ మర్యాద చెడగొట్టవలసిన అవసరముగాని లేవు. ఇది 'భౌతికమే' అనుకొన్నవారు "భగవంతుడు ఏమిచేసినా తప్పులేదు" అని భావించి, ఆయనను ప్రశ్నించుటకు, మనమెవరమని మిన్నకుండవలెను. భగవంతునితో వ్యభిచరించుట వలన గోపికలకుగూడా దోషములేదని తృప్తిపడవలయును. కాని అసలు ఇట్టి క్లిష్ట పరిస్థితి ఎందుకు భగవంతుడు కల్పించినట్లు? ధర్మోద్ధరణకు పుట్టినవాడు ఈ అధర్మమును ఏల ఆచరింపవలెను అన్న ప్రశ్నకు సమాధానము దొరకదు. ఈ కామమును గూర్చి భాగవతము రెండు విధములుగా సమాధానము చెప్పెను. 1) భౌతిక కామము అనుకొంటే–

**"తేజీయసాం న దోషాయ వహ్నేః సర్వభుజో యథా**
**నైతత్సమాచరేజ్జాతు మనసాపిహ్యనీశ్వరః**
**వినశ్యత్యాచరన్ మౌఢ్యాత్ యథా రుద్రోబ్ధిజం విషం**
**ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితంక్వచిత్**
**తేషాం యత్ స్వవచోయుక్తం బుద్ధిమాంస్తత్తదాచరేత్**
**గోపీనాం తత్పతీనాంచ సర్వేషాం చాపి దేహినాం**
**యోంతశ్చరతి సోధ్యక్ష ఏష క్రీడన దేహభాక్"**

**భాగవతం**

అనగా అగ్ని సమానులయినవారు సాహసములు చేయుదురు. అవి జీర్ణమగును. పాపపుణ్యములకు వారు అతీతులు కాగలరు. మనము అట్లు చేయరాదు. మనము విషము తిన్నచో చచ్చెదము. రుద్రుడు క్షేమముగా నుండెను.

మహాత్ముల వచనములు సత్యములు ఆచరణీయములు. వారిచర్యలు వారి మాటలకు సరిపోవుచున్నపుడు మాత్రమే సత్యములు. ఇది "భౌతికకామ" మని భావించి సమర్థించుట. మఱి 'గోపికలు' ఏమయినట్లు?

కామము అభౌతికమను సూచనతో, చెప్పిన చివఱి శ్లోకమునుబట్టి, కృష్ణుడు శరీరాంతర్గతుడయిన పరమపురుషుడే కనుక గోపికలకు పరపురుష సంపర్కము గాదని 'పరమ పురుష' సంపర్కమని భాషన. కనుక గోపికలకు పాపము లేదని నిర్ణయము. అట్లయినచో-

1) జలంధర భార్య తులసికి విష్ణు సంగమమువలన ధర్మభ్రష్టత ఎట్లు సంభవించెను? సంభవించుట వలననేగదా జలంధరుడు మరణించుట.

2) కృష్ణుని వద్దకు వచ్చిన బ్రాహ్మణ కాంతలను కృష్ణుడు వెళ్ళుడని యేలపంపించెను? వారిని తనతోనే నివసించుటకు ఎందుకు అనుమతింపలేదు?

కనుక ఈ చిక్కు ప్రశ్నలకుగూడా సమాధానము అంతరార్థమునందే దొరకును. ఎట్లనగా భగవంతుడు అంతరాత్మ. సర్వప్రాణులకు ఆయనయే 'పతి'. ఇతర పతులు దేహమునకే. దేహభావనకు పతిభావనకు సంబంధము గలదు. కథలు ఆధ్యాత్మ భావనకు సంబంధించినవి. ఉపదేశములు ఇహలోకాచరణకు సంబంధించినవి. కనుక అంతరార్థ పరమయిన కథలలో కనబడు దివ్యలీలలు 'చారిత్రకము'లని భ్రమించి మనము ఆచరింపరాదు. అది పాపకారణము. అంతరార్థపరముగా దోషముకాని 'తారాశశాంక' చరిత్రను బాహ్యార్థపరముగా నిజమని భ్రమించినచో చంద్రుని గౌరవింపలేము. మనము వావివరుసలను మంటగలిపి పతనము చెందెదము. కనుక మహాత్ముల చరిత్రలను అనుకరించుట మయసభలో దుర్యోధనుని నడక అవుతుంది. ఇదే శుకుని వివరణలోని అంతరార్థము. "విష్ణుపురాణము" గూడా.

**"సోపి కైశోరకవయో మానయన్ మధుసూదనః**
**రేమే తాభి రమేయాత్మా క్షపాసు క్షపితాహితః**
**తద్భర్తృషు తథా తాసుసర్వభూతేష చేశ్వరః**

**ఆత్మస్వరూపరూపోసౌ వ్యాపీవాయురివ స్థితః**
**యధాసమస్తభూతేషు నభోగ్నిః పృథివీ జలమ్**
**వాయుశ్చాత్మా తథైవాసౌ వ్యాప్య సర్వమివ స్థితః" 33**

అని అంతరాత్మ - జీవాత్మ మధ్య జరిగిన క్రీడగానే సూచించుచు 'గోపికాకృష్ణులకు' దోషము లేనట్లు సూచించినది.

ఈ కామము సాధారణము కాదని భగవత్కామమే యని "ముముక్ష" అని ఈ గ్రంథమందే వ్యంజకములు గలవు.

1) గోపికల మధ్యలోనున్న శ్రీకృష్ణునిగూర్చి ముని వర్ణించుచు-

**"తత్రోపవిష్టో భగవాన్ స ఈశో**
**యోగేశ్వరాంతః హృదికల్పితాసనః**
**చకాస గోపీపరిషద్గతోర్చితః**
**త్రైలోక్య లక్ష్మ్యేకపదం వపుర్దధత్" 34**

ఇది కృష్ణుని త్రివిక్రమ స్వరూపమును ఓంకారాకారమును తెలుపుచున్నదే కాని అతని 'జారత్వము'ను చెప్పునది కాదు. ఇది మొదట చెప్పినట్లు 'అహల్యా జారత్వము' వంటిది.

2) బాలగోపికలు ఐదు ఏండ్ల వయసువారు (కృష్ణుడు ఏడు ఏండ్ల వయసువాడు కృష్ణుని భర్తగా జేయుమని గౌరీవ్రతము సాగించిరి. "జారుడు" కావలెనని వ్రతము చేయుట ఎట్లు పొసగును. వారిని వర్ణించుటలో కవి యౌవనవతులను వర్ణించినట్లు కుచకుంభజఘనాదులను వర్ణించెను. సహజ కవితాపరమయిన వర్ణనగా దానిని తీసికొనవలెనుగాని నిజముగా ఆ

33) మాధవుడు తన బాలవయసును పాటిస్తూ ఆ గోపికలతో రమించెను. ఆయన అహితములను తొలగించును. వారి భర్తలయందు ఆ గోపికల యందు, సర్వజీవులందు ఆత్మరూపంగా వాయువువలె వ్యాపించియున్న ఈశ్వరుడతడు. సమస్త జీవులయందు ఆకాశము, అగ్ని, భూమి, జలము వాయువు ఆత్మ ఉన్నట్లు పరమాత్మ సర్వమునందు వ్యాపించియున్నాడు.

34) యోగీశ్వరుల హృదయంలో స్థానంగల ఆ ఈశ్వరుడు గోపికా మధ్యమున గూర్చుండును. లోకత్రయలక్ష్మీమనోహరమయిన శరీరంతో ఆయన గోపికల సభామధ్యంలో అందముగా నుండెను.

'వ్రజకుమారికలకు' శరీరమంత గడుసుదేరినట్లు భావించుట హేతుబద్ధము గాదు. ఈ వ్రతమునకు ఫలితముగా భగవంతుడు వారికి వాగ్దానము చేసిన విలాసమే 'రాసలీల' అందులోనికి ఇతర స్త్రీలు వచ్చిన వత్తురుగాక. గౌరీ వ్రతఫలము అయిన రాసలీల వ్యభిచారమనుట ఎట్లు. ఐదు ఏండ్ల వయసుగల పిల్లలతో ఏమి శృంగారము? కనుక ఈ శృంగారము "భౌతికము" కాదు.

3) 'బ్రహ్మ' గోపకులను, దూడలను దాచి కృష్ణమహిమ పరీక్షించు ఘట్టములో, భగవంతుడు 'కాయవ్యూహ'మను యోగసిద్ధి ప్రదర్శించెను. గోపకులుగా, దూడలుగా తానే రూపములు దాల్చి గోపికలకు పుత్రుడుగా ఒక్క సంవత్సరకాలము గడిపినట్లున్నది గదా. ఇది పరకాయ ప్రవేశముగూడా కాదు. స్వయముగా వారి పుత్రుడుగా గడపినాడు. అట్టి పుత్రుడు, సోదరుడు అయిన హరి తరువాత అదే గోపికలతో భౌతిక కామమునకు పాల్పడినాడనుట "వాదన కైనను' అసహ్యమయిన ఆలోచన.

అయినచో "నఖక్షత అధరపాన స్తనమర్దనాదులు వర్ణింపబడెను గదా. దానినిబట్టి ఈ గాథ శృంగారమనిపించుట లేదా అని ప్రశ్న. దీనికి సమాధానము - కథయంతయు జ్ఞానగాథను సూచించుచున్నది. కొన్ని శ్లోకములయందు మాత్రమే చెప్పిన పై "నఖక్షతము" మొదలగు శృంగారమును సూచించుచున్నవి. ఈ రెంటిలో దేనినిబట్టి గ్రంథస్వభావము నిర్ణయింపవలెను.

**1) మహర్షినిబట్టి (వ్యాసుడు)**
**2) పరీక్షిత్తు పరిస్థినిబట్టి - ముమూర్షువు (చావబోవువాడు) ముముక్షువు**
**3) శుకయోగినిబట్టి (చెప్పినవాడు)**
**4) కథాప్రయోజనమునుబట్టి (మోక్షము)**

ఈ గ్రంథము ఆధ్యాత్మికమని నిర్ణయింపవలసియున్నది. విరుద్ధాంశములను సూక్ష్మముగా పరిశీలించి ఆధ్యాత్మికమునకు సమన్వయము చేయవలసి యుండును. లేదా బాహ్యార్థ శోభకొఱకు కవి చమత్కారముగా అట్లు చెప్పెనే కాని "నఖక్షతము" మొదలగునవి జరుగలేదని భావింపవలసి యుండును. గజేంద్ర మోక్షములోని కథలో 'కథ అంతరార్థములో గ్రాహము మోహమయినచో గజేంద్రుడు ఆర్తసాధకుడైనచో ఆ 'గ్రాహము' గజేంద్రుని

లాగుట, పీకుట మొదలగు విషయములు కథాశోభగా చెప్పినట్లు చెప్పవలసి యుండును. ఆర్తసాధకునకు తొండము, తోక, దంతములు, మోహమునకు కోరలు, కాలుపట్టుట కుప్పించి దూకుట మొదలగునవి ఉండునా? కనుక వాటిని బింబప్రతిబింబములుగా అంతరార్థములో సమన్వయము చేయవలయును. లేదా కథాశోభ కొఱకు వర్ణించెను - అని చెప్పవలెను.

హరివంశ 'దీప' వ్యాఖ్యలో వ్యాఖ్యాత త్రిపురాసుర సంహారమును ఆత్మపరముగా వ్యాఖ్యానించి "విశేషణాంతరాణి కథాశోభార్థాని" అనిచెప్పిన మాట ఇంతకుముందే చెప్పియున్నాను.

అయినను "నఖక్షతము" మొదలగు భౌతిక శృంగార వ్యంజకము లయిన విషయములను బింబప్రతిబింబములుగా అధ్యాత్మ సమన్వయము ఎట్లు చేయవచ్చునో ముందు నిరూపించెదను.



# తృతీయ పింఛము

## ఉన్మీలనము - గోవులు

ఈ విధముగా భాగవతము నందున్న కథలన్నింటివలెనే యీ "రాసలీల" అధ్యాత్మపరమని "అంతరార్థము" గ్రహించుటయే శాశ్వత తాత్పర్యమని అట్లయిననే యీ గ్రంథము "వేద ఫలము"గా తేలునని భావించి యుంటిమి. అట్లయినచో ఆ సమన్వయమెట్లు?

గోవులు, గోపికలు, గోపకులు, గోలోకము, కృష్ణుడు, రాధ మొదలగు ఈ యంశములకు అధ్యాత్మ సమన్వయమెట్లు? అన్న ప్రశ్నకు ఇందు సమాధానము చెప్పవలసి యున్నది. అందు ముందుగా గోవుల విషయము అనుకొనవలెను.

గోవులు :

''ఐతరేయోపనిషత్తు''లో లోక లోకపాల జీవసృష్టి గుఱించి వివరించబడినది. ఆ వివరము సంగ్రహముగా ఇట చెప్పికొనవలెను.

**"ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన**
**మిషత్ । స ఈక్షత లోకాన్ను సృజా ఇతి । స ఇమాన్**
**లోకానసృజత అంభో మరీచీః మరం ఆపః । అంభః**
**పరేణ దివమ్. ద్యౌః ప్రతిష్ఠా అంతరిక్షం మరీచయః,**
**పృథివీ మరో యా అథస్తాత్తా ఆపః" ॥**

అనగా మొదట పరమాత్మ ఒక్కడే ఉండెను. మరేదీలేదు. పరమాత్మ సృష్టి చేయదలచినవాడై "అంభః మరీచీ, మర, ఆపో" లోకములను సృజించెను. అందు 'మరీచి' అనగా 'అంతరిక్షము' అని వేదమే వివరించినది. దీనిని ఆచార్య శంకరులు వివరించుచూ-

**"ద్యులోకాత్ అధస్తాత్ అంతరిక్షం యత్ తన్మరీచయః**
**.....మరీచిభిః వా రశ్మిభిః సంబంధాత్"** అన్నారు.

కిరణములు పఱచికొని యుండుటవలన అంతరిక్షమును 'మరీచి' లోకమందురు అని అర్థము. ఈ "మరీచుల"నే గోవులు అని చెప్పవలసి యున్నది. "గోవులు" అనగా కిరణములు అని అర్థము. ఇట్టి కిరణములే సృష్టి హేతువులు. పదార్థము రూపుదాల్చనంత వఱకు 'శక్తిమయ'మే అయియుండును. ఆ శక్తిప్రవాహములే కిరణములు. శూన్యములో పదార్థోత్పత్తికి కారణము భగవంతుని "చిచ్ఛక్తి". ఆ శక్తియే 'అణిమాది' శక్తులతో ప్రపంచమును సృష్టించినది. ఈ అణిమాదులను ఆ శక్తి కిరణములుగా పెద్దలు వర్ణించిరి.

**"అణిమాదిభి రావృతాం మయూఖైః అహమిత్యేవ**
**విభావయే భవానీం"**
**"స్వభాభి రణిమాద్యాభిః సేవ్యాం సర్వనియామికామ్"**

కనుకనే "గోమాతా గుహజన్మభూః" అని లలితాసహస్రనామ స్తోత్రములో పరమేశ్వరి 'గోమాత'గా కీర్తింపబడినది. గో అనగా కిరణములకు మాతా తల్లి అని అర్థము. విశ్వవ్యాపకమయిన సృష్టి కారణమయిన కిరణములకు మూలమయిన 'మహాశక్తి' అందుచే ఆమె 'గోమాత' అని చెప్పబడినది.

అందువలననే రాక్షసభార పీడితురాలయిన భూదేవి బ్రహ్మాది దేవతల సభలకు వెళ్ళునపుడు పురాణములో ఆమె గోరూపధారిణియై వెళ్ళినట్లు చెప్పబడుచుండును. దేవతా ప్రతిరూపమన్న కారణముతోనే గదా, గోవుకు గౌరవము. మఱి స్వయముగా దేవత అయిన భూమి 'గోరూపము' దాల్చనేల. ఒక పశు రూపమునకు ఏమి గౌరవము. కనుక అది 'కిరణ' రూపమే. కాంతిరూప భగవచ్ఛక్తి నుండి పదార్థ రూపమయిన భూమిగా అవతరించిన "భూదేవి" మఱల ఆ భగవానునివద్దకు భౌతిక పదార్థరూపమున చేరలేదు. కనుక మఱల శక్తి (కిరణ) రూపముతోనే స్వామిని చేరవలయును. అందు వలన పరోక్షముగా "గోరూపధారిణి"యై వెళ్ళినట్లు చెప్పబడుచుండునని గ్రహింపవలయును.

లోకములు మూడు అని ఒక వ్యవస్థ. ఏడు అని 14 అని ఒక వ్యవస్థ. మూడు అనే వ్యవస్థలో "భూః, భువః, సువః" ఇవి మూడు లోకములు. అతలవితల మొదలగు 7 అధోలోకములు భూమిలో కల్పెదరు. "సత్య తపః జనః మహః" లోకములను "సువః" లోకములో కల్పి చెప్పెదరు. "భువః" ఏ లెక్కలో నయినను ప్రత్యేకముగా నుండును. ఈ లోకము 'అంతరిక్షము' అని చెప్పబడును. ఉపనిషత్తులో చెప్పబడిన 'మరీచి' లోకము ఇదే. దీని యందే సూర్యచంద్ర నక్షత్రాది కాంతిపదార్థములు దృశ్యమానమగుచుండును. వీటిమూలము సత్యలోకము నుండి ప్రారంభమయి "మహర్లోకము" ప్రాంతమునకు "కాంతి"గా దృశ్యమానమగును. అందువల్లనే దానిని మహర్లోకమందురు. మహః= కాంతి అని యర్థము. ఈ మహర్లోకము నుండి యీ కాంతిరేఖలు మనకు అంతరిక్షములో సూర్యచంద్రాదులుగా దృశ్యమానమగును. "పాలపుంత – సౌరకుటుంబము" అన్నట్లుగా ఊహింపవచ్చును. ఐతరేయములో చెప్పబడిన నాలుగు లోకముల వ్యవస్థలోని "మరీచి" అనబడు అంతరిక్షము మహర్లోకము నుండి, అంతరిక్షము వఱకు వ్యాపించిన 'మరీచి' లోకము కావచ్చును. ఇదే గోలోకముగా చెప్పబడి యుండవచ్చును. ముందు 'గోలోకము' అన్న శీర్షికలో చెప్పబోవు ఇతర పురాణ ప్రమాణములను బట్టి యీ గోలోకము లేదా గోకులము 'మహర్లోకము' అని యూహింపవచ్చును. అచ్చటినుంచి వచ్చు కాంతిమూలములు శక్తి ప్రవాహములు అయిన కిరణములే గోవులు. గోశబ్దమునకు 'కిరణములు' అని యర్థముండుట గూడా యీ ఊహకు బలము ఇచ్చుచున్నది.

ఈ కిరణములను మనకు ప్రసరింపజేయు వెండిపళ్ళెము వంటివాడు "సూర్యుడు", భూమికి సంబంధించినంతవఱకు సూర్యుని మించిన దైవము శక్తిమంతమయిన గోళము మఱియొకటిలేదు.

ఆదిత్యోపాసన మన ఆరాధనలో ముఖ్యమయినది. అవతార పురుషుడయిన శ్రీరామచంద్రుడు సైతము ఆదిత్యు నారాధించెను. 'ఆదిత్య హృదయము' రామాయణమునందు ముఖ్యమయిన పారాయణ ఘట్టము. ఆదిత్యోపాసన రెండు విధములుగా నున్నది.

1) ఆదిత్యుని ప్రత్యక్షముగా సేవించుట.

2) అక్షి పురుషోపాసనవలె ఆదిత్య - అంతర్గత పురుషుని ఉపాసించుట. ఇది గాయత్రి ఉపాసన వంటిది. గాయత్రిలో సూర్యునిగాక సూర్యతేజస్సును ధ్యానించెదరు. "శక్తి శక్తిమతోరభేదః" (శక్తికి శక్తిమంతునకు భేదంలేదు) అని సరిపుచ్చవచ్చును. కాని సరిపుచ్చవలసిన పరిస్థితిలో మంత్రమేల పుట్టెను? అంతరార్థముకోసమేనని సమాధానము.

**"యదాదిత్యగతం తేజః జగద్భాసయతేఖిలమ్**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్" 35**

అను గీతావాక్య ప్రకారము సూర్యతేజస్సు భగవంతుని తేజమే. అదే గాయత్రీరూపము. కనుకనే 'గో' శబ్దమునకు 'గాయత్రి' అను అర్థము గలదు. చూ॥

**"గాయత్ర్యామపి గంభీరే, జగత్యాంభువనేజలే"**

లేదా గో= వాక్కు. కనుక గో= గాయత్రి అనియు చెప్పవచ్చును. చూ॥ ఛాందోగ్యము.

**"గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ, వాగ్వై**
**గాయత్రీ వాగ్వా ఇదం భూతం గాయతిచ త్రాయతేచ" 36**

అని చెప్పబడినది. కనుక -

గోవులు= గాయత్రులు, వాక్కులు, మంత్రములు, కిరణములు. ఈ కాంతివలననే -

"తమేవభాంత మనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి"

**అను మంత్రము ప్రకారము సూర్యతేజస్సు పరమాత్మ తేజస్సే. కనుకనే** ప్రతి దేవతకు 'సూర్యమండలము' నివాస మయినట్లు "నామముల"లో కనబడును.

---

35) ఆదిత్యునియందు, చంద్రుని యందు, అగ్నియందు ఉండి సర్వజగత్తును వెలిగించు వెలుగునాదే.

36) ఈ సమస్త భూతము గాయత్రియే. ఇంకేదయినా ఉన్నదంతయు గాయత్రియే. వాక్కు గాయత్రి. ఇది సమస్త భూతమున్ను వాక్కే. గానము చేయును రక్షించును.

**"భగమండలమధ్యస్థా భైరవీ భగమాలినీ"** **37**

(లలితాసహస్రనామస్తోత్రం)

**"ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః** **38**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయవపుః పురుషః పురాణః"**

ఈ విధముగా సూర్యుడు కేవల బింబముగాక 'పరమాత్మ పీఠము'గా కనిపించును. సూర్యకిరణములు భగవంతుని శక్తికింజల్కములు. తద్దర్శనము తదర్చనము పాపహరము. అవియే భూ సృష్టికి ప్రత్యక్ష కారణాలు. కనుక ఆదిత్య కిరణములు = గోవులు. ఆదిత్యునిలోని నారాయణుడే కృష్ణుడు. కనుక గో సహస్ర పరివారియైన నారాయణుడే సూర్యనారాయణుడు. "కృష్ణుడు ఆధ్యాత్మిక సూర్యుడని" మేడమ్ బ్లావెట్స్కీ వ్రాసినట్లు "రాసలీలా కిరణము'' (కొత్త రామకోటయ్యగారు) అన్న గ్రంథములో నుదహరింపబడినది.

## ఆదిత్యునకు – కృష్ణునకు పోలిక :

1) ఆదిత్యుడు సహస్రకిరణుడు. 16 తిథులు వచ్చుచుండును. (పూర్ణిమను అమావాస్యను విడిగా తీసికొన్నచో 16 తిథులు అగును.) సూర్యకిరణ సహస్రమును 'కళ' అందురు. 16వ వంతునకు 'కల' అందుము. చంద్రుని విషయములో ఇది ప్రసిద్ధమే. అట్టి కలలు 16 అనగా రోజుకు 1000 కిరణములు చొప్పున 16 రోజులు 16000 కిరణాలు – ఇవి కృష్ణుని గోపికలతో సరిపోవును. 1000 అనగా అనంతము అని అర్థము. చూ॥

**"భానోః కరస స్రస్య కలాసంజ్ఞానుమీయతే"**
**"శతం సహస్రమయుతం సర్వ మానంత్యవాచకమ్"**

---

37) సూర్యమండల మధ్యము నందలిది భైరవపత్ని.

38) సూర్యమండలమధ్యమున నున్నట్లు, పద్మాసనము మీద ఆసీనుడయినట్లు మకర కుండల కేయూర కిరీటములు ధరించినట్లు, బంగారు శరీరము గలిగియున్నట్లు ఆ పురాణ పురుషుడయిన నారాయణుని ధ్యానము చేయవలయును.

ప్రతి గోపికకు ఒక గోవును ప్రతీకగా తీసికొనవలయును.

సూర్యుడు కాంతి దాతయేగాక 'కాలప్రదాత' గూడా. కనుక కాలపరముగా గూడా 'గోవులు' ఏవో తెలియవలెను.

**కాలపరముగా :**

కాలవిభాగాలు - 15.

(1) లవ (2) త్రుటి (3) కల (4) కాష్ఠ (5) నిమేష (అర సెకను) (6) మాత్ర (4 సెకన్లు) (7) నాడీ (= 24 ని॥) (8) ముహూర్త (48 ని॥) (9) దిన (30 ముహూర్తాలు 1 దినం) (10) మాస (11) సంవత్సర (12) యుగ (13) కల్ప (14) మహాకల్ప (15) పదార్థములు - ఈ 15 కాలవిభాగాలు. మన్వంతరములు గూడా కలిపితే - 16. వీని అన్నిటియందు ఉన్న కాలాంశములు అనేకములు అనంతములు. అనంతమును సహస్ర సంఖ్యతో చెప్పుట సంప్రదాయము. కనుక

**"సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్"**

అనుపురుషసూక్తము సరిపోవుచున్నది. కనుక 16000 కాలవిభాగాలతో కూడిన వాడే 'సూర్యనారాయణుడు'. ఆకాశపు గడియారములో సూర్యచంద్రులు ముళ్ళవంటివారు. అందు సూర్యుడు మహాకాల ప్రమాణసూచకుడు. భగవంతుని 'కాలస్వరూపుని'గా ఆరాధించుట మన సంప్రదాయములో గలదు. భాద్రపద శుద్ధచతుర్దశినాడు చేయబడు అనంత పద్మనాభస్వామి వ్రతములో స్వామిని కాలరూపునిగా వర్ణించిరి. చూ॥

**"కలాకాష్ఠ ముహూర్తాది దినరాత్ర శరీరవాన్"**

పైగా ఈ శరీరమునకు 7 పడగలు. పడగకు 2 తలలు చొప్పున 14 తలలు.

**"ఫణైః సప్తభిరావిష్టం పింగళాక్షం చతుర్భుజం"**

అనగా "కల" నుంచి లెక్కవేసినచో 14 కాల విభాగములు. కాలశబ్దము 'కల' నుంచి పుట్టినది కనుక 'కల'తో మొదలగుట యుక్తమే. మఱియు

వారమునకు 7 రోజులు. రోజుకు అహోరాత్రములు 2.7×2=14 ఈ విధముగా వార స్వరూపము వచ్చినది. పైగా అనంతపద్మనాభ నక్షత్రము లుదయించురోజు చతుర్దశి అనగా 14వ రోజు. కృష్ణుడు గీతలో-

**"కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః"**

అని తనను కాలస్వరూపముగా చెప్పికొనెను. అంతేకాక పరమశివునకు "మహాకాలుడు, కాలకాలుడు, సమయుడు" అని నామములు కలవు. శక్తికిగూడా "మహాకాళి, సమయా" అని నామములు గలవు. కనుక కాలమే సూర్యుడుగా నారాయణుడుగా కాలపురుషుడుగా చెప్పబడినది. భగవంతుడు గీతలో తాను కాలపురుషుడనని చెప్పికొన్న విషయము ఇచ్చట కల్పి ఆలోచించుట స్పష్టతకు కారణమగును.

కనుక సూర్యకిరణజన్యములయిన కాలవిభాగములు= గోవులు. తత్పాలకుడు 'కృష్ణుడు' అని ఒక దృక్పథము.

**సంవత్సర స్వరూపుడు :**

"శ్రీచక్ర విలసనము"లో

**"హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి శ్రుతిః"**

అని పరమేశ్వరుని సంవత్సర స్వరూపునిగా చెప్పిరి. (హాయన= సంవత్సరం)

'యజ్ఞో వై సంవత్సరః' అని 'యజ్ఞో వై విష్ణుః' అనియు చెప్పబడినది. కనుక సంవత్సర స్వరూపుడు పరమాత్మయే. పరదేవినిగూడా లలితా సహస్రనామములలో-

**"ప్రతిపన్ముఖ్య రాకాంత తిథి మండలపూజితా"**

అని వర్ణించిరి. కనుక తిథి మండల పరివేష్టితమయిన సంవత్సరరూప కాలస్వరూపమునే ఆయా దేవతలుగా ఆరాధకులు భావించెదరు.

'కలల సమూహము' కాలము అని యర్థము. ఆ 'కల'కు కాలవిభాగములో కల అని ఒక అర్థము. తిథి అని మఱొక అర్థము. మొదటి అర్థము ప్రకారము

ఇంతకుముందు మహాకాలస్వరూపునిగా చెప్పియున్నాము. రెండవ అర్థము ప్రకారము సంవత్సర స్వరూపునిగా చెప్పవచ్చును.

**"దర్శాంతాః పూర్ణిమాంతాద్యాః కలాః పంచదశైవతు**
**షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ"** **39**

**- భావనోపనిషత్తు**

కనుక 16 కలలు×సహస్రం (=అనేకం అనే అర్థములో) 16000 గోపికలు. వారితో భాసించు సంవత్సర కాలస్వరూపుడయిన పరమాత్మయే కృష్ణుడు. అట్లే సూర్యుడు.

**దేహపరముగా :**

ఈ శరీరమును 'పిండాండ' మందురు. పిండీకృతమయిన బ్రహ్మాండమే ఇది. బ్రహ్మాండమునందు ఉన్న అన్నియు ఈ పిండాండము నందున్నట్లే మన సంప్రదాయము. సుషుమ్నా నాడియందు సమస్తలోకములు భాసించునని యోగశాస్త్రము చెప్పుచున్నది. ఈ విషయమంతయు సాధకునకు అనుభవసిద్ధము. సాధకేతరులకు అవిశ్వాసులకు ఇది అందదని యోగశాస్త్రము చెప్పుచున్నది. చూ॥

**"యస్య దేవే పరాభక్తిః యధా దేవే తధా గురౌ**
**తస్యైతే కధితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః"**

దైవభక్తి గురుభక్తి ఉన్నవారికి మాత్రమే ఈ అర్థములు ప్రత్యక్షమయి అగును - అని అర్థము. ఏదయినను మనము శాస్త్రదృష్టితో ఈ విషయములను అవగతము చేసికొనవచ్చును.

సూర్యుడు భగవత్తేజస్సును గ్రహించినవాడు. ఆ తేజస్సునుండి యీ ప్రపంచము పుట్టినది. ఈ ప్రపంచంలోనేయున్న మన శరీరములుగూడా సూర్యతేజస్సుతో ఏర్పడినవే. మనలోని కుండలినిని 'సూర్యకుండలిని' అనియు నందురు. మనలోని బుద్ధిగతచైతన్యము సూర్యకాంతి అయిన "గాయత్రి"యే.

---

39) పాడ్యమి నుండి పూర్ణిమ / అమావాస్య వఱకు 15 కలలు లేదా తిథులుగలవు. సచ్చిదానందరూపురాలయిన దేవి 16వ కల.

ప్రపంచమునకు మన "పిండాండము" "Micro Cosm" అనవచ్చును. కనుక "గోవులు" అనునవి శరీరమునందును ఉండి యుండవలయును.

సూర్యరశ్మలు మన నాడులందు ప్రవహించునని నాడీరసములు అందువలననే "రంగులు" ఏర్పఱచికొనునని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. చూ॥

**"ఆదిత్యస్య రశ్మయ ఉభౌ లోకౌ గచ్ఛంతి - ఇమం**
**చాముంచ - అముష్మా దాదిత్యాత్ ప్రతాయంతే, తా ఆసు**
**నాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే" ఛాం - 8 40**

అనగా సూర్యకిరణములు మన శరీరములోని నాడులలో ప్రవేశించి నాడులద్వారా విస్తరించును.

**"అధ యా ఏతా హృదయస్య నాడ్యః తాః పింగళస్యా**
**ణిమ్నః తిష్ఠంతి శుక్లస్య నీలస్య పీతస్య లోహితస్య ఇత్య 41**
**సావాదిత్యః పింగళ ఏష శుక్ల ఏష నీలఏష పీతఏష లోహితః" ఛాం.8**

అనగా మన నాడులలో ప్రవహించు సూర్యతేజస్సు ఆయా రంగులలో ప్రవహించును. ఆచార్య వ్యాఖ్యానములో గూడా-

**"ఆదిత్యసంబంధాదేవ తత్తేజసో నాడీష్వనుగతస్య ఏతే**
**వర్ణవిశేషాః అసౌ వా ఆదిత్యః పింగళః వర్ణతఏష ఆదిత్యః**
**శుక్లోప్యేష నీలఏష పీతఏష లోహిత ఆదిత్య ఏవ"**

అని యర్థము చెప్పిరి.

అనగా ఆయా నాడులనుబట్టి సూర్యకాంతికే ఆ రంగులు కనబడుచున్నవి. లేదా సూర్యునియందే ఈ రంగులు అన్నియునున్నవి. అనగా దేహనాడులలోని చైతన్యము సూర్యకిరణములే యని ఉపనిషత్తు చెప్పినట్లు అయినది.

---

40) ఆదిత్యుని రశ్మలు (కిరణాలు) ఉభయ లోకాలకు వెళ్లును. ఈ లోకము ఆలోకముగూడా ఈ ఆదిత్యుని నుంచి నాడులు విస్తరించును. అవి ఈనాడులయందు వ్యాపించినవి. ఈనాడులనుండి విస్తరించుచున్నవి.

41) ఈ హృదయనాడులు పింగళ శుక్ల, నీల, పీతలోహితకర్ణాలు గలవి. ఈ ఆదిత్యుడు పింగళుడు. శుక్లుడు (తెలుపు) నీలవర్ణుడు. పీతవర్ణుడు. లోహిత వర్ణుడు.

**"శతంచైకాచ హృదయస్య నాడ్యః**
**తాసాం మూర్ధాన మభినిస్స్రుతైకా**
**తయోర్ధ్వమాయ న్నమృతత్వ మేతి**
**విష్వఙ్ఙన్యా ఉత్క్రమణేభవంతి"** **ఛాం.**

అనగా ఈనాడులలో హృదయ పుండరీకముతో సంబంధమున్న నాడులు 101. అందులో ఒకనాడి. (ఇదియే సుషుమ్న అని యోగశాస్త్రము) వలన వ్యక్తి ఉన్నత లోకములు చేరగలడు. మిగిలిన నాడులు 'ఉత్క్రమణ'మునకు ఉపయోగపడును. ఈ సుషుమ్నయే భగవదాశ్రయము. కనుక దేహమధ్య గతమయిన "సుషుమ్న – దానిచుట్టునున్న ఇతర నాడులు" అను అంశమే "కృష్ణుడు – గోవులు" గా చెప్పబడినది. నాడులు – కిరణములు ఆధారాధేయ భావముతో దగ్గఱ పడినవి. కనుకనే నాడులను గోవులు (అనగా కిరణాలు) అని చెప్పవచ్చును.

దేహంలో ఆదిత్యస్థానము "మణిపూరము'. అది పూర్వాపరలోకాలకు 'సంధి' అయిన 'సువర్లోకము' యొక్క ప్రథమభాగము. అచ్చటనుండి నాడులు పైకి క్రిందకు పోవును. అది నాభిస్థానము (కనుక బండి చక్రములో 'కన్ను' 'నాభి') అందురు. దానినుంచియే కడ్డీలు అన్నివైపులకు పోవును. అట్లే మణిపూరము నుంచి సూర్యకిరణములు అన్నివైపులకు ప్రసరించును. ఆ విషయమే పూర్వము చెప్పినట్లు ఛాందోగ్యోములో–

**"ఏతా ఆదిత్యస్యరశ్మయః ఉభౌలోకౌ గచ్ఛంతి ఇమం చాముంచ"** అని యున్నది.

కనుక దేహగత "సూర్యుడు" = కృష్ణుడు అని చెప్పవచ్చును. ఇక సాధనలో "సుషుమ్న" అగ్నిమయము. నాదమయము జ్ఞానమయము అగును. అపుడు నాడులు అన్నియు తమతమ వృత్తులు మాని 'సుషుమ్న'కు అభిముఖములు అగును.

**"నాదాసక్తం తథాచిత్తం విషయాన్నహికాంక్షతి" హ॥ ప్ర॥ 42**

---

42) నాదము రుచి మరిగిన మనస్సుకు విషయ వాంఛ నశిస్తుంది.

అన్నట్లు కృష్ణవేణుగానమునకు పరవశలయి పనులు మానిన గోపికలు మేతలు మాని మోరలెత్తిన గోవులు ఈ "సుషుమ్న" వైపు మఱలిన నాడులే అని పోల్చవచ్చును.

## రశ్మలు :

యోగశాస్త్రప్రకారము ఆజ్ఞనుంచి మూలాధారము వఱకు కాంతి కిరణములు ప్రసరించును. అవి శరీర సృష్టికి మూలము శరీరమునకు సంబంధించిన దృశ్య అదృశ్య రూపములయిన రక్తమాంసాదులు, ఇంద్రియాలు మొదలగునవి వీనినుంచియే ఉత్పన్నమయినవి. ఈ కిరణములు "రశ్మలు" అని చెప్పబడినవి. రశ్మలు= కిరణములు అని యర్థము. కనుక మన 'గోవులు'=రశ్మలు అని చెప్పవచ్చును.

ఆజ్ఞ మూలాధారములకు, త్రికూటములని త్రివేణి అని పేర్లు గలవు. వీనికి పై ముడి 'రుద్రగ్రంధి' క్రిందిముడి బ్రహ్మగంధి.

ఈ రశ్మలు 360. ఇది సంవత్సర దినసంఖ్యతో పోలుచున్నది. ఆ విషయము ముందు చర్చించెదము.

చూ॥ మూలాధారములో 28 రశ్మలు

**"శబ్దస్పర్శౌ రూపరసౌ గంధః తన్మాత్రకా ఇమే**
**భూతాని ధీంద్రియాణీతి పంచకర్మేంద్రియాణి చ**
**మనోబుద్ధి రహంకారః చిత్తంచేతి చతుర్విధమ్**
**అంతఃకరణమేతద్వై కాలః ప్రకృతిపూరుషౌ**
**మహత్తత్వమిదం జ్ఞేయం అష్టావింశతి సంఖ్యకమ్" 43**

**- చక్రకౌముదీ**

ఇవి శివశక్త్య భేదముతో స్త్రీపురుష రశ్మలుగా 28×2=56. రశ్మలు మూలాధారము నందున్నవి. మూలాధారము భూమి చక్రమయినను ఈ 'రశ్మలు' కిరణములే అనగా తేజోరూపములే.

---

43) శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు "మనస్సు, బుద్ధి అహంకారము, చిత్తము" అను 4 విధముల అంతః కరణము కాలము ప్రకృతి పురుషులు మహతత్త్వము ఇవి 28 రశ్మలు.

**"తేజోరూపాశ్చ తాః జ్ఞేయాః సర్వాః పార్థివశక్తయః" - చక్రకౌముది**

ఈ రశ్ములు గోవులు. వీటి అధిపతులయిన దేవతలే గోపికా గోపకులు అని చెప్పవచ్చును. ఈ విధముగా అన్ని చక్రములలో కలిపి

**"షష్ట్యుత్తరం చ త్రిశత మేవం శంభుమరీచయః**
**తాసాం స్మరణమాత్రేణ జీవన్ముక్తో భవేన్నరః" - చక్రకౌముది**

మొత్తము 360 కిరణములు గలవు. వీటిని స్మరించినచో వ్యక్తి జీవన్ముక్తుడగును.

**"తాసాం పూజనతో నృణాం బ్రహ్మహత్యాది నశ్యతి**
**లక్ష్మీవాన్ ధ్యానతో వశ్యం రశ్మిసంఘే విశేన్నరః"**

ఈ కిరణశక్తులను ధ్యానించి పూజించినచో బ్రహ్మహత్యాది పాతకములు నశించును. ధ్యానమార్గమున వ్యక్తి యీ రశ్మి సంఘములోనికి ప్రవేశింపవలయును. గోకులకృష్ణుడు గూడా ధ్యానమార్గముననే యీ గోసంఘము మధ్యన ప్రవేశించెనని భావింపవలయును. భౌతికమార్గము కాదు. హరి యోగమాయతో కలిసి పుట్టెనుగదా. యోగీశ్వరేశ్వరుడని బిరుదుగల అవతారమిదే గదా. సర్వయోగమార్గములను చెప్పిన 'జగద్గురువు' ఆయనయేగదా. కనుక ధ్యానమార్గమున ఆయన ప్రవేశించెననుట ఎంతయో సమంజసము. ఈ రశ్మి సిద్ధాంతము ప్రకారమయినచో మొత్తము 6 చక్రముల ప్రాంతము అనగా భ్రూమధ్యము నుంచి మర్మస్థానము వఱకు "గోలోకము" అనగా రశ్మిసంఘము అనియు చెప్పవచ్చును.

ఈ 'రశ్మి సంఘము' గురించి మంత్రపుష్పములో రోజూ వినుచుందుము.

**"పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖం అధో**
**నిష్ట్యా వితస్త్యాంతేనాభ్యా ముపరితిష్ఠతి జ్వాలమాలాకులం**
**భాతి విశ్వస్యాయతనం మహత్....... తస్య మధ్యే మహానగ్నిః**
**విశ్వార్చిః విశ్వతోముఖః తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ**
**స్తస్య సంతతాః సంతాపయతి స్వం దేహం ఆపాద**
**తలమస్తకమ్ తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవ**
**స్థితా నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా నీవార**

**శూకపత్తన్వీ పీతాభాస్వత్వణూపమా తస్యా శ్శిఖాయా**
**మధ్యే పరమాత్మా వ్యవస్థితః" 44**

కృష్ణుడు ధరించే 'నెమలికన్ను'కు సరిపోయే యీవర్ణన మనదేహమునకు గూడా సరిపోవును. ముఖ్యముగా 'వీపు' వైపునకు బాగా అతుకును.

ఈ మంత్రపుష్పమునుబట్టి గూడా మనదేహమున నాభిపైన రశ్ములుననవని వాటిమధ్యన వహ్నిశిఖామధ్యమున "పరమాత్మ" గలదని తెలియుచున్నది. దీనినిబట్టి గోలోకము 'నాభి' పైభాగమని సూచన. ఈ రశ్మలు నాడులే. మధ్యనున్న అగ్నిశిఖ సుషుమ్నయే. అందే పరమాత్మ లభ్యము. కనుక నాడీ సహస్ర పరివృతుడయిన సుషుమ్నాగతుడయిన పరమాత్మయే శ్రీకృష్ణుడు. సుషుమ్న నీలవర్ణము. కృష్ణుడు నీలవర్ణుడు. సుషుమ్నామధ్యగత కాంతి పీతవర్ణము. కృష్ణుడు పీతాంబరధారి. ఆకాశమువలె అనంతము గంభీరము అని సూచించుటకు కృష్ణుడు నీలవర్ణుడుగా చెప్పబడెను.

**ఇంద్రియములు :**

రశ్మలు అనగా ఇంద్రియములు మొదలగు 24 తత్వములకు సంబంధించినవే అని పూర్వముదాహరించిన 'చక్రకౌముది' శ్లోకమునుబట్టి తెలియుచున్నది. మఱియు 'జీవన్ముక్తి ప్రకాశిక'లో గూడా–

**"శబ్దాదివిషయాన్ పంచ మనశ్చైవాతిచంచలమ్**
**చింతయే దాత్మనో రశ్మీన్ ప్రత్యాహార స్స ఉచ్యతే" 45**

---

44) పద్మకోశము – తామరమొగ్గ – వంటి అధోముఖమయిన హృదయమున్నది. అది నాభిపయిన ఉన్నది. అచ్చట జ్వాలాకీర్ణమయిన విశ్వనివాసస్థానమున్నది. దానిమధ్యన పెద్ద అగ్నికలదు. అన్నివైపులా జ్వాలలు విరజిమ్ముతున్నది.
దాని రశ్మలు పైకి క్రిందికి అడ్డముగాను వ్యాపించినవి. ఆ అగ్ని కాలి నుండి తలదాకా శరీరమును వెచ్చన చేయుచున్నది. ఆ అగ్నిమధ్యలో ఒక ప్రత్యేక జ్వాలకలదు. అది చాల సన్నముగా పైకి వ్యాపించినది. నల్లమబ్బులమధ్య నున్న మెరుపు తీగవలె అది మెరయుచున్నది. నివ్వెరముల్లువలె సన్నని ఆ శిఖ పచ్చనిది. అణువు వంటిది. ఆ శిఖ మధ్యలో పరమాత్మ ఉన్నాడు.
45) శబ్దము రూపము మొ॥ ఇంద్రియ విషయమయిన వాటిని, అతిచంచల మయిన మనస్సు మొ॥ తన రశ్మలను ధ్యానింపవలయును. ఈ క్రియను ప్రత్యాహారమందురు.

అని రశ్మలను ఇంద్రియములుగనే చెప్పిరి. పంచేంద్రియములు పంచతన్మాత్రలు, పంచ భూతములు, పంచ జ్ఞానేంద్రియములు అంతఃకరణ చతుష్టయము, కాలము ప్రకృతి పురుషులు మొదలగునవి.

మంత్రపుష్పమునుబట్టి రశ్మలు నాడులు ఒక్కటే అని తెలియుచున్నది. కనుక ఇంద్రియములు నాడులు రశ్మలు అంతగా తేడా లేనివని చెప్పవచ్చును. నాడులు ఇంద్రియములను ప్రవర్తింపజేయును. దశవిధనాడులు ఆయా దేహభాగములచేత పనులు చేయించుచుండును. చూ॥

**“సవ్యే నేత్రే చ గాంధారీ హస్తిజిహ్వా తు దక్షిణే**
**యశస్వినీ వామకర్ణే సుపూషా దక్షకర్ణకే**
**ముఖే చాలంబుషా జ్ఞేయా కుహూః లింగే వ్యవస్థితా**
**శంఖినీ మూలదేశే తు దేహం వ్యాప్యాపరాః స్థితాః” 46**

**– చక్రకౌముదీ**

ఈ విధముగా రశ్మలు నాడులు ఇంద్రియాలమధ్య భేదము పరిగణింప వలసినంతగా లేదు.

ఇంద్రియములను అశ్వములుగా మృగములుగా పోల్చి చెప్పుట సుప్రసిద్ధమే. అట్లే ఇచ్చట గోవులుగా చెప్పియుండుట సమంజసమే. అసలు ‘గో’=కన్ను అని యర్థము. “సర్వేంద్రియాణాం నయనం ప్రధానం” కనుక గో శబ్దముతో నేత్రాది ఇంద్రియములు చెప్పబడినవి. “గచ్ఛతీతి గౌః” అనగా వ్యక్తినుంచి ప్రసరించు స్వభావముగలవి గనుక ఇంద్రియములు ‘గోవులే’.

కనుక భగవంతుని స్థాయిలో, సూర్యునిస్థాయిలో కిరణరూపములుగానూ దేహములో నాడీ రశ్మి ఇంద్రియరూపముగానూ సృష్టిలో 24 తత్వాల రూపముగానూ కాలములో తిథులు మొదలయిన రూపముతోనూ ఉన్నవి యీ గోవులే అన్నది సారాంశము. గోవులు కాలములోని అంశలు గదా! దేహములో గూడా గోవులు కాలాంశలుగా దిగినవని యోగశాస్త్రము

---

46) సవ్యనేత్రమున (ఎడమ) గాంధారి, దక్షిణ నేత్రమున హస్తిజిహ్వ, ఎడమ చెవియందు యశస్విని, కుడిచెవి యందు సుపూష, ముఖమునందు అలంబుష, లింగమునందు కుహూ, మూలదేశమున (మొల) శంఖిని అని ఇతరనాడులు వ్యాపించియున్నవి.

చెప్పుచున్నది. సూర్యుడు, పరమాత్మ – ఒకరిలో ఒకరు ఉన్నవారు. వీరిరువురు జీవుని శరీరమునందు ఇమిడియున్నారు. చూ॥

**"స యశ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే సఏకః" 47**

కనుక వారి స్వరూపమయిన 'కాలము' గూడా మన శరీరమునందున్నట్లు చెప్పుచున్నారు. చూ॥

**"సంవత్సరాత్మకం దేహం ఖల్వగ్నిశివశక్తికమ్" 48**

అనగా దేహము సంవత్సర స్వరూపము. సంవత్సరము ప్రజాపతి స్వరూపము. కనుకనే సంకల్పమున కాలము చెప్పుచు మనము కాలరూపానుసంధానము చేసెదము.

**"సంవత్సరో వై ప్రజాపతిః"**

ఈ ప్రజాపతి అనగా 'కర్మజ్ఞానాధికారి' అయిన జీవుడని ఆచార్యశంకరులు అనుగ్రహించిన వివృతి ఇంతకుముందు చూపియుంటిని కనుక –

సంవత్సరము = దేహము

తిథులు / నిత్యలు / కలలు = భూత, ఇంద్రియ, మనస్సులు

**"భూతేంద్రియమనాంస్యేవ క్రమాత్ నిత్యాః కలాః పునః" (చ॥కౌ॥)**

నిత్యలు = తిథులు = ఈ 'నిత్య'ల పరాక్రమము లలితా సహస్రనామ స్తోత్రమందు చెప్పబడినది. లలితోపాఖ్యానమునందు కలదు.

**"నిత్యాపరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా**
**నిత్యాషోడశికారూపా శ్రీకంఠార్ధ శరీరిణీ" 49**

360 రోజులు 360 రశ్మిలు

6 ఋతువులు 6 చక్రాలు

47) పురుషుని యందు ఆదిత్యుని యందు ఉన్న ఆత్మ ఒకటే.

48) దేహం శివశక్తి ద్వయంతో నిండినది. ఇది సంవత్సర స్వరూపమయినది.

49) నిత్యలు అనగా కాలరూపమయిన తిథులకు అధిష్ఠాన దేవతలు వారి పరాక్రమమును చూచు కుతూహలముగలది. నిత్యలు 15కల 16వ రూపమయినది శ్రీకంఠుని అర్ధశరీరము.

హేమంత = మూలాధారము　　గ్రీష్మ = అనాహతము
శిశిర = స్వాధిష్ఠానము　　వర్ష = విశుద్ధము
వసంత = మణిపూరము　　శరత్ = ఆజ్ఞ

**"హేమంతాద్యాశ్చ ఋతవః షట్చక్రే క్రమశః స్థితాః" - చ॥కౌ॥ 50**

కనుకనే ఆజ్ఞాచక్రము ప్రాంతములో జరుగు రాసలీల 'శరదృతువు'లో జరిగినట్లు చెప్పబడినది.

12 మాసాలు = ద్వాదశాంతము వఱకు స్థూల సూక్ష్మచక్రములు 12.

పగలు / రాత్రి= మెలకువ / నిద్ర జ్ఞానము / అజ్ఞానము

ఉత్తరాయణ దక్షిణాయణాలు = ఇడా పింగళానాడులు.

అనగా కాలమే దేహముగా మారినదని తాత్పర్యము, అందు మహాకాలమే కృష్ణుడుగా అవతరించెనని భావము. కాలునకు, కాలికి, (కాళి), బిడ్డలమయిన మనము 'కాలము' అగుటలో ఆశ్చర్యమేమి? సంవత్సరారాధన పద్ధతి గలదు. అదియును దేహగతమే.

**"యది సాంవత్సరీం పూజాం ఇచ్ఛేత్ సాధకనందనః**
**షష్టిత్రిశతపత్రస్థాః శివశక్తీః ప్రపూజయేత్"**

తనలోనేయున్న 360 రశ్ములను తదధి దేవతలయిన స్త్రీ పురుష శక్తులను ఆరాధింపవలెను అని భావము. అట్టి సంవత్సరారాధనయే 'గోపికా, గోపక, కృష్ణ' వృత్తాంతము. కృష్ణుడు ప్రతి గోపికకు ఒక గోపాలుడుగా రాసలీలలో ఆవిర్భవించుట ఈ 'శివశక్తి' రశ్మిచక్రమునకు కథారూపమని భావింప వలయును.

**మంత్రపరముగా :**

**1) వేదపరముగా :**

గోవులు= వాక్కులు అని అర్థము కలదు. గోవులు అనగా ఉపనిషత్తులు అని సంప్రదాయముగూడా చెప్పుచున్నది.

50) శరీరము నందలి 6 చక్రములలో హేమంతము మొ॥ ఋతువులు 6 క్రమంగా ఉన్నవి.

**"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః"** **51**

కనుక గోవులు అనగా వేదములు ఉపనిషత్తులు తత్సంబంధ ఇతర వాఙ్మయము. అదియును దైవపరమయినది మాత్రమే. ఇతర వాక్కులు గోవులు కావు. వానికి శ్రీకృష్ణునితో సంబంధము లేదు కనుక–

'గోప్యో గావఋచః' అని ఉపనిషత్తు. **52**

ఇంతేగాక వాక్కును గోవుగా చెప్పిన సందర్భములు కోకొల్లలు. చూ॥ బృహదారణ్యకంలో (56)

**"వాచం ధేను ముపాసీత తస్యా శ్చత్వారః స్తనాః ।**
**స్వాహాకారోవషట్కారః హంతకారః స్వధాకారః । తస్యాః**
**ద్వౌస్తనౌ । దేవా ఉప జీవంతి స్వాహాకారం వషట్కారంచ ।**
**హంతకారం మనుష్యాః । స్వధాకారం పితరః । తస్యాః**
**ప్రాణఋషభః – మనోవత్సః" దీని భాష్యంలో**
**"వాగితి శబ్దః త్రయీ । హంతేతి మనుష్యేభ్యోన్నం ప్రయచ్ఛంతి" 53**

అనగా వేదమును ధేనువుగా ఆరాధింపవలెను. ఆమె పొదుగుయొక్క 4 కొనల నుండి దేవపితృమనుష్య లోకములు జీవనము పొందుచున్నవి. ఆమెకు ఋషభము అనగా ఓంకారము ప్రాణము. మనస్సు దూడ. ఓంకారమును వృషభమనుట గూడా సంప్రదాయమే.

**"యచ్ఛందసా మృషభో విశ్వరూపః"** **54**

అంతేగాక సుప్రసిద్ధమయిన

**"దేవీం వాచ మజనయంత దేవాః**
**తాంవిశ్వరూపాః పశవో వదంతి**

---

51) సమస్త ఉపనిషత్తులు గోవులు. వాటి సారమును పిందువాడు దేవకీ నందనుడు.
52) గోపికలు గోవులు ఋక్కులు.
53) 'వాక్కు', అనే ధేనువు నుపాసించండి. దానికి 4 స్తనాలు. స్వాహాకారము, వషట్కారము. ఇందులో మొదటి 2 స్తనాలను దేవతలు ప్రయోగించెదరు.
54) ఎవరు వేదములకు వృషభమో అనగా ఓంకారమో ఆ విశ్వరూపుడు.

**సా నో మంద్రేష మూర్జం దుహానా**
**ధేను ర్వాగస్మాన్ ఉపసుష్టుతైతు"** **55**

అను మంత్రములో గూడా వాక్కు 'ధేనువు'గా చెప్పబడినది.

వేదములు గోవులు అయినపుడు ప్రణవము ఋషభము అనుట అలంకారికమే కదా. ఈ ఓంకారము భగవంతుని శబ్దబ్రహ్మరూపమే కదా.

**"ఓమిత్యే కాక్షరం బ్రహ్మ"**
**"ప్రణవ శ్చాస్మి వేదానాం"** **- గీత.**

హరివంశములో గోవర్ధనోద్ధరణానంతరము గ్రంథములో

**"గా రేషా చ తధా వాణీ తాం చ విందయతే భవాన్**
**గోవిందస్తు తతో దేవ మునిభిః కధ్యతే భవాన్"** **56**

అని చెప్పి గోవిందుడనగా వేదవాణీ సేవ్యుడని చెప్పిరి. కనుక-

వేదములు అనంతములు కనుక 'గోవుల' ఓంకారము ఒక్కటే కనుక కృష్ణుడు.

**2. దేహపరముగా :**

6 చక్రములయందు వరుసగా అక్షరాలు అక్షర మాతృకలు నివసించునని యోగశాస్త్రము. అట్లే ప్రతివ్యక్తి యొక్క మనోమయకోశమున సర్వవిద్యలు వేదములు సంస్కారరూపమున నుండునని శాస్త్రము. అందువలననే కొందఱు పుణ్యాత్ములకు అనాయాసముగా అప్రయత్నముగా విద్యలు కళలుస్ఫురించును. పరా, పశ్యంతీ, మధ్యమా వైఖరి మొదలగు నాదభేదములు గలవు. ఈ నాదములు గోవులు. మనలోని 'ప్రాణనాదము' ఓంకారమే. ఈవిద్యలన్నియు ఈ ఓంకార నాదమును అనుసరించు చుండుననుటయే "గోవులు - కృష్ణుడు" అను వర్ణన.

---

55) దేవతలు దివ్యమయిన వాక్కును సృష్టించిరి. దానిని నానారూపులయిన పశువులు పలుకుచున్నవి. మంద్రమయిన యీ వాగ్ధేనువు స్తుతింపబడినదై మనలను సమీపించుగాక.
56) గోవు అంటే వాణి / వాక్కు. దానిని పొందించువాడు కనుక గోవిందుడు. అని మునులు పలికిరి.

మా గురుదేవులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు రచించిన "ప్రారబ్ధ ప్రాబల్యము" నందలి యీ పద్యము చదివినచో దేహగతమయిన "గోవులు – కృష్ణుడు" అను భావన ప్రామాణికమేయని అవగతమగును.

**"పద్మాప్త పద్మకోశ సమే హృదయే మధ్యమండలే విచరన్**
**గావ ఋచః పాసి సదా స్వీయా గోవింద లోకరక్షార్థమ్" 57**

**సారాంశమేమనగా :**

| | | |
|---|---|---|
| శక్తులు | × | స్వామి |
| అణిమాది కిరణాలు | × | భగవంతుడు |
| కిరణాలు | × | సూర్యుడు |
| తిథులు | × | సంవత్సరము |
| కలాకాష్ఠా మొ॥ | × | కాలము |
| ఇంద్రియాలు, 24 తత్వాలు | × | జీవుడు |
| నాడులు | × | సుషుమ్న |
| వాక్కులు, వేదాలు | × | ఓంకారము |
| గోవులు | × | శ్రీకృష్ణుడు |

అని చెప్పవచ్చును.

మఱియు, నాదయోగాభ్యాసికి 'భ్రూమధ్యమున' గనబడు చిత్కళలుగూడా ఈ గో గోపికలు గావచ్చును. ఇవి జీవుని భ్రమింపజేయుటకు వివిధమోహినీ రూపములను చూపునని సాధనా చరమదశలో ఈ పరీక్ష జరుగునని యోగశాస్త్రము. ఇవి మెఱుపు తీగలవలె కాంతులు ఈనుచుండును. చూ॥

**"నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం**
**తవాపాంగాలోకే పతిత మనుధావంతి శతశః**

57) లక్ష్మీనిలయమయిన వాడా? పద్మకోశసమమయిన హృదయమున మధ్యమండలమున సంచరించుచు ఋక్కులను గోవులను లోకం కొఱకు రక్షించుచున్నావు.

**చలద్వేణీబంధాః కుచకలశవిస్రస్తసిచయాః**
**హఠాత్త్రుట్యత్కాంచ్యో విగళితదుకూలా యువతయః" 58**

**– సౌందర్యలహరి**

గోకుల రాసలీల భ్రూమధ్య స్థానమని ముందు నిర్ణయింపబడును. కనుక అచ్చటి గోపికలు సౌందర్యలహరిలో చెప్పబడిన యువతులు గావచ్చును. దేవీ కటాక్షములో బడిన సాధకునకు వచ్చు పరీక్ష ఇది.

కృష్ణుడుగూడా 'రాసలీల'లో 'యోగమాయ' స్వీకరించినట్లు చెప్పబడినది. కనుక మాయను వశము చేసికొనిన యోగి మాయా విలాసముతో ఆడుకొని తన అతీత శక్తిని నిరూపించినట్లు చెప్పవచ్చును. యమునా నదీ తీరమునందున్న ఆ గోపికలను మహర్షి –

**"తటిత ఇవ తామేఘచక్రేవిరేజుః"** అని

'మెరుపుతీగలు' అని వర్ణించుట ఇందుకు బలము చేకూర్చుచున్నది. మేఘచక్రము అనగా విశుద్ధ చక్రము.

ఈ మొత్తము విషయమునకు నా "పరికరశ్లోకము".

**"భూతాభూతపతేః గణాః గణపతేః**
**రామస్యలాంగూలినః**
**దుర్గాయా నవశక్తయః హిమరుచే**
**స్తారా రవేరశ్మయః**
**నాడ్యోబ్రహ్మపథస్య చేంద్రియగణో**
**జీవస్య చైవంవ్రతాః**
**ఆత్మానః పరమాత్మనః ఖలుతథా**
**గోగోపగోప్యోహరేః"**

(దీని అర్థము చతుర్థ పింఛము $\frac{3}{72}$ వ పేరా)

58) కనులకు వెగటుగా సరసాలు తెలియని వృద్ధ యోగి కుండలినీ యోగంద్వారా భ్రూమధ్య స్థానమున నీ కటాక్షసన్నిధిని చేరగానే అతనిని వందలకొలది యువతులు అనుసరించెదరు. వారు పైటలు జార్చుతూ, వడ్డాణాలు హఠాత్తుగా విడివడగా జారుతున్న పట్టువస్త్రాలతో వదులయిన జడలతో ఆకర్షణగా వెంబడి పడెదరు.

# చతుర్థ పింఛము

## గోపకులు - గోపికలు

శరీరములోని రశ్మలన్నియు, శివశక్తి భేదముతో రెండు రూపములుగా నున్నవి. అసలు ప్రపంచమంతయు శివశక్తుల విలాసమే కనుక స్త్రీ పురుషరూపములుగా నుండుట యూహింపదగును.

రాత్రి=పార్వతి, పగలు=శివుడు అని చెప్పబడినది. అట్లే గోపికలకు గోపకులుండుట తప్పనిసరి సంబంధము. 'ప్రకృతి - పురుషులు' అనే విభాగము సంయోగము సహజము. గోపికలకు చెప్పిన విషయములు గోపకులకు వర్తించును. గోపకులు పదార్థము అనుకొంటే గోపికలు వారి శక్తులు. కనుక ప్రతి గోపికకు పురుషుడుగా ఒక గోపకుడుండును. ప్రతి గోపకునకు ఒక 'గోపిక' యుండును. వీరందఱికి మూలపురుషుడు పరమాత్మ అగును.

ఆ ప్రకారము - శివునకు ప్రమథులు, పశుపతికి పశువులు, గణపతికి గణములు, రామునకు వానరులు, దుర్గకు నవావరణ దేవతలు, అణిమాది శక్తులు, ఖడ్గమాలలో చెప్పబడిన దేవతలు, సూర్యునకు - కిరణాలు గాయత్రియు, చంద్రునకు - తారలు నక్షత్రాలు, సుషుమ్నకు - 72 వేలనాడులు, 100నాడులు, జీవాత్మకు రశ్మలు, తత్త్వములు, ఇంద్రియములు, పరమాత్మకు - జీవాత్మలు, కృష్ణునకు - గో, గోప, గోపికలు

శివుడు - పశుపతి; కృష్ణుడు - గోపతి.

**"ఆత్మానః పశవస్సర్వే ప్రోక్తా అజ్ఞానినస్సదా" - సూతసంహితా**

ఆయనవి నిజముగా పశువులు కావు. కృష్ణునివి నిజముగా గోవులు అనగా ఆవులు కావు. కనుక లోకపరముగా, సూర్యపరముగా, దేహపరముగా, వేదపరముగా, కాలపరముగా "గోవులు" దేనికి సంకేతమో చెప్పియుంటిమి. గోవులయొక్క అధిష్ఠాన దేవతలే గోపకులు. వారి శక్తులే గోపికలు. కనుక ఒక గోవునందు దాని అధిష్ఠా నదేవత, ఆదేవతయొక్క శక్తి ఇమిడియుండును.

కనుక 'గోవుల' యందే గోపకులను గోపికలను గమనింపవలయును. కథాశోభకు మాత్రమే వారు విడిగా చెప్పబడిరి. అంతరార్థమున విడిగా ఉండరు. నిప్పునందే అగ్ని, వానియందే స్వాహాశక్తి యుండును. ఈ దంపతులను గూర్చి తంత్రములలో, ఆమ్నాయములలో, పురాణములలో నామభేదము కన్పబడుచున్నది. ఇది ఉపాసక భేదమువలన వచ్చియుండును. సమానమయిన అంశమేమనగా; వీరందఱు ఆయా చక్రములందుండి దేహమును నడపుచున్నారు. కనుక ఈ ప్రకరణమున వీరివిషయము పరిశీలన చేయబడును.

1) లోకపరముగా ఆలోచించినచో వీరు అందఱును గోలోకవాసులు. గోవులకు అనగా కిరణములకు అధిష్ఠానదేవతలు. ఉదాహరణకు–

సముద్రమునకు – వరుణుడు అధిష్ఠాన దేవత.

గాలికి – వాయువు

పుస్తకమునకు – సరస్వతి. ఇలా –

పద్మపురాణములో చెప్పబడిన గోలోక వర్ణనము అంతయు చక్రములు పద్మములు వాటిమధ్య దేవతలుండుట – ఈరీతిగా తంత్రపద్ధతిలో దేహము నందుండే యోగశాస్త్రపద్ధతిలో వర్ణింపబడినది. అందులో ఎనిమిది రకములుగా 16 రకములుగా శక్తిభేదములు చెప్పబడినవి.

చూ॥ పద్మపురాణం, ఉత్తరఖండం.

**"షోడశాద్యాః ప్రకృతయః ప్రధానాః కృష్ణవల్లభాః**
**అష్టౌ ప్రకృతయః పుణ్యాః ప్రధానాః కృష్ణవల్లభాః"** **59**

అని చెప్పిరి. వీరిలో –

**సంముఖే లలితాదేవీ శ్యామలా వాయుకోణకే** **60**
**ఉత్తరే శ్రీమతీ ధన్యా ఐశాన్యాం శ్రీహరిప్రియా.......**

59) 16 మంది సృష్టికి ఆదిప్రకృతులు. వారు కృష్ణునికి ప్రధాన సుందరీమణులు. ఇంకొక 8 మంది అట్లే పుణ్యమయులు కృష్ణప్రియలు.

60) ఎదుటి కోణమున లలితాదేవి, వాయవ్యకోణమున శ్యామలాదేవి, ఉత్తరకోణమున శ్రీమతి, ఈశాన్యమున హరిప్రియ – కొలువు దీరియుందురు.

ఈవిధముగా 8 దిక్కులయందు 8 ప్రకృతి శక్తులున్నట్లే వారు అందఱు కృష్ణవల్లభలు అయినట్లు చెప్పబడెను. వీరందఱు "యోగపీఠము" నందున్నట్లున్నది. ఇక 16 శక్తులలో-

**"ప్రధానప్రకృతి స్త్వాద్యా రాధా చంద్రావతీసమా**
**చంద్రావతీ చిత్రరేఖా చంద్రా మదనసుందరీ"**

........ మొదలుగా 16 మంది చెప్పబడిరి. ఇంకను కృష్ణశరీరము నుంచి యుద్భవించిన వారు గలరు. చూ॥

**"అత్ర రాధాపతే రంగాత్ పూర్వా యాః ప్రేయసీతమాః**
**నిత్యా నిత్యవిహారిణ్యో నిత్యకేలిభువశ్చరాః"**

వీరు 'నిత్య'లు అని చెప్పబడిరి. వీరిపేర్లు ఖడ్గమాలలోని "శక్తుల పేర్లతో పోలుచున్నవి. వీరిపేర్లు -

| | | |
|---|---|---|
| 1) అనంగసేన | 2) అనంగమాలిని | 3) దమయంతి |
| 4) బాల | 5) రతివిహ్వల | 6) లలితా |
| 7) లలితయౌవనా | 8) అనంగకుసుమ | 9) మదనమంజరి |
| 10) కలావతి | 11)రతికల | 12) కామకల |
| 13) కామదాయిని | 14)రతిలోల | 15) రతోత్సుకా. |

ఈ 15గురు నిత్యలు. అనగా 'తిథి దేవతలని' చెప్పవచ్చును. లలితాదేవికి గూడా యీ 'నిత్య'లు పరివారములో నున్నట్లు తెలిసిన విషయమే. కనుక లలితకు కృష్ణునికి భేదము లేదని చెప్పవచ్చును. లలితయే కృష్ణుడని పురాణములు చెప్పిన విషయము ముందు ప్రదర్శింపబడును. మొత్తంమీద 16 శక్తులు - 16000 గోపికలకు అష్టప్రకృతులు ఎనిమిది మంది భార్యలకు సరిపోవుచున్నవి. వీటియందున్న "కామ" సంబంధమయిన పేర్లనుబట్టి ఇవి యన్నియు సృష్టిశక్తులుగా కన్పించుచున్నవి. ఖడ్గమాలలో చెప్పబడిన నవావరణశక్తులపేర్లు గూడా కామసంబంధమును సూచించుచున్నవి. దేవి 'కామేశ్వరి' కదా. అట్లే కృష్ణుని రాసలీల బాహ్యార్థమున కామమును సూచించుచున్నది. కృష్ణబీజము 'క్లీం' కామరాజబీజము గదా.

తంత్రరాజమున లలితయే కృష్ణునిగా అవతరించెనని చెప్పబడినది. వివరములు సప్తమ పింఛములోని "కృష్ణతత్త్వము"లో గలవు. గోపికలు లలితాదేవిశక్తులే. కనుకనే

**"కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా"**
**"తత స్సగోపీసంజ్ఞాభిః ఆవృతోభూత్ స్వశక్తిభిః"** **61ఏ**

అని తంత్రరాజము చెప్పినది.

కామేశ్వరి భగమాలిని మొదలగు నిత్యలు. అనంగమోహిని అనంగమదనాతుర మొదలగు ఆవరణ శక్తులు గోపికలుగా అవతరించినవి. ఈ శక్తులు కామము అనగా సృష్టికామములు. సృష్టి స్వరూపురాలయిన శక్తి విలాసములు ఇవి. ఇవి భగవంతునిచుట్టు చేరినపుడు తమతమ కామములను మఱలించుకొని భగవంతునివైపు తిరిగినవి. కనుకనే గోపికలను గూర్చి

**"కష్టం తదర్థ వినివర్తిత సర్వకామాః"** అని మహర్షి చెప్పెను. **61బి**

దేహములో యోగశాస్త్ర సంబంధముగా వివరింపవలసియున్నది.

1) గోవులు= రశ్మలు అనే అర్థములో ప్రతి రశ్మికి స్త్రీ పురుష దేవతలు చెప్పబడిరి. అట్లు మొత్తము 360 దేవతలు చక్రకౌముది మొదలగు యోగశాస్త్ర గ్రంథములలో నుండిరి. వారే గోపికాగోపకులుగా ఇచ్చట ఉదహరింపబడిరి. వారిపేర్లు – చూ॥ చక్రకౌముది.

2) గోవులు = నాడులు అనుకొన్న పక్షమున సూతసంహితలో చెప్పినట్లు నాడీ దేవతలు గలరు. చూ॥ సూతసంహిత= జ్ఞానయోగఖండము – 11 అధ్యాయము.

---

61ఏ) ఒకనాడు లలితాదేవి పురుషుడై కృష్ణశరీరము దాల్చినది. అంతట ఆయన శక్తులు గోపికల పేరుతో చుట్టూ చేరిరి.

61బి) ఆయనకోసం సర్వకామములను కష్టపడి తొలగించికొని

**"సుషుమ్నాయాం శివోదేవః ఇడాయాం దేవతా హరిః**
**పింగలాయాం విరించిః స్యాత్ సరస్వత్యాం విరాణ్మునే**
**పూషా దిగ్దేవతా ప్రోక్తా వారుణీవాయుదేవతా" 62**

........ ఇలా చెప్పబడిన దేవతలే గోపికాగోపకులు.

దేహములోనే జ్ఞానపరముగా అనేక దేవతలున్నట్లు ప్రాచీనగ్రంథ ప్రమాణములు గలవు. సూత సంహిత – యజ్ఞవైభవ ఖండము 8 అధ్యాయము "రహస్య విచారము"

**"దేవతాః సర్వదేవేషు స్థితాః సత్యతపోధనాః**
**పంచభూతాత్మకే దేహే స్థూలే షాట్కోశికే సదా"**

(షట్కోశములు అనగా చర్మ, రక్త, మాంస, మేదః అస్థిమజ్జలు.)

**"జ్ఞానేంద్రియ సమాఖ్యేషు శ్రోత్రాదిషు యథాక్రమాత్**
**దిగ్వాయ్వర్క జలాధ్యక్ష భూమి సంజ్ఞాశ్చ దేవతాః"**
**"కర్మేంద్రియసమాఖ్యేషు పాదపాణ్యాదిషు క్రమాత్**
**త్రివిక్రమేంద్ర వహ్న్యాఖ్య 'దేవతాశ్చ ప్రజాపతిః**
**........ చంద్రమా మనసి స్థితః 63**

**బుద్ధౌ బృహస్పతిర్విప్రాః స్థితః కాలాగ్నిరుద్రకః**
**అహంకారే శివశ్చిత్తే రోమసు క్షుద్రదేవతాః**

---

62) సుషుమ్నానాడిలో శివుడు, ఇడలో హరి, పింగళలో విరించి, సరస్వతిలో విరాట్టు, దిగ్దేవత పూష, వారుణి వాయవ్యదిగ్దేవత.

63) ఆఱు కోశముల రూపమయిన ఈ పంచభూత వికారమయిన స్థూల దేహమునందు సత్యతపోధనులయిన దేవతలు నిత్యం ఉండెదరు. జ్ఞానేంద్రియములయిన చెవి మొదలగువాని యందు దిక్కు వాయు, అర్క, వరుణ, భూమి దేవతలుందురు. కర్మేంద్రియములయిన పాదము పాణి మొ॥ వానియందు క్రమముగా త్రివిక్రముడు ఇంద్రుడు, అగ్ని, ప్రజాపతి మొ॥ వారుందురు. చంద్రుడు మనస్సులో నుండును. బుద్ధియందు బృహస్పతి, అహంకారమున కాలాగ్నిరుద్రుడు. చిత్రమున శివుడు, రోమములందు క్షుద్రదేవతలు, అస్థులయందు భూతప్రేతాదులు స్నాయువులందు పిశాచములు, రాక్షసులు మజ్జయందు చర్మమాంస రక్తములందును పితృగంధర్వు లుందురు.

**భూతప్రేతాదయ స్సర్వే దేహస్యాస్థిషుసంస్థితాః**
**పిశాచా రాక్షసాస్సర్వే స్థితాః స్నాయుషు సర్వశః**
**మజ్జాఖ్యే పితృగంధర్వాః త్వఙ్మాంసరుధిరేషుచ**
**వర్తంతే తత్రసంసిద్ధాః దేవతా స్సకలా ద్విజాః"**

అనగా శరీరమునందు ఆయా స్థానములందు దేవరాక్షసులు పిశాచాదులు అధిష్ఠించి యుండునని "సూతసంహిత" చెప్పుచున్నది.

వీరందఱు గూడా అందఱికి అనుభవమునకు రారు. కేవలము జ్ఞానులకు గోచరించుదురు.

**"సమ్యగ్ జ్ఞానవతాందేహే దేవతాస్సకలా అమూః**
**ప్రత్యగాత్మతయా భాంతి దేవతారూపతోపిచ"** **64**

అనిగూడా సూతసంహిత చెప్పుచున్నది.

రేడియోలో 'స్టేషన్'ల వలె ఇవి యుండును. 'జ్ఞానము' అనే 'విద్యుత్తు' ప్రవేశించినపుడు అవి చైతన్యవంతములు అగును.

ఐతరేయమునందుగూడా; లోకలోకపాల సృష్టిని గురించి చెప్పుచూ "అధిష్ఠానము, కరణము దేవత" అను విభాగముతో మన శరీరము నందలి ఇంద్రియాదులు ఏర్పడిన విధానమును చెప్పిరి. ప్రజాపతి ముఖమునుండి-

**"ముఖాత్ వాక్, వాచోగ్నిః నాసికాభ్యాం ప్రాణః ప్రాణా**
**ద్వాయుః అక్షిభ్యాం చక్షుః చక్షుష ఆదిత్యః కర్ణాభ్యాం**
**శ్రోత్రం శ్రోత్రాద్దిశః...... త్వచో లోమాని లోమభ్యః**
**ఓషధివనస్పతయః హృదయాత్ మనః మనసః చంద్రమాః**
**నాభ్యా అపానః అపానాత్ మృత్యుః".**

ఈవిధముగా ప్రజాపతి ముఖమునుండి వాక్కు దానినుండి "అగ్ని" ఆవిర్భవించెను. ముక్కులనుండి ప్రాణము ప్రాణమునుండి వాయుదేవుడు, కన్నులనుండి చూపుదానినుండి సూర్యుడు. చెవులనుండి వినికిడి దానినుండి

64) ఈ దేవతలందరూ జ్ఞానులకు ప్రత్యగాత్మగాను, ఆయాదేవతలుగాను కనబడెదరు.

దిక్కులు ఇలా ఆవిర్భవించిన దేవతలు. ఆ ప్రజాపతిని 'ఆయతనము' అనగా తమకు నివాసము చూపమని కోరిరి. వారికి ప్రజాపతి జీవుని నివాసముగా చూపెను. అప్పుడు వారు జీవునకు ఆయా కరణములుగా మారి జీవునియందు ప్రవేశించిరి.

**"అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"** అనగా

ప్రజాపతి ముఖమునుండి వచ్చిన వాక్కునుండి వచ్చిన 'అగ్ని' మఱల వాక్కులో ప్రవేశించి జీవుని ముఖములో చేరెను. ఇట్లే మిగిలినవారు. దీనినిబట్టి మనవాక్కు ముఖము చెవులు కన్నులు మొదలగు అన్నియు అగ్ని, వాయువు మొదలగు దేవతలకు ఆలవాలములే. గోపికలు – వాక్కు మొదలగునవి గోపకులు – అగ్ని మొదలగునవి.

బుద్ధి సంబంధమయిన గుణములన్నియు దేవతారూపములని ఇతర గ్రంథములు చెప్పుచున్నవి. చూ॥

ఈశ్వర సత్యనారాయణశర్మగారు వ్రాసిన "శ్రీసూక్తరహస్యము" నందు ఉదాహరింపబడిన శ్లోకములు.

**"కీర్తిః మతిః ధృతిః పుష్టిః సమృద్ధి స్తుష్టిరేవచ**
**శ్రుతిః స్మృతిః బలంమేధా శ్రద్ధారోగ్యజయాదికాః**
**దేవతాశక్త యస్సర్వాః తత్తద్దేవాంశగా నృప**
**మహాలక్ష్మీ ముపాసంతే తస్యాః కింకర్య ఏవ తాః"**

అనగా కీర్తి, మతి మొదలగు గుణములు బుద్ధిభేదములే. బుద్ధి భగవతీ స్వరూపము. బుద్ధిభేదములు ఆమెకు అంగశక్తులు అగుటలో వింతలేదు. ఇవియన్నియు "దేవాంశ" సంభవములు. కనుక మహాలక్ష్మిని ఇవి కింకరీమణులై ఉపాసించునట. అట్లే "సప్తశతి" యందు–

**"యా దేవీ బుద్ధిరూపేణ సర్వభూతేషు సంస్థితా**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః"**

అనగా 'దేవి' బుద్ధిరూపముగా సర్వజీవులయందు ఉండును. అట్లే–

**"యా శ్రీః స్వయం సుకృతినాం భవనేష్వలక్ష్మీః**
**పాపాత్మనాం కృతధియాం హృదయేషు బుద్ధిః**
**శ్రద్ధా సతాం కులజనప్రభవస్య లజ్జా**
**తాం త్వాం నతాః స్మపరిపాలయ దేవి విశ్వమ్" 65**

అనగా శ్రీ, దరిద్రత, శ్రద్ధ లజ్జ మొదలగునవి దేవీరూపములు. లలితా సహస్రనామములలో గూడా,

**"కుమారగణనాధాంబా తుష్టిః పుష్టిః మతిః ధృతిః**
**శాంతిః స్వస్తిమతీకాంతిః నందినీ విఘ్ననాశినీ**
**స్వాహా స్వధా మతిర్మేధా శ్రుతిః స్మృతిరనుత్తమా"**

ఇవియన్నియు దేవీస్వరూపములుగా కీర్తింపబడినవి.

విభూతియోగములో భగవద్గీత–

**"కీర్తిః శ్రీః వాక్చ నారీణాం స్మృతిః మేధా ధృతిః క్షమా"**

అని చెప్పబడినది. స్త్రీలలో పరమేశ్వరుడైన కృష్ణుడు తన రూపములుగా కీర్తి, వాక్కు, స్మృతి మొదలగువాటిని చెప్పెను. అనగా ఈ బుద్ధి భేదములను 'స్త్రీలు'గా పరిగణించుట సాంప్రదాయికమే.

పురుష సూక్తములో గూడా–

"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" అని "హ్రీ, లక్ష్మీ" ఆయన పత్నులుగా చెప్పబడినవి. 'హ్రీ' అనగా భాగవతము 11స్కం. 19 అధ్యా.లో

**"జుగుప్సా హ్రీరకర్మసు, శ్రీర్గుణానైరపేక్ష్యాద్యాః" 66**

అని వివరింపబడెను. అనగా మన మనోవృత్తులే 'స్త్రీలు'గా భగవంతుని భార్యలుగా చెప్పబడినవనుట స్పష్టము. కనుకనే ఆచార్యులవారు–

---

65) దేవి పుణ్యాత్ముల యింట లక్ష్మి పాపాత్ములయందు దరిద్రదేవత. విద్వాంసుల హృదయాలలో బుద్ధి, సత్పురుషులలో శ్రద్ధ. ఉత్తమ వంశీయులలో లజ్జగాను ఉండును. అట్టి దేవికి నమస్కారము.
66) తగని పనులపట్ల అసహ్యము హ్రీ నిరపేక్షత మొదలగు గుణాలు 'శ్రీ'.

**"ఆత్మాత్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాః"** అనిరి. **67**

భాగవతములో గోపికలకు వేసిన విశేషణములలో ఈ విషయము స్పష్టమగును. చూ॥

**"పురుషః శక్తిభిర్యథా"**

గోపికలు శక్తులుగా చెప్పబడినారు.

గోపికలు స్వయముగా (భాగవతమునందు)

"మనసో వృత్తయో నః స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః" అనిరి. అనగా తమ మనస్సుయొక్క వృత్తులు కృష్ణపాదములపై నిలువవలెను. ఇది పరోక్షముగా తమ గుఱించి చెప్పినమాట. లేనిచో 'మనస్సులు' అనవచ్చును. మనోవృత్తులు అని బహువచనముతో స్త్రీలింగశబ్దమును ఏలవాడిరి. పూర్వము ఛాందోగ్యాది ఉపనిషత్తులందు "శమదమాదులు దేవత"లని చెప్పబడినది గదా.

కనుక, రామావతారమునందు దేవతలు వానరులుగా అవతరించినట్లు కృష్ణావతారమునందు దేవతలు ఋషులు, గోపకులుగా – గోపికలుగా అవతరించినట్లు గ్రంథములలో నున్నది. ఈ విషయము ముందు ప్రకరణములలో చెప్పబడును. చూ॥ కృష్ణతత్వము (సప్తమపింఛము)

సారాంశమేమనగా, గోవులుగా చెప్పబడిన వాని అధిష్ఠానదేవతా దంపతులు గోపికా గోపకులు. అనగా ఇంద్రియములు – గోవులు.

ఇంద్రియాధిష్ఠాన దేవత అగ్ని మొదలగు వారు గోపకులు. ఆ దేవత శక్తులు స్వాహా మొదలగువారు – గోపికలు. అట్లే–

రశ్మలు – గోవులు.

అధిష్ఠానములయిన "శివశక్తులు = గోపికా గోపకులు"

నాడులు – గోవులు.

అధిష్ఠానదేవతలు – గోపికా గోపకులు.

---

67) ఈశ్వరా! మాలోని ఆత్మ నీవు. మాబుద్ధి పార్వతి. ప్రాణాలు పరిజనులు.

శమదమాదులు – దేవతలు – గోపకులు.

హ్రీ, శ్రీ స్మృతి మొదలగునవి గోపికలు.

ఇంద్రియములు – గోవులు. ఇలా –

తపస్సు ధ్యానము వివేకము మొదలగు ఋషిధర్మములు గూడా గోపికా – గోపకులు.

ఇవి భగవత్పరంగా, ప్రదక్షిణముగా చేయుటయే 'రాసలీల'

కనుక సమన్వయముగా ఏమనగా, భగవంతునకు భార్యలుగాని గోపికలుగాని అనుచరులైన గోపకులుగాని యాదవులుగాని అంతయును కాలగతమయిన, ప్రపంచగతమయిన, దేహగతమయిన నాడీ, రశ్మి, తిథి, ఇంద్రియాదులు, వాటి అధిష్ఠానశక్తులే అని అర్థము.

360 రోజులు అహోరాత్ర భేదముతో 720 అహోరాత్రములు, 360 రశ్మలు. స్త్రీ పురుష భేదముతో 720 రశ్మలు. ఇవియే సకల శరీరములలో తీసికొన్నచో 72,000 నాడులు, రశ్మలు కావచ్చును. 'సహస్రం' అనేది 'అనేక' అనే అర్థములో వాడబడుట సంప్రదాయమే. వీటిలో ప్రధానమయినవి హృదయప్రాంతమునుంచి సాగిపోవునవి 100 నాడులు.

**"శతం చై కాచ హృదయస్యనాద్యః"**

ఈ నూఱుగురు కృష్ణుని 100 భార్యలు, తిథులు 16, కళలు 16.

**"భూతేంద్రియమనాంస్యేవ క్రమాన్నిత్యాః కలాః పునః"**

ప్రకృతివికృతులు 16 – 10 ఇంద్రియాలు +
5 భూతాలు +
1 మనస్సు.

ఇవి 16,000 మంది భార్యలు కావచ్చును. వీనిలో ఎనిమిది అత్యంత ముఖ్యము.

మహదహంకార పంచన్మాత్రలు + మూలప్రకృతి.

**"భూమి రాపోనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" - గీత 68**

ఈ 'ఎనిమిది' అష్టమహిషులుగా భావింపవచ్చును. భగవంతుడు వీనికి 'తన ప్రకృతుల'ని పేరుపెట్టెను. కనుక ఆ పరమ పురుషునకు ఈ ప్రకృతులతో దాంపత్యమే 'అష్టమహిషీ కల్యాణము' అని భావింపవచ్చును. మఱియు యాదవులకు సాత్వతులని పేరు. సాత్వతులనగా భక్తులు.

**"సాత్‌పరమాత్మా సాత్వంతో భక్తాః"**

అను భట్టోజీ దీక్షిత నిర్వచనమునుబట్టి కృష్ణపరివారము అంతయు కృష్ణ భక్తగుణము.

**"వాక్కులు = గోవులు" అనే అర్థములో** "గోపికలు - గోపకులు" ఎవరు?

**"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః"**

ఉపనిషత్తులు గోవులని సాంప్రదాయమే. ఉపనిషన్మంత్రములు వేదమంత్రములు అన్నియు 'గోవులేనని' పూర్వము చెప్పబడినది.

**"గోప్యో గావ ఋచః"** అన్నది కృష్ణోపనిషత్తు.

పద్మపురాణము 'పాతాళ ఖండము'లో

**"గోప్యస్తు శ్రుతయో జ్ఞేయా ఋచో వై గోపకన్యకాః 69**
**దేవకన్యాశ్చ రాజేంద్ర తపోయుక్తా ముముక్షవః**
**గోపాలా మునయస్సర్వే వైకుంఠానందమూర్తయః"**

అని చెప్పబడినది. అనగా -

వేదములే గోపికలు, గోవులు గూడా అని చెప్పబడినది. గోపాలులు మునులని చెప్పబడెను.

---

68) భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నా ప్రకృతి 8 రకాలు.

69) శ్రుతులు గోపికలు. ఋక్కులు గోపకన్యలు. దేవకన్యలు గోపాలకులు ముముక్షువు లయిన మునులు.

గోవులు మంత్రములు అయినచో – గోపికాగోపకులు – మంత్రదేవతలు, మంత్రద్రష్టలయిన ఋషులు కావలయును. అయితే –

**"శక్తిశక్తిమతోరభేదః"** అన్నట్లు.

"మంత్రాధీనమయిన దేవత"కు 'మంత్రము' శరీరమని వ్యవహారము. దేవతకు మంత్రము శబ్దమయ గాత్రము. కనుక మంత్ర మంత్రదేవత మంత్ర ఋషులను అభేదముగా ఉపనిషత్తులు చెప్పియుండును. భాగవతముగూడా గోపికలను శ్రుతులతో పోల్చినది.

**"మనోరథాంతం శ్రుతయోయథాయయుః"**

ఈ వేదములలో కొన్ని "నేతి, నేతి" అని పరోక్షముగా పరమాత్మను ప్రతిపాదించు ఉపనిషత్తులు "మానినులు" అనియు, నేరుగా 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని చెప్పు ఉపనిషత్తులు ముగ్ధలనియు, కేవల కర్మభాగమును చెప్పు వేదశాఖలు "ఖండిత"లుగాను ఇలా బుద్ధివైభవము కొలది యూహింపవచ్చును.





# పంచమ పింఛము

## గోలోకము - గోకులము

గోలోకము అనగా 'కిరణ' లోకము అని చెప్పవచ్చును. భగవంతుని శక్తి కిరణరూపముగా ప్రసరించుచు అనేక లోకరూపములను దాల్చినది. అందు కిరణస్థితి అనగా సృష్టికి "భూమికాస్థితి అయిన" 'గోలోకము' అని చెప్పవచ్చును. ఈ లోకము గూర్చి వేదములో చెప్పబడిన మంత్రము ఇది. ఇది హరివంశ "దీప" వ్యాఖ్యనుండి యుద్ధరింపబడినది.

**"తావాం వాస్తూన్యుశ్మసి గమధ్యై**
**యత్ర గావో భూరిశృంగా అయాసః**
**అత్రాహ త దురుగాయస్య విష్ణోః (వృష్ణః)**
**పరమం పద మవభాతి భూరి"          ఋక్. 1-154-6**

దీని భావమేమనగా అయ్యా తమ (రామకృష్ణుల) నివాస స్థానములకు మేము చేరగోరుచున్నాము. అచ్చట పెద్ద కొమ్మలుగల ఆవులు (గోవులు) సంచరించుచున్నవి. ఆ గోలోకము ఈ భూలోకమునందు లేదా దేహము నందు వ్యక్తమగుచున్నది. సుదీర్ఘమైన కిరణములే దీర్ఘశృంగములయిన గోవులు. భూలోకమనగా దేహమే. బ్రహ్మాండమునందు గలవన్నియు పిండాండమునందు గలవనుటకు ఈ మంత్రముగూడా ఒక సూచన. ఇక ఈ గోలోకము గూర్చి బ్రహ్మవైవర్తపురాణము ఇట్లు చెప్పుచున్నది.

**"నిరాధారశ్చ వైకుంఠో బ్రహ్మాండానాం సరోవరః**
**తత్పరశ్చాపి గోలోకః పంచాశత్కోటియోజనం"          70**

అనగా వైకుంఠమునకు పైన 'గోలోకము' అని అర్థము. ఇక 'హరివంశము' -

---

70) నిరాధారంగా ఆకాశంలో వ్రేలాడుచున్న వైకుంఠము బ్రహ్మాండముల సరస్సు. దానికన్న 50 కోటి యోజనాలపైన గోలోకము.

**"తస్యోపరి గవాం లోకః సాధ్యాస్తం పాలయంతి హి
సహి సర్వగతః కృష్ణ! మహాకాశగతో మహాన్
ఉపర్యుపరితత్రాపి గతిస్తవ తపోమయీ"**

విష్ణులోకముపైన గోలోకము. దానిపైన కృష్ణుడు 'తపోమయ'ముగా నున్నాడు. అనగా తపోలోకమున నున్నాడు. అనగా గోలోకోపరిభాగము తపోలోకము క్రిందిభాగము విష్ణులోకము అని అర్థము. ఇంద్రుడు గోవర్ధనోద్ధరణము తర్వాత కృష్ణుని ప్రస్తుతించుచు అన్నమాటను చూద్దాం–

"అహంకిలేంద్రో దేవానాం త్వం గవా మింద్రతాం గతః" అని అనగా నేను దేవతలకు ఇంద్రుడను. నీవు గోవులకు ఇంద్రుడవు. ఇది యేమి స్తుతి? వెటకారముగా లేదా. నీవు 'గొడ్లను గాచేవాడివ'ని అనటం ప్రశంస ఎలా అవుతుంది?

గోవులు అనగా సర్వలోక మూలములయిన 'కిరణములు' అనుకొన్న పక్షమున ఇది ప్రశంసయే. కనుకనే యీ గోలోకమునకు పరిపాలకులు 'సాధ్యాః' అన్నారు. అనగా సాధ్యావస్థలో నున్నవారు. సిద్ధావస్థకు ముందు సాధ్యావస్థ.

అదే సర్వలోకముయొక్క ఆదిమస్థితి. అది భగవత్కిరణ రూపస్థితి. ఈ స్థితికి అధిపతి లోకకారణుడయిన పరమాత్మయే గదా. కనుక ఇంద్రుడన్నమాట ప్రశంసయే అయినది. పద్మపురాణము ఈ గోకులమును గూర్చి చెప్పిన విషయము – ఒక లోకముకన్న – దేహగత భాగమునకు బాగుగా సరిపోవుచున్నది. చూ॥

**"సహస్రపత్రకమలం గోకులాఖ్యం మహత్పదం"**

అనగా సహస్రార కమలము గోకులమట.

## సారాంశము :

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం.

ఈ లోకములలో 'సువః' లోకము స్వర్గవైకుంఠాది స్థానములకు సంబంధించినది. దానిపైనది గోలోకము. అనగా 'మహః' కావచ్చును.

భగవంతుడు 'తపోమయగతి' కలిగినట్లు హరివంశములో ఇంద్రుడు చెప్పినాడు. కనుక 'తపోలోకముదాకా గోలోక బృందావనములు' సాగినట్లు చెప్పవచ్చును. కనుక 'మహః, జనః, తపః' అనునవి గోలోక బృందావన ప్రాంతములు కావచ్చును. "మహః" అనగా తేజస్సు అని అర్థము. గోవులు కిరణములు అని చెప్పుకొంటిమి. కనుక 'మహః' నుంచి "గోలోకము" పొలిమేరలుగాను 'తపః' వఱకు సాగినట్లు చెప్పవచ్చును. ఈ గోలోకమునుగూర్చి హరివంశములో -

"మహాకాశగతో మహాన్" అని రెండుసార్లు 'మహ' శబ్దప్రయోగము గూడా 'మహః' లోకమునకు గోలోకమునకుగల సంబంధమునకు సూచనగా కన్పించుచున్నది.

## దేహపరముగా :

### 1) యోగశాస్త్రపరముగా :

కాళిందీనది యమున. ఇది శరీరములో 'పింగళా' నాడి. ఇడాపింగళలు గంగాయమునలు అని యోగశాస్త్రము. దీనిద్వారా కుంభకము జరుగును. ఇది కుడివైపు నాడి. పింగళ ఉత్తరాయణమునకు గుర్తు. ఇడానాడి ఎడమ వైపునాడి. దక్షిణాయనమునకు గుర్తు. ఇడ ప్రకృతి అయితే పింగళ పురుషునకు గుర్తు. ప్రకృతి పురుషులు = ఇడా పింగళలు. ఇది సూర్యునకు గుర్తు.

**"దక్షేతు పింగలానామ పుంరూపా సూర్యవిగ్రహా" - సమ్మోహనతంత్రం**

ఉత్తరాయణము, సూర్యుడు, పురుషుడు ఇవియన్నియు మోక్షసామగ్రి, భీష్ముడు ఉత్తరాయణమున మోక్షము పొందెను. సూర్యమార్గము అర్చిరాది మార్గము. యుద్ధవీరులు సూర్యమండలముద్వారా మోక్షమునకు బోవునను మాట గలదు గదా.

కాళిందీ నదీతీరము అనగా పింగళానాడి ప్రక్కనగల "సుషుమ్న"యే. ఇది కాంతిమయము. సూర్యసోమాగ్ని స్వరూపము నాదమయము. సర్వలోకమయము. సర్వదేవమయము. దీనియందు రశ్మిలు వ్యాపించియున్నవి.

**"తిర్యగూర్ధ్వ మధః శాయీ రశ్మయః తస్య సంతతాః"**

వీనిలో ఊర్ధ్వముఖరశ్మలే గోలోక కిరణములు కావచ్చును. ఈనాడి 'జ్వాలమాలాకులము' విశ్వమునకు ఆయతనము. ఈనాడి వెన్నులో గలదు. వెన్ను బ్రహ్మ విష్ణు శివధనుస్సులుగా, మేరుమందర వింధ్యములుగా చెప్పబడినది. అట్లే, కృష్ణకథలో "మధుర, ద్వారక, గోకుల, బృందావన, హస్తినాపురము"లుగా దీనినే వర్ణించినారు.

కనుక ఈ శరీరములో గోలోక బృందావనములు ఎచ్చటనో తేల్చవలయును. శరీరమునందు సుషుమ్నలో ఏడు చక్రములు గలవు. అట్లే బాహ్యప్రపంచము ఏడు లోకములుగా విభజింపబడినది. ఈ రెండు సరిచూచినచో గోలోకము సూచింపబడును.

| | | |
|---|---|---|
| మూలాధారము | = | భూలోకము |
| స్వాధిష్ఠానము | = | భువర్లోకము |
| మణిపూరము | = | సువర్లోకము |
| అనాహతము | = | మహర్లోకము |
| విశుద్ధము | = | జనోలోకము |
| ఆజ్ఞా | = | తపోలోకము |
| సహస్రారము | = | సత్యలోకము |

ఇందు "మహర్లోకము నుంచి, తపోలోకముల" వఱకు "గోలోక బృందావనములు విస్తరించినవి. కనుక శరీరమున అనాహతము నుంచి ఆజ్ఞవఱకు గోలోక బృందావనములుగా చెప్పవచ్చును. మణిపూరము లక్ష్మీనారాయణస్థానము. కనుక అది ద్వారకగా భావింపవచ్చును. స్వాధిష్ఠానము జలరాశి కనుక సముద్రము. దానిపైన మణిపూరము ద్వారకగా చెప్పవచ్చును. అట్లే మణిపూరము= వైకుంఠముగా భావించినచో వైకుంఠము పైన గోలోకము అని హరివంశాదులు చెప్పుచున్నవి కనుక 'మహర్లోకము' నుంచి 'గోలోక' మనుటకు మఱింత బలము చేకూరినది.

## మధుర :

ఇది గోకుల రాజధాని. కంసుని ఏలుబడిలో గోకులమున్నదనుట వలన 'మధుర' గోకులమునకు దగ్గఱిది. కంసుని ప్రభావము పడగూడదను భావముతో నందుడు 'బృందావనమున'కు తరలెను. కనుక బృందావనము మధురకు దూరమని భావింపవలెను. ఈ 'మధుర' మన హృదయ ప్రాంతమున ఉన్నట్లు గ్రంథ ప్రమాణములు లభించుచున్నవి.

**"మధురాయాం విశేషేణ మాంధ్యాయన్ మోక్ష మశ్నుతే**
**అష్టపత్రం వికసితం హృత్పద్మం తత్ర సంస్థితమ్"** **71**
**- గోపాలోత్తరతాపినీ**

అనగా మధురలో హృత్పద్మము కలదట. అది ఎనిమిది దళములు గలదట. ఇది మామూలు 'పట్టణం' కాదని స్పష్టమే. ఆ పద్మము 'హృదయ పద్మము' అనుటనుబట్టి మధురస్థానము 'హృదయు' ప్రాంతమని చెప్పవలయును. గోలోకమునకు స్థానమయిన 'అనాహతము' గూడా హృదయప్రాంతమే. కనుక అనాహత ప్రాంతముననే మధుర. దానిదగ్గఱనే గోలోకము లేదా గోకులము అని చెప్పవలెను.

ఈ 'మధుర' భౌతిక ఘటన గాదని గూడా తేలుచున్నది. దీనినిబట్టి అంతరార్థము ఎంత ఆవశ్యకమో తేలుచున్నది. ఈ మధురగూర్చి "పద్మపురాణము"లో -

**"యదా విశుద్ధా స్తప ఆదినాజనాః**
**శుభాశయా ధ్యానధనా నిరంతరం**
**తదైవ పశ్యంతి మమోత్తమాం పురీం**
**న చాన్యథా కల్పశతైః ద్విజాతయః"** అని చెప్పబడినది.

అనగా తపస్సు చేసిన శుద్ధాత్ములు, నిరంతర ధ్యానయోగులు తప్ప ఇతరులు కొన్ని కల్పములయినా 'మధుర' ను దర్శింపలేరట. రైలు టిక్కెట్టు

71) మధురలో విశేషంగా నన్ను ధ్యానించువాడు మోక్షం పొందును. అచ్చట 8 దళాల హృదయపద్మం ఉన్నది.

కొని అతి తేలికగా మధురను చూడగలము గదా. మఱి యీ పురాణవాక్యమేమి? పురాణములోని 'మధుర' ధ్యానగమ్యమయిన 'భగవన్నివాసము' కనుక కృష్ణకథలోని 'మధుర' అంతరార్థమును కోరుచున్నది. తేలిన దేమనగా – మధుర గోకుల బృందావనములు దేహములో హృదయప్రాంతము నుంచి పైకి ఉన్నవి. 'మూలాధారము' తమోగుణభూయిష్టము. అది తమశ్చక్రము. చీకటి, రాక్షసుల గుణములు కామక్రోధాదులు అచ్చట అధిష్ఠించియున్నట్లు యోగశాస్త్రము. మూలాధారమున ఒక 'ఏనుగు' కనిపించునని యోగశాస్త్రము. హస్తి= ఏనుగు కనుక "హస్తినాపురి" మూలాధారము కావచ్చును. అచ్చటనే దుర్యోధనాదులు అసుర గుణములతో రాజ్యమేలుట గూడా ఇందుకు సూచన. ధృతరాష్ట్రుని గ్రుడ్డితనము చీకటికి అజ్ఞానమునకు సంకేతము.

**"అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా" 72**

అన్నట్లు మధురలో హృదయసీమలో అవతరించిన దివ్యపురుషుడు కృష్ణుడు.

రాముడు తాటకా వనమునకు, మిథిలకు పోయినట్లు కృష్ణుడు గోకులమునకు బృందావనమునకు పోయెను. తరువాత మఱల 'మధుర'కు వచ్చెను. ఆ తరువాత ద్వారకకు వచ్చెను. అచ్చటినుండి హస్తినాపుర వ్యవహారములు చక్కబెట్టి మఱల ద్వారకకువచ్చి చివఱకు జలమున మునిగిపోయెను. ఇది అంతయు దేహగతముగా భావించాలి. సహస్రారమునుండి హృదయమున కార్యశక్తిగా అవతరించిన పరమాత్మ దివ్యసాధనాబలముతో యోగానందములను యోగకల్యాణములను పొంది చివఱకు దేహాశ్రితము లయిన 'దుష్టభావనలను' నిర్మూలించి ఈ శరీరమును ఆదిభూతమయిన జలము నందు కల్పి నిత్య పదార్థమునందు ఏకమయినట్లు ఒక మోక్షగాథగా చెప్పవలయును.

**అప ఏవ ససర్జాదౌ తాసువీర్యమపాసృజత్; మఱియు 73**

---

72) 8 చక్రములు, 9 ద్వారములు గల అయోధ్య దేవనగరి.

73) ముందు జలమును సృజించి వాటియందు తనశక్తిని విడిచెను. అట్లే అతడు ఈ లోకములను సృజించెను. అంభః, మరీచి, మరం, జలము ఇవి లోకములు.

**స ఇమాన్ లోకానసృజత అంభోమరీ చీర్మరమాపః" – ఐతరేయం)**

కనుక గోలోక బృందావనములు –

1) విష్ణులోకముపైని లోకములు.

2) మహర్లోకమునుంచి తపోలోకము వఱకు.

3) అనాహతమునుండి ఆజ్ఞ వఱకు.

4) మధుర హృదయప్రాంతము గోలోకములో ఒక భాగము.

## 2. జ్ఞానపరముగా :

"గోవులు= ఇంద్రియములు" అనుకొన్నచో ఇంద్రియాభిమానముగల ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు కావచ్చును. ఆనందమయ కోశము, దాని తరువాతస్థితి – బృందావనము కావచ్చును. లేదా "శరదృతువు" వెన్నెల, మల్లికలు మొదలగు తెల్లని పదార్థములు వర్ణించుటవలన విజ్ఞానమయ కోశ ఆనందమయకోశములు రెండు కల్పి బృందావనముగా భావింపవచ్చును. **"కాల"పరముగా అనుకొన్నచో–**

గోకుల, బృందావనములు సంవత్సరముగాను, అట్టిదే మరేదయినా "కాలసమూహము" గా భావించుకొనవచ్చును.

"గోవులు=నాదము" వాక్కులు, వేదములు, అనుకొన్నచో–

1) నాదము అనుపక్షమున –

అనాహతము నాదస్థానము – ప్రణవనాదము అచ్చట స్వయముగా ఉత్పత్తి చెందును. అట్లే భ్రూమధ్యము వేణునాదస్థానము. ఆపైన భేరీనాదము ఇది ఆనక దుందుభి అనే పేరుతో వసుదేవుడుగా చెప్పబడినది. కనుక అనాహతము నుంచి ఆజ్ఞ వఱకు 'గోలోకము' అని భావింపవచ్చును.

**"అనాహతస్య శబ్దస్యతస్య శబ్దస్య యో ధ్వనిః**
**ధ్వనేరంతర్గతం జ్యోతిః జ్యోతిరంతర్గతం మనః**
**తన్మనోవిలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్" 74**

74) అనాహత చక్రమునందు వచ్చిన ధ్వని. దానియందు జ్యోతి, జ్యోతిలో మనస్సు ఆ మనస్సు విష్ణుస్థానమున లయము పొందును.

2) "గోవులు= వేదములు" అను పక్షమున

మనోమయ విజ్ఞాన (బుద్ధి) మయకోశములు సకల విద్యాస్థానములు. "తైత్తిరీయము"లో మనోమయకోశాభిమాని అయిన జీవునకు –

**"తస్య యజురేవ శిరః ఋుక్ దక్షిణః పక్షః సామ ఉత్తరః పక్షః ఆదేశ ఆత్మా ఆధర్వాంగిరనః పుచ్ఛం ప్రతిష్ఠా"** [75] అని చెప్పబడినది.

కనుక ఈ కోశములు విద్యానిలయములు. ఇవి "గోలోకము / గోకులము" వ్యక్తుల హృదయమునందే వేదములుండునని వాటిని భగవంతుడు రక్షించునని మా గురువుగారి 'ప్రారబ్ధ ప్రాబల్యము' నందలి యీ శ్లోకము సూచించును.

**"పద్మాప్త పద్మకోశ సమే హృదయే మధ్యమండలే విచరన్**
**గావ ఋుచః పాసి సదా స్వీయా గోవింద లోకరక్షార్థమ్"**



75) మనోమయకోశంలోని జీవునకు యజుర్వేదం తల, ఋుక్కు కుడిరెక్క. సామము ఎడమరెక్క ఆదేశము ఆత్మ. అధర్వాంగిరశాఖ దానికి పుచ్ఛము ప్రతిష్ఠ.

# షష్ఠ పింఛము

## బృందావనము

బృందయొక్క వనము= బృందావనము; (బృంద= తులసి); బృందము యొక్క అవనము = బృందావనము.

అవధాతువునకు "రక్షణ, పొందుట, ఆనందము, కాంతి" మొదలగు అర్థములు కలవు.

**"సామూహిక రక్షణ, సామూహిక యోగము**
**సామూహిక ఆనందము, సామూహిక కాంతి"**

ఈ యర్థములన్నియు రాసలీలకు సరిపోవును. అది తులసీవనముగా భావించినచో బృందావనము అని యగును.

**లోకపరముగా :**

బృందావనము గోలోకముకన్న పైదిగా కొందఱు, గోలోకమునందే యున్నట్లు కొందఱు చెప్పుచున్నారు. ఈ రెండిటికి సమన్వయము సులభమే. గోలోకము నందే శిఖరభాగమున బృందావనము అనుకొన్నచో సరిపోవును. ఈ సమన్వయమే ముందు 'దేహ'పర సమన్వయమునకు గూడా సరిగా కుదురుచున్నది.

ఇక పురాణ సాక్ష్యములను పరిశీలించవలయును.

**బ్రహ్మవైవర్తము :**

**"నిరాధారశ్చ వైకుంఠో బ్రహ్మాండానాం సరోవరః**
**తత్పరశ్చాపి గోలోకః పంచాశత్కోటి యోజనమ్**
**యోజనాయుత విస్తీర్ణః తత్రైవ రాసమండలః**
**అమూల్యరత్న నిర్మాణః వర్తులః చంద్రబింబవత్" 76**

76) వైకుంఠము బ్రహ్మాండముల సరస్సు. దానిపైన 50 కోటి యోజనముల తర్వాత గోలోకం. అది 10వేల యోజనముల విశాలము. అచ్చటనే రాసమండలం. అమూల్య రత్ననిర్మితమయిన అది చంద్రబింబములాగా గుండ్రనిది.

అనగా గోలోకమునకు పైన అనగా పై భాగమున రత్నమయమయిన రాసమండలము గలదు. అది చంద్రబింబమువలె గుండ్రని లోకము.

ఈ వర్ణనము దేహమునందలి చింతామణి పీఠము, సహస్రారచక్రము చంద్రమండలములను పోలుచున్నది. కనుకనే 'రాసలీల' "హల్లీసక"ముగా భాగవతములో వర్ణింపబడినది. బృందావనము ఇచ్చట "రాసమండలము"గా వర్ణింపబడినది.

**"బృందాయత్ర తపస్తేపే తత్తుబృందావనం స్మృతమ్**
**రాధాషోడశనామ్నాం చ బృందానామ శ్రుతౌ స్తుతం**
**తస్యాః క్రీడావనం రమ్యం తేనబృందావనం స్మృతమ్" 77**

**- భాగవతం**

అనగా బృందాదేవి తపస్సు చేయుటచే అది బృందావనము అయినది. ఇంతకును ఆ "బృంద" రాధావతారభేదమేనట. ఆ రాధకు క్రీడావనమే ఈ బృందావనము.

ఇక "పద్మపురాణము" వివిధ అధ్యాయములనుంచి 'బృందావనము' గూర్చి చెప్పిన విషయములను తెలిసికొందుము.

**"తతశ్చ స ఉపాదిష్టో గోలోకాదుపరిస్థితం"**

సః = అనగా సందర్భమునుబట్టి 'అర్జునుడు'.

**"నిత్యం బృందావనం నామ నిత్యం రాసమహోత్సవం**
**అపశ్యత్పరమం గుహ్యం పూర్ణప్రేమరసాత్మకమ్**
**కాళిందీ చాకరోద్యస్య కర్ణికాయాః ప్రదక్షిణమ్" 78**

---

77) బృందాదేవి తపస్సు చేసిన చోటు బృందావనము. రాధయొక్క 16 పేర్లలో బృందా నామం వేదంలో ఉంది. ఆమె క్రీడావనమే బృందావనము.

78) నిత్యము రాసలీలలతో రమ్యమయినదే బృందావనము. అది రహస్యమయినది. పూర్ణప్రేమ రసాత్మకమయినది. దాని కర్ణికకు కాళిందీనది ప్రదక్షణము చేస్తూ ప్రవహిస్తున్నది.

ఇది బృందావనము చిఱునామా, ఆకాశములో ఉన్న ఈ బృందావనమునకు గూడా 'కాళిందీ' నది ప్రదక్షిణము చేయుచున్నది. అది గోలోకమునకు పైన ఉన్నది. అది పరమ రహస్యమయినదిట.

**"వైకుంఠాది తదంశాంశః "స్వయం బృందావనం భువి**
**యద్బ్రహ్మ పరమైశ్వర్యం నిత్యం బృందావనాశ్రయమ్" 79**

అనగా– 'వైకుంఠ' లోకముగూడా బృందావనమునుంచి అవతరించినది. బృందావనమే భూమియందు అవతరించినది. ఇంతవఱకు జరిగిన వర్ణన ఖగోళములో కనబడవలసిన 'లోకము'గూర్చి యని తెలియుచున్నది. కాని "పరమం గుహ్యం" అనుట ఏల?

"ఇదే పురాణము"లో వేఱు 'అధ్యాయము'లో

**"సహస్రదలపద్మస్య బృందారణ్యం వరాటకం**
**యస్య స్పర్శన మాత్రేణ పృథ్వీధన్యాజగత్త్రయే"**

అని వర్ణింపబడినది. ఈ బృందావనము 'సహస్రదల పద్మమునకు మధ్య ఉన్న 'కర్ణిక' అని చెప్పబడుచున్నది. దీనిని తాకినచో 'భూమి' ధన్యురాలట. ఆకాశగతమయిన లోకమును భూమి తాకుట యెట్లు. ఆ బృందావనము భూమిమీద అవతరించినది కనుక భూమి పవిత్రమని భావన. కాని 'సహస్రార చక్రము'నకు ఈ లోకము 'కర్ణిక' అని చెప్పబడుట వలన ఇది 'దేహ'పరమని అనిపించుచున్నది.

ఈ లోకమున మూలప్రకృతి అయిన రాధ ఉండునని ఆమె ప్రేమ సముద్రనిమగ్నమయిన ఈ ముల్లోకములను మోహింపజేయునని పద్మపురాణము చెప్పుచున్నది.

**"తత్ర యా ప్రకృతిస్త్వాద్యా రాధికా కృష్ణవల్లభా**
**జగత్త్రయం మోహయంతీ మగ్నం ప్రేమసుధార్ణవే"**

ఈమెను "హ్లాదినీ" శక్తి యందురు. అనగా 'ఆనంద' శక్తి అనియర్థము.

79) వైకుంఠం మొ॥ లోకములు బృందావనంలో స్వల్పభాగముతో సమానము. పరమేశ్వరమయిన కృష్ణబ్రహ్మము నిత్యం అచ్చటనే ఉంటుంది గదా!

పద్మపురాణము – పాతాళ ఖండములో –

**"భగవానాహ మాంప్రీతః ప్రసన్నవదనాంబుజః**
**గోప్యస్తు శ్రుతయోజ్ఞేయా ఋచో వై గోపకన్యకాః**
**దేవకన్యాశ్చ రాజేంద్ర తపోయుక్తా ముముక్షవః**
**గోపాలా మునయస్సర్వే వైకుంఠానందమూర్తయః"**

అనగా గోపికలు ఋగ్వేదములు. గోపకన్యలు ముముక్షువులయి తపోయుక్తలయిన దేవకన్యలు. వీరికే భగవంతుడు వస్త్రాపహరణము చేసెను. ఈ కథ అంతరార్థపరముగా ముందు వ్యాఖ్యానింపబడును.

గోపాలకులు మునులు. సిద్ధులు, సాధ్యులు. గోపాలకులు మొదలగు వారు పక్షిరూపధారులయి బృందావనములో శ్రీకృష్ణ మురళీగానము వినెదరట. చూ॥ (శరీరంలోని కోశాలలోని జీవులు పక్షులేగదా) చూ॥

**"కల్పవృక్షః కదంబోయం పరానందైక భాజనమ్, 80**
**సిద్ధాశ్చ సాధ్యాగంధర్వాః కోకిలాద్యా న సంశయః" – స్కాంద**

**"ప్రాయో బతాంబమునయో విహగా వనేస్మిన్**
**కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతం 81**
**ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాళాన్**
**శృణ్వంతి మీలితదృశో విగతాన్యవాచః" – పద్మపురాణం**

కనుక బృందావనము మామూలు తోటకాదు. గోపికలు సాధారణ స్త్రీలు కారు. వృక్షములు మామూలు చెట్లు కాదు. అవి కల్పవృక్షములు. ఇట్టి బృందావనము వదలి భగవంతుడు ఒక్క అడుగయినను అవతలకు వెళ్ళడు. చూ॥

**"బృందావనం పరిత్యజ్య పదమేకం నగచ్ఛతి" – పద్మపురాణం**
**"బృందావనరజోబృందే తత్ర స్యుః విష్ణుకోటయః" – పద్మపురాణం**

---

80) పరమానంద నిలయమయిన కదంబ వృక్షమే కల్పతరువు. సిద్ధ సాధ్యగంధర్వులే అచ్చటి కోకిలలు.

81) మునులు పక్షిరూపం దాల్చి ఇతర వాదనలు మాని, నిమీలితనేత్రులయి, చెట్లమీద వాలి కృష్ణుని మధురవేణునాదమును వినుచుందురు.

అని చెప్పబడినది. బృందావన ధూళిలో కొన్ని కోట్ల 'విష్ణువులు' ఉందురు. అనగా బృందావనమునుండి ప్రసారమగు కాంతి పరాగమే అనేక లోకములుగా అయ్యెనని సూచన కావచ్చును.

## దేహములో :

1) యోగపరముగా : పద్మపురాణగత వర్ణనబట్టి బృందావనము సహస్రారప్రాంతముగా అర్థమగుచున్నది. సహస్రదళ పద్మమునకు బృందావనము 'కర్ణిక' అని చెప్పబడినది. బృందావన వర్ణన మంతయు దేహపరముగా బాగా సరిపోవుచున్నది. లోకపరముగా అన్వయము కొంతభాగము కుదురుటలేదు. కనుక దేహములో బృందావనము ఉన్నదనుట నిస్సందేహము. గోలోకము కన్న పైన అని గోలోక మధ్యములోనని రెండు వర్ణనలు కనబడుచున్నవి.

మన శిరస్సు రెండు భుజముల మధ్యన ఉన్నది. అలాగే రెండు భుజములపైన ఉన్నది. భుజముల అంచునుంచి రెండు నిలువుగీతలు ఊహించుకొన్నచో విషయము స్పష్టమగును. అట్లే గోలోకమునకు మధ్య గోలోకమునకు పైన బృందావనము గలదు. 'పద్మకర్ణిక' పద్మమధ్యంలో పద్మమునకన్న ఎత్తుగా పద్మముపైన ఉండును గదా. అట్లే –

'అనాహతము' నుంచి కంఠముదాకా 'గోలోక' మనుకొన్నచో 'ఆజ్ఞ నుంచి సహస్రారము' వఱకు ఉన్న భాగము బృందావనము అనుకొనవలయును. కనుక బృందావనము గోలోక మధ్యమున పైభాగమున ఉన్నట్లు చెప్పుట సమన్వయము. ఇందుకు నెమలికన్నులోని "కన్ను" ఉదాహరణ. అది నెమలికన్నులో మధ్యగా, పైగా ఉన్నదిగదా. అదియును 'వృత్తాకారమే' గదా. కనుక దేహమున సహస్రారమే "బృందావనము" అని తేలినది. ఆజ్ఞ నుంచి అనాహతము వఱకు తేజోలోకములు. స్వాధిష్ఠాన మూలాధారములు చీకటి చక్రములు. ఆజ్ఞనుంచి క్రిందకు రశ్మలు ప్రసరించును. కనుక ఆజ్ఞనుంచి క్రిందకు గోలోకమని పూర్వము తేల్చబడినది. దానిపైన బృందావనము కనుక ఆజ్ఞ సహస్రారములే బృందావనము కావలయును.

దేవీ భాగవతములో "రాధ నాలుకనుంచి సరస్వతి పుట్టుట" మొదలగు విషయములు గలవు. దీనినిబట్టి 'రాధ' భ్రూమధ్య ప్రాంతముగానే భావింప వలయును. యోగశాస్త్రమున "సరస్వతీనాడి" నాలుకనుంచి పుట్టినట్లుగలదు. కనుక రాధాస్థానము నాడీమండలం నుండి ఊర్ధ్వమని చెప్పదగును. రాధాకృష్ణుల తత్వము అర్ధనారీశ్వర తత్వము ప్రకృతి పురుషతత్వము ఉమామహేశ్వరతత్వము సమానములు. కనుక ద్వైత ప్రారంభ చక్రమయిన ఆజ్ఞయే బృందావన ప్రాంతము. అచ్చట అక్షరములు రెండు. అవి "హం, క్షం" సహస్రారము దాటిన తరువాత ద్వాదశాంత పీఠక చక్రమున ద్వైతభావనకు తావులేదు. గోపికలు లేరు. రాసలీలలు లేవు. పరమాత్మ రెండుగా అయి సృష్టికాముడయిన స్థితికి 'ఆజ్ఞ' సంకేతము. సహస్రార చంద్రప్రకాశముతో 'ఆజ్ఞా' ప్రాంతముగూడా ధవళకాంతులతో ప్రకాశించును. భగవంతుని లీలలు అవ్యక్త స్థితినుండి వ్యక్తమగుట ఆజ్ఞనుంచియే. పైగా రాసలీలలు సరూపశృంగారముగా చెప్పబడినవి. కనుక ఇది ఆజ్ఞా సహస్రారముల ప్రాంతము. శూన్యచక్రమునకు / పీఠక / ద్వాదశాంత / బ్రహ్మ రంధ్రమునకు చేరని స్థితి. రాసలీలమధ్య భగవంతుడంతర్ధానమగుట శూన్యక చక్రమునకు పోయిన స్థితి కావచ్చును. ఒక్కరాధతోనే గడిపిన 'కాలము' సహస్రారములో దేవీపారమ్యము కావచ్చును.

అంతర్ధానమయిన స్థితిని నారాయణ తీర్థులవారు తమ 'తరంగముల'లో 'స్వస్వరూప స్వీకారము'గా చెప్పుటగూడా ఇందుకు సూచన. "చుట్టు గోపికలు మధ్య కృష్ణుడు" స్థితి= సహస్రారము నందలి "సహస్రదళముల మధ్యకర్ణిక" అను స్థితి కావచ్చును. తరువాత చుట్టు మధ్య "గోపికాకృష్ణులు" ఉన్న స్థితి 'ఆజ్ఞాచక్రము'లోని 'ద్వైతస్థితికి' సూచన కావచ్చును.

## 2. జ్ఞానపరముగా :

గోలోకము మనోమయ బుద్ధిమయ కోశములు అనుకొన్నపుడు బృందావనము "ఆనందమయకోశము దాని తరువాత స్థితి" కావచ్చును. ఈ స్థితిలో విషయానందేతరమయిన "భగవదానందము" అనుభవ గోచరమయినదిగదా. ఇందులో కొంత జ్ఞానబోధ గూడా జరిగినది కనుక 'విజ్ఞానమయకోశ' సంస్కరణ కారణముగా రాసలీలకు ముందు జరిగిన గోపికా గీతము మొదలగునవి విజ్ఞానమయకోశమును సూచించుచున్నవి.

**'గోవులు – వాక్కులు' అనే అర్థములో బృందావనమనగా :**

వేదములన్నియు పరమగమ్యుడయిన భగవంతుని దివ్య వైభవమును తనివితీఱ వర్ణించినది ఉపనిషద్భాగములలోనేగదా. కనుక ఉపనిషద్వాఙ్మయము 'బృందావనము' అని చెప్పవచ్చును.

**"సర్వోపనిషదోగావః"** అన్నట్లు.

నారాయణతీర్థులవారు తరంగములలో ''బృహదారణ్యకము'' బృందావనమని చెప్పియున్నారు.

**"బృందావన మిహ మన్యే సఖి బృహదారణ్య మహం**
**సుందరతర వంశనాద సంసూచిత** **82**
**స్వానంద బోధామృతమయపురుషం"**

అని చెప్పినారు. బృహదారణ్యకములో 'ఉద్గీథము' గురించి కొద్దిగా చెప్పబడినది. అదే 'నాదము'. బృహదారణ్యకములో బ్రహ్మ విద్యావంతుల వంశములు కొన్ని అధ్యాయాల చివఱ చెప్పబడినవి. కనుక 'వంశము' లున్నవి. అట్టి బృహదారణ్యము బృందావనముతో సమానమట. రెండింటిలోనూ ఆనందమయ పురుషుని గుఱించి చెప్పబడినది.

బృందావన వృక్షములు వేదములు, వానిశాఖలు మాధ్యందిని మొదలగునవి వేదశాఖలు. పల్లవములు ఉపనిషత్తులు. ఫలములు మోక్షానందములు. ఆ శాఖలపై పక్షులు హంసలు పరమహంసలు, కవికోకిలలు మొదలగునవి.

**"సిద్ధాశ్చసాధ్యా గంధర్వాః కోకిలాద్యా నసంశయః"**

అన్నట్లు సిద్ధ సాధ్య గంధర్వులు. అంతేగాక –

**"ప్రాయోబతాంబ మునయో విహగా వనేస్మిన్"**

అని మునులు గూడా పక్షులే. తైత్తిరీయము తిత్తిరి రూపమునుల నుంచివచ్చిన ఉపనిషత్తుగదా. ఇంతేగాక, ఆయా కోశములలో పురుషులను వేదము 'పక్షిరూపము'తో పోల్చినది చూ॥

82) చెలీ! బృందావనమును బృహదారణ్యోపనిషత్తుగా భావించుచున్నాను. సుందరమయిన వంశనాదరూపమయిన ఓంకారము ఆనందమయ పురుషుని సూచించుచున్నది.

**1. "తస్య ప్రియమేవ శిరః**
**మోదో దక్షిణః పక్షః**
**ప్రమోద ఉత్తరః పక్ష**
**ఆనంద ఆత్మా బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా"**

ప్రియము శిరస్సు. మోదం కుడిరెక్క. ప్రమోదం ఎడమరెక్క. ఆనందము ఆత్మ. బ్రహ్మం దానికాధారము తోక.

ఇది ఆనందమయ కోశాభిమాని యయిన పురుషుడు. అనగా-
"గోపాలా మునయస్సర్వే వైకుంఠానంద మూర్తయః"

**2. తస్య శ్రద్ధైవశిరః**
**ఋతం దక్షిణః పక్షః**
**సత్యముత్తరః పక్షః**
**యోగ ఆత్మా మహః పుచ్ఛం ప్రతిష్ఠా"**

శ్రద్ధ తల. ఋతము కుడిరెక్క. సత్యము ఎడమరెక్క. యోగం ఆత్మ. తేజస్సు ఆధారం తోక.

ఇది విజ్ఞానమయ కోశాభిమాని అయిన పురుషుని చిత్రణ.

**3. అన్యోంతర ఆత్మా మనోమయః**
**తస్య యజురేవ శిరః**
**ఋగ్ దక్షిణః పక్షః**
**సామోత్తరః పక్షః ఆదేశ ఆత్మా**
**అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా"**

లోపల మనోమయకోశము. యజస్సు తల. ఋక్ కుడిరెక్క. సామ ఎడమరెక్క. ఆదేశము ఆత్మ. అధర్వాంగిరసము తోక ఆధారము.

ఇట్టి యీ కోశాభిమానులయిన పురుషులందఱు పక్షులుగా చెప్పబడిరి. కనుక బృందావన మునులు ఆనందమయకోశ స్వరూపులయిన మునులు కావచ్చును.

"గోవులు= కాలము" మొదలగునవి అనుకొన్నచో సర్వకాలాంశ సమాహారస్థితి రాసలీల, బృందావనము కావచ్చును. విడదీసిన కాలములో

బృందావనమును చూపుట సాధ్యము కాదు. మహాకాలములో భగవంతుని "సృష్ట్యున్ముఖ" స్థితి కాలము అని యూహింపవచ్చును. అనగా మహాకాలము తన కాలాంశల మధ్యనున్నట్లు భావించుట. "గణేశ్వరుడు-గణములు" వలె.

## ఖగోళపరముగా :

ఈ మొత్తము రాసలీలోత్సవమునకు ఖగోళ పరమయిన సమన్వయము గూడా సూచనగా సరిపోవుచున్నది.

ఈ మొత్తము రాసలీలా వృత్తాంతము 'శరదృతువు'లో జరిగినట్లు తెలియుచున్నది. వర్షఋతువు వెళ్ళిన తరువాత జరిగినది. హరివంశములో 'గోవర్ధనోద్ధరణ' జరిగిన తరువాత ఇంద్రుడు కృష్ణుని ప్రశంసించిన ఘట్టములో

**"మమోపరి యథేంద్రస్త్వం స్థాపితో గోభి రీశ్వరః**
**ఉపేంద్ర ఇతి కృష్ణత్వాం గాస్యంతి దివి దేవతాః"**

అని అనెను. అనగా గోవులు అన్నియు కలిసి కృష్ణుని ఇంద్రునిపైన నిలబెట్టినవి. 'ఉపరి - ఇంద్ర' కనుక నీవు 'ఉపేంద్రుడ'వని ఇంద్రుడు చెప్పెను. తరువాత -

**"యేచే మే వార్షికామాసాః చత్వారో విహితామమ**
**తతః ప్రవర్తతే పుణ్యా శరత్సుప్తోత్థితే త్వయి**
**లోకేస్మిన్ కృష్ణ నిఖిలే యథైవ త్రిదివేతథా"**

అనియు అనెను. అనగా వార్షుకమాసములు నాలుగు గడిచిన తరువాత వచ్చు శరదృతువులో నీవు నిద్ర మేల్కాంచిన తరువాత ఆకాశమునందువలె భూలోకమునందుగూడా 'శరత్కాలము' వచ్చును. ఈ శ్లోకము వలన మనము ఊహింపదగిన భావములు ఇవి.

1) ఇది శరత్తులో జరుగును. అదియును చాతుర్మాస్యల తరువాత 'చత్వారో వార్షికా మాసాః' అని సంప్రదాయము. ఆషాఢము నుంచి ఆశ్వయుజం వఱకు. కనుక రాసలీలోత్సవము 'కార్తిక' మాసమునకు వెళ్ళినది.

2) కృష్ణుడు చాతుర్మాస్యల తరువాత నిద్రలేచును. కాని గోకుల కృష్ణుడు రోజూ నిద్ర లేచుచుండును. కనుక చాతుర్మాస్యలలో ప్రస్తుతము నిద్రపోవు కృష్ణుడు కావలయును. ఆయన శ్రీమహావిష్ణువు. విష్ణుబోధనైకాదశి తరువాత అనగా కార్తికశుద్ధ ఏకాదశి తరువాత అని యర్థము. ఆ తరువాత పుణ్యమయిన 'శరత్కాలము'. అనగా మనలోను ఖగోళమునందును 'విష్ణువు' మేల్కొంచినపుడే 'శరత్తు' లేనిచో అంతా చీకటిమయమే. కనుక గోపాలకృష్ణుడు గోకులలీల ఈ రెండు ఆకాశ పురాణమునకు ప్రతిబింబమే. చూ॥

**"ఏకాదశ్యాం శుక్లపక్షే హ్యాషాఢస్య సురోత్తమ**
**స్వమాయయా పవిత్రాంగ్యా నిద్రయా వర్ధతే ప్రభుః 83**
**ప్రసన్నమూర్తిర్భగవాన్ కార్తీక్యాం భవతి ప్రభుః**
**తస్య ప్రసన్నదివస ముత్థానాఖ్యం విదుర్బుధాః"**

**- "శేషధర్మములు"లో**

ఈ కార్తీకశుద్ధమందు ఆకాశములో ఉత్తరభాగమున ధ్రువమండలమునకు పైన శేషశయనుడయిన శ్రీమన్నారాయణుని దివ్యనక్షత్రములు సూర్యోదయాత్పూర్వము ఉదయించును. ఇది ఉత్థానైకాదశి. ఈ నక్షత్ర సముదాయము యొక్క వివిధ భంగిమలు శయన పరివర్తనములుగా చెప్పబడును. పురుష సూక్తములో విరాట్పురుషునకు

**"అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపం" 84**

అని చెప్పబడిన నక్షత్రరూపము ఇది. దేవతలందఱకు నక్షత్రరూపములున్నవని సంప్రదాయము. అట్టి నక్షత్రరూపులు సూర్యోదయాత్ పూర్వక్షణములతో తూర్పున ఉదయించిన రోజున ఆ దేవతలను ఆరాధింప వలయునని శాస్త్రము.

**"ప్రాత ర్యావాణా ప్రథమాయజధ్వం"** - శ్రుతి.

83) దేవా! ఆషాఢశుక్ల ఏకాదశినాడు పవిత్రమయిన తన మాయతో విష్ణువు నిద్రించును. కార్తిక ఏకాదశినాడు ఆయన నిద్రమాని ప్రసన్నుడగును. ఆరోజును ఉత్థానైకాదశి అందురు.
84) అహోరాత్రములు పార్శ్వములు నక్షత్రములు రూపము.

అట్లే సూర్యాస్తమయ సమయంలో తూర్పున ఉదయించే నక్షత్రముల దేవత గూడా ఆరాధింపబడును. అనగా ఖగోళమున తూర్పుదిక్కున "సూర్యుడు లేనపుడు" కనబడే నక్షత్రములు ఆరాధనీయములు. ఈ ప్రకారమే భాద్రపదశుద్ధ చవితినాడు వినాయక నక్షత్రములు కనబడును. గనుక వినాయకచవితి. ముందు వినాయకోదయము తరువాత సూర్యోదయము అనగా సూర్యుడు ఆరోజు దేవతగా వినాయకుని తెచ్చినట్లుగా భావించి వినాయక పూజచేసెదము. ఈ వినాయక నక్షత్రములే సరిగా 6 నెలలకు సాయంకాలమునకు తూర్పుదిక్కున ఉదయించును. 'కావున ఫాల్గుణ శుద్ధ చవితి 'పుత్రగణపతి' వ్రతము చేసెదరు. అట్లే స్వాతి ప్రాంత దేవత అయిన 'హనుమంతుని' వ్రతము స్వాతి నక్షత్రమున సూర్యునికన్న ముందు ఉదయించు కాలమున జరుగుచున్నది. అది సుమారుగా సూర్యుడు తులారాశి చివఱనుండగా అనగా విశాఖలోనుండగా జరుగును. కనుకనే సుమారుగా 'మార్గశిరశుద్ధ త్రయోదశి' "హనుమద్వ్రతము" జరుగును. నాటినుంచి సరిగా ఆఱు నెలలకు స్వాతి నక్షత్రములు సాయంకాలము తూర్పున ఉదయించును. అది వైశాఖ కృష్ణదశమి. అప్పటికి చంద్రుడు పూర్వాభాద్రకు దగ్గఱలో నుండును. కనుక ఆరోజు హనుమజ్జయంతి. అందుకే హనుమంతునిది పూర్వాభాద్ర నక్షత్రం. మఱొక అంశమేమనగా 'సాయంకాలోదయమునుబట్టి' దేవుని బాలునిగా అపుడే పుట్టినవానినిగా ''జయంతులు'', ప్రాతః కాలోదయమునుబట్టి వ్రతములు జరుగుచున్నట్లు కనబడుచున్నది.

ఇక ప్రస్తుత విషయమునకు వచ్చెదము. ఏకాదశినాడు 'బోధన' చెందిన స్వామి పూజనీయుడు. జ్యోతిస్స్వరూపుడయిన విష్ణునిరూపము రాత్రిపూట స్పష్టదర్శనీయము గనుక 'పూర్ణిమరాత్రి' మఱింత శోభాకరము గాన 'రాసలీల' కార్తికపూర్ణిమ నుంచి రాత్రిపూట దృశ్యమగు "నక్షత్రమయ మహావిష్ణు దృశ్యముగా" భావింపవచ్చును.

మహాభాగవతమునందు (ఇది దేవీభాగవతముగాని శ్రీమద్భాగవతము గాని గాదు. వేఱే గ్రంథము) ఈ రాసలీలలు పూర్ణిమనుంచి మొదలయినట్లే స్పష్టముగా నున్నది. చూ॥

**"ఏవం బహుదినం రాత్రౌ గోపీభి స్సహ కాననే**
**చకార రాసక్రీడాంవై పూర్ణా మారభ్యకార్తికీం" 85**

**ఖగోళములో గోలోకము :**

విష్ణు నక్షత్ర సముదాయమునకు గోలోకమునకు సంబంధము చెప్పవలె గదా. మఱి గోలోకము ఏది? స్వాతిశ్రవణముల మధ్య ధ్రువునిపైన విష్ణు నక్షత్రములు గలవు. చూ॥ విష్ణుపురాణము.

**"ఊర్ధ్వోత్తరాం ఋషిభ్యస్తు ధ్రువో యత్రాస్తి వైస్మృతః 86**
**ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్వరమ్"**

విష్ణుపురాణమునందు ఆకాశమునందలి నక్షత్రరాశులు మూడుమార్గములు గాను ఒక్కొక్క మార్గము మూడు వీధులుగాను విభజింపబడినది.

**1) ఉత్తరమార్గము :**

అశ్వని భరణి కృత్తిక - నాగవీధి
రోహిణి మృగశిర ఆర్ద్ర - గజవీధి
పునర్వసు పుష్యమి ఆశ్రేష - ఐరావత వీధి

**2) మధ్యమార్గము :**

మఖ పుబ్బ ఉత్తర - ఆర్షభవీధి
హస్త చిత్త స్వాతి - గోవీధి
విశాఖ అనూరాధ జ్యేష్ఠ - జారద్గవవీధి

**3) దక్షిణమార్గము :**

మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ - అజవీధి
శ్రవణ ధనిష్ఠ శతభిషములు - మృగవీధి
పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి - వైశ్వానరవీధి

---

85) ఈ విధంగా కార్తికపూర్ణిమ మొదలుకొని కృష్ణుడు బృందావనములో గోపికలతోసహా రాత్రిళ్లు రాసక్రీడ కొనసాగించెను.

86) సప్తర్షి నక్షత్రాలకు ఊర్ధ్వంగా ఉత్తరాన ధ్రువుడున్న చోటుకు దగ్గరగా ప్రకాశవంతంగా తృతీయమయిన విష్ణుస్థానము ఆకాశమున మెఱయుచుండును.

మత్స్యపురాణమునందు మాత్రము మధ్యమ మార్గములో గోవీధిని 'అజవీధి' అని జారద్గవ వీధిని మృగవీధియని, దక్షిణ మార్గములో అజవీధిని వైశ్వానరవీధియని, మృగవీధిని జారద్గవ వీధియని, వైశ్వానరవీధిని 'గోవీధి' యని ప్రస్తావించిరి. మొత్తంమీద మధ్యమ దక్షిణ మార్గములలో "గోవీధి ఆర్షభవీధి జారద్గవవీధి" అనేవి మతభేద ప్రకారము కనబడుచున్నవి. బహుశః వేదములో –

**"తా వాం వాస్తూన్యుశ్మసి గమద్ధ్యై**
**యత్ర గావో భూరిశృంగా అయాసః"** అన్న

'గోవులు' ఇవి కావచ్చును. ఇదే "ఉత్తర దక్షిణ గోగ్రహణము" లోని గోవులు అని నక్షత్రవేత్తల అభిప్రాయము. కనుక ఇది గోలోకము / గోకులము.

ఇందు జారద్గవ వీధిలోని 'విశాఖ'కు 'రాధ' అని పేరు. ఈ విశాఖ ఐదు చుక్కలు అని వరరుచి. కాని యిందలి సూక్ష్మతేజోవంతమయిన రెండు చుక్కలకు ప్రాధాన్యము. అందువలన సాహిత్యములో "విశాఖే" అని రెండుగా వ్యవహరింపబడుచున్నవి.

**"నక్షత్రాణా మధిపత్నీ విశాఖే" – (వేదం) 86ఎ**
**"యది విశాఖే శశాంకలేఖా మనువర్తేతే"** – కాళిదాసు. **86బి**

ఈ విశాఖకు "రాధా" అనిపేరు.

**"రాధా విశాఖే"** అని వేదము రాధను అనుసరించిన నక్షత్రము కనుకనే విశాఖ తరువాత నక్షత్రము "అనూరాధ" అయినది. కనుకనే వైశాఖ మాసమునకు "రాధామాసము" రాధామాధవమాసము అనిపేరు. సూర్యాస్తమయము తర్వాత విశాఖా (రాధా) నక్షత్రము ఆకాశములో కనబడును. విశాఖా నక్షత్ర సమేతుడయిన విష్ణువు (విష్ణు నక్షత్రములు) రాత్రియంతయు ఆకాశమున మెఱయుచుండును.

---

86ఎ) నక్షత్రములకు నాయికలయిన విశాఖలు
86బి) విశాఖలు చంద్రుని అనుసరించినట్లు

తరువాత ఆఱు నెలలకు కార్తికమాసములో సూర్యోదయానికి కాస్తముందు ఇదే నక్షత్రము తూర్పున ఉదయించును. అందువలననే కార్తిక మాసములో రాధాసమేత దామోదరుని పూజ జరుగును. విశాఖా నక్షత్రము రెండు అగుట వలన అందుకు సంకేతముగా "రాధాకృష్ణులు ఇద్దఱు ద్విభుజ కృష్ణుడు" అను "ద్వైతము" కల్గినది.

అంతేగాక కృష్ణుని జన్మరాశి వృషభము, రోహిణీ నక్షత్రము. అచ్చట నుంచి "విశాఖ" సప్తమరాశిలో నున్నది. కనుక రాధకృష్ణుని భార్య. రాధకు "వృషభానుజా" అని పేరు "వృషభానువు" అనువాని పుత్రిక. 'వృష-భాను' వృషభములో సూర్యుడు ఉండగా సాయంకాలమున ఉదయించినది అని కావచ్చును. కనుక, ఈ విధముగా-

1) విష్ణు నక్షత్రములు వెలుగొందు కార్తికపూర్ణిమ రాత్రులు ఈ రాసలీలలు.

2) విశాఖా నక్షత్రగత రాధాకృష్ణ తత్వమునకు సంబంధించిన మాసము కనుక ఆ మాసములో 'పూర్ణిమ' నుంచి రాసలీలలు.

3) కృష్ణ జన్మరాశి అయిన "వృషభము, రోహిణి" ఆకాశమున సంపూర్ణ విజృంభణతో నక్షత్ర మధ్యమున నుండుటయే, అందు చంద్రుడు ప్రకాశించుటయే 'రాసలీల' అనగా సోముడు కృష్ణుడుగా భావన-

**"ఏకం సద్విప్రాబహుధా వదంతి" అన్నట్లు. 87**

కనుక కార్తికపౌర్ణమి నాటికి విష్ణు నక్షత్రములు, విశాఖనక్షత్రములు, రోహిణీ వృషభములు అన్నియును కలిసి వచ్చుటచే ఖగోళమునందు 'రాసలీల' జరుగుచున్నట్లుగా భావింపవలెను.

**"కృష్ణాష్టమి" విషయము - ఒక ఊహ :**

స్వాతినుంచి శ్రవణందాకా విష్ణు నక్షత్రములు. స్వాతిప్రాంతమున తూర్పుగా 'శేషఫణములు' ఇవి నాగులచవితినాడు సూర్యోదయాత్పూర్వము

87) ఉన్నది ఒకటే సత్ అనగా సత్యం. దానిని వేదవేత్తలు బహురూపాలుగా చెప్పెదరు.

మనకు అగుపించును. అందువలన ఆరోజు "నాగపూజ". కృష్ణాష్టమి నాటికి సూర్యుడు కటకములో నుండును. కనుక సుమారుగా సాయంకాల సమయమున మకరము. అర్ధరాత్రికి వృషభము ఉదయించును. సహజముగా ఆనాటికి చంద్రుడు 'వృషభరాశి'లో నుండును. అదియును 'రోహిణి' కావలసి యుండును. అందువలననే కృష్ణుని నక్షత్రము 'రోహిణి'. మకర ప్రాంతముదాకా విస్తరించిన విష్ణునక్షత్రములు ఆరాత్రికి ఆకాశమున కొంతవేఱకు కనబడును. చంద్రోదయ మగునప్పటికి అనగా అర్ధరాత్రమునకు మకరం తలమీదకు వచ్చును. అప్పటికి పడమర వైపుకు "తుల" వాలియుండును. ఈ సందర్భమున శేషఫణములు, విష్ణువు, రాధాకృష్ణ నక్షత్రములు, ఖగోళమున దర్శనమిచ్చును. ఈ దృశ్యమునే మహర్షి భగవంతుని అవతారము జరిగినట్లు, శేషఫణములు ఆయనపై పట్టినట్లు నల్లని ఆకాశము యమునానది అయినట్లు – ఇలా వర్ణించి యుండును. హరి యోగమాయతో అవతరించుట అనగా 'చాతుర్మాస్య'లలో యోగనిద్ర గలిగియుండుట కావచ్చును. చూ॥

**"స్వమాయయా పవిత్రాంగ్యా నిద్రయావర్థతే ప్రభుః"**

**– శేషధర్మములు**

రాముని జన్మలగ్నము జన్మరాశి– కర్కాటకమయినట్లు కృష్ణుని జన్మలగ్నము జన్మరాశి వృషభము కావలెను. వృషభము "ఓంకార స్వరూపుడు, తల్లిగా రోహిణి" – సరిపోయినవి. చంద్రోదయ కాలము కృష్ణ జన్మమునందు అర్ధరాత్రికి వచ్చును. చూ॥

**"నిశీథే తమఉద్భూతే జాయమానే జనార్దనే**
**దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణు స్సర్వగుహాశయః**
**ఆవిరాసీద్యథాప్రాచ్యాం దిశీందురివపుష్కలః" – భాగవతము 88**

ఇదే శ్రీరామ జన్మకాలమునకు చైత్రమాసమున నవమికి కర్కాటకలగ్నము మధ్యాహ్నమునకు వచ్చును. చంద్రుడు కర్కాటకములోనే

88) అర్ధరాత్రి బాగా చీకటిలో కృష్ణుడు అవతరించబోవు చుండగా సర్వహృదయ గుహాస్థితుడైన విష్ణువు తూర్పున పూర్ణచంద్రుడుదయించినట్లు దేవకియందు ఆవిర్భవించెను.

యుండును. అనగా ప్రస్తుత దినమున చంద్రోదయకాల లగ్నములే అవతారపురుషుల ఉదయకాల లగ్నములని భావింపవలసి యుండును. ఖగోళమునకు అనుగుణముగా "ప్రకృతి" గూడా రాసలీలలకు సమానశోభతో అలరారుచుండును. ఇది భగవంతుని 'విరాట్ స్వరూపమున'కు చేసిన సమన్వయముగా భావింపవచ్చును.

వర్షప్రభావముతో పుష్పపల్లవ భరితమయిన శారద సృష్టి శోభయే ఆయన వనమాల, వనమాల ధరించిన స్వామిని 'దామోదరుడు' అందురు. కార్తీకమాసమున స్వామిని 'రాధాసమేత దామోదరస్వామి' అనియే అందురు. రాసలీలలో కృష్ణుడు ఎల్లప్పుడు "వనమాల" ధరించినట్లే వర్ణింపబడును.

''స్రగ్వీ'' (మాలధారి) అని చాలసార్లు చెప్పబడెను. ప్రశాంత శుద్ధాకాశము, నిర్మల చంద్రుడు, నక్షత్రములు చుట్టూ రంగురంగుల ప్రకృతి. అందున గుంద్రని బృందావనము. ఇదియంతయు విరాట్పురుషుని శరన్మనోహర కమనీయత.

**"ధగధగద్ధగలాడు తారకల్గుచ్చిన**
**ధవళాంబరంబు రత్నాలగొడుగు**
**మలయాద్రితటినుండి మెలమెల్లగావీచు**
**చల్లనిగాలి వింజామరంబు**
**ఫలపుష్పపల్లవ పరిశోభితరులతా**
**హల్లీసకంబు నృత్యార్పణమ్ము**
**కువకువ ధ్వనిజేయు కవిరాజహంసల**
**నందడి రమణీయ బృందగీతి" 89**

89) ధగధగలాడు నక్షత్రాలనే ముత్యాలుగ్రుచ్చిన తెల్లగొడుగులాగా రత్నాలగొడుగులాగా ఆకాశం ప్రకాశిస్తున్నది. మలయ పర్వతము నుండి మెల్లగావచ్చే చల్లని దక్షిణపుగాలి వింజామరలాగా ఉన్నది. ఫలపుష్పాలు చిగురాకులతో మనోహరంగా ఊగుతున్న చెట్లు చేమలు హల్లీసకమనే నృత్యము చేస్తున్నట్లున్నవి. కువ కువలాడు కవులు, రాజహంసల సందడి రమణీయ మయిన బృందగీతంలాగా ఉన్నది. ఇలా ప్రకృతి అంతా పరవశంతో పులకించి ఆ అఖిలాంతర్యామి అయిన ప్రపంచ సింహాసనాధిపతికి సేవచేస్తున్నట్లుగా నున్నది.

**"ప్రకతి యంతయు పులకించి పరవశించి**
**అఖిల జగదంతరాంతర వ్యాపియైన**
**అవిదితాగమ్య రమ్యసింహాసనస్థు**
**డైన సర్వేశు సేవించు ననుదినమ్ము"**

**- నా రచన "సదసత్సంశయము" నుండి**

ఇట్టి యీ ఖగోళ దృశ్యమే భూలోక దృశ్యముగా సృష్టి అయినది. అదే పిండాండగత దృశ్యముగా అనుభవైకవేద్యము.

'As above so below'
'The drama of the earth runs parallel to the
drama of the sky' - Carpenter. **90**

కనుక బ్రహ్మాండములోనిది పిండాండమునందును ఆకాశములోనిది భూమిమీదను జరుగునని తోచుచున్నది.

మాస్టర్ ఇ.కె. తమ 'రాసలీల'లో ఈ విషయమును ఇట్లు వ్యాఖ్యానించినారు.

**"ఒక చెంతన్ కలవేణునాద పులకవ్యూహాంచితోంకారమై**
**సకలంబున్ ఘనరాసలీలయగుచున్ సాగంగ గోలోక, మం**
**దొకవంకన్ వ్రజలోకమందు భువనవ్యూహంబులొప్పారగా**
**ఒకవ్రేపల్లెయు భర్తలున్ సుతులు గోవ్యూహంబులే పారెడిన్" 91**

---

90) ఆకాశంలో ఎలాగో భూమిమీదను అదేకదా! నేలమీద నడిచే నాటకం అంతా ఆకాశంలో నడిచే నాటకానికి సమాంతరము.

91) ఒకవైపు (దేహంలో) మధుర వేణునాదాలతో చిగుళ్లువేస్తున్న ఓంకారమే నిండి రాసలీలా వైభవం కొనసాగుతున్నది. ఇది గోలోకము అనగా వాగ్లోకము. మఱొకవంక వ్రజలోకంలో (బృందావనం) ప్రపంచ వ్యూహములు ఏర్పడడం మొదలయినది. అందులో భాగంగా ఒక గొల్లపల్లె భార్యలు, కుమారులు గోవులు ఏర్పడుతున్నాయి. అంటే శబ్ద సృష్టి దాని వెంట అర్థసృష్టి సమాంతరంగా జరుగుతున్నాయి.

# సప్తమ పింఛము

## "కృష్ణతత్త్వము"

**"అవతారాః సంత్వన్యే**
**సరసిజనయనస్య సర్వతోభద్రాః**
**కృష్ణాదన్యః కోవా**
**ప్రభవతి గో గోప గోపికా ముక్త్యై"** **91ఎ**

ఈ పద్యమును మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు (చందోలు) రోజూ తెల్లవారుజామున వారి ప్రాణాయామానంతర ప్రార్థనలో చదువుచుండెడివారు.

చందోలులో మా గురువుగారింటికి శృంగేరీ పీఠాధిపతులు వచ్చినపుడు వారు "ప్రస్తుతము ఏ ఉపాసన చేయుచున్నావు?" అని మా గురువుగారిని అడిగిరి. అపుడు వారు ఈ విధముగా చెప్పిరి–

**"శక్తౌ తురీయం శివదక్షిణాంగం**
**నాభౌ విరించిం హృదయేన లక్ష్మీం**
**అంతర్బహిర్విశ్వ మదోంతరే మాం**
**బిభ్రాణ మభ్రాయిత 'మో' మితీమః"** **92**

అని 'శైవ' శక్తిస్వరూపుడైన మహావిష్ణువును ప్రణవమయముగా ఉపాసన చేయుచున్నారట.

అట్టి కృష్ణతత్త్వమునుగూర్చి మనము ఈ భాగమున ముచ్చటించి కొందము. ముందు ఉపనిషత్తులనుబట్టి 'కృష్ణతత్త్వము' తెలిసికొనెదము.

---

91ఎ) సర్వమంగళకరములయిన వైష్ణవావతారాలు చాలా ఉండవచ్చును. కాని కృష్ణావతారంలాగా పామరులయిన గోగోప గోపికలకు మోక్షమును అనుగ్రహించినదెవరు?
92) శక్తులలో నాల్గవది, శివునికి దక్షిణ భాగమయినది, నాభియందు విరించిని, హృదయమున లక్ష్మిని, లోనబయట ప్రపంచమును, మధ్యలో నన్ను ధరించి ఉన్న ఆకాశ స్వరూపుడయిన బ్రహ్మమును 'ఓం' కార రూపముగా పొందుచున్నాము.

## 1. కృష్ణోపనిషత్తు :

రామావతారమునందు చిత్రకూటదండకారణ్యము లందలి మునులు 'రాముని' శరీరస్పర్శ కోరిరి. అపుడు రాముడు కృష్ణావతారమున మీకోరిక తీర్చెదను అనెను. ఆ ప్రకారము మునులు గోపికలుగా జన్మించిరి.

**"భవాంతరే కృష్ణావతారే యూయం గోపికా భూత్వా** [93]
**మామాలింగధ"** - కృష్ణోపనిషత్తు

ఆ విధముగా-

**"గోప్యో గావ ఋచః తస్య యష్టికా కమలాసనః**
**వంశస్తు భగవాన్రుద్రః శృంగ మింద్ర స్సగోసురః**
**గోకులంవనవైకుంఠం తాపసాస్తత్రతే ద్రుమాః**
**లోభక్రోధాదయో దైత్యాః కలికాల స్తిరస్కృతః**
**శేషనాగో భవేద్రామః కృష్ణోబ్రహ్మైవ శాశ్వతమ్**
**అష్టావష్టసహస్రేద్వే శతాధిక్యః స్త్రియ స్తధా**
**ఋచోపనిషద స్తావై బ్రహ్మరూపా ఋచః స్త్రియః" - కృష్ణోపనిషత్తు.**

అనగా ఆయన పరివారము గో గోప గోపికలు ఋగ్వేదాది వేదములు, ఉపనిషత్తులు. కృష్ణుని భార్యలు 16108 మందిగూడా ఋక్కులు ఉపనిషత్తులే. గోకులము = వైకుంఠము, చెట్లు= తాపసులు, బలరాముడు=ఆదిశేషుడు, కృష్ణుడు= శాశ్వత బ్రహ్మపదార్థమే.

కృష్ణుని ఎదిరించినదైత్యులు =కామక్రోధాదులు, ద్వేషము=చాణూరుడు మత్సరము= ముష్టికాసురుడు, దర్పము= ఏనుగు, గర్వము= బకాసురుడు, వ్యాధి= అఘాసురుడు, కలి= కంసుడు, అదే కాలనేమి. అనగా కాలము అనే చక్రమునకు అంచువంటివాడు. యుగచక్రమునకు 'కలి' ఆఖరివాడు గనుక వాడే కాలనేమి. చూ ॥

---

93) మఱుజన్మలో కృష్ణావతారంలో మీరంతా గోపికలై నన్ను కౌగిలించికొనండి.

**ద్వేషః చాణూరమల్లోయం మత్సరో ముష్టికో జయః**
**దర్పః కువలయాపీడో గర్వో రక్షః ఖగో బకః**
**అఘాసురో మహావ్యాధిః కలిః కంసస్సభూపతిః - కృష్ణోపనిషత్తు 94**

అట్లే సుదాముడు= శమము, సత్యము= అక్రూరుడు, దమము= ఉద్ధవుడు, క్షీరసముద్రము=పాలకుండ, కశ్యపుడు=రోలు, త్రాడు= అదితి, గరుడుడు= వటవృక్షము, సుదాముడు (కుచేలుడు?)= నారదుడు, భక్తి= బృందాదేవి అనియు చెప్పబడెను. దీనినిబట్టి బృందావనము భక్తివనము అని భావింపవచ్చును. ఇక ఆయుధములు ఆభరణములుగూడా ఇట్లే చెప్పబడినవి.

**చక్రము :**

ఇది 'సిద్ధి' అని, 'మనస్సు' అని తేజస్తత్వము అని చెప్పబడినది. చూ॥

**"చక్రం శంఖం చ సంసిద్ధిం బిందుంచ సర్వమూర్ధని" - కృష్ణోపనిషత్తు.**
**"చలస్వరూప మత్యంతం మన శ్చక్రం నిగద్యతే" - గోపాలోత్తరతాపిని.**
**"తేజస్తత్వం సుదర్శనం" - భాగవతం 12 స్కం - 11వ అధ్యాయము**

**శంఖము :**

ఇది 'బిందువు' పంచభూతాత్మకమయిన వస్తువు జలతత్వము అని చెప్పిరి. చూ॥

**"చక్రం శంఖం చ సంసిద్ధిం బిందు చ సర్వమూర్ధని" - కృష్ణోపనిషత్తు.**
**"పంచభూతాత్మకం శంఖం కరే రజసి సంస్థితమ్" - గోపాలోత్తరతాపిని.**
**"అపాంతత్వం దరవరం" - భాగ.12వ స్కం. 11వ అధ్యాయము.**

దరము = శంఖము.

**గదాయుధము :**

'కాలికా' అని 'విద్యాశక్తి' అని ముఖ్య ప్రాణతత్వము అని చెప్పుచున్నారు. 'కాలి' శత్రునిర్మూలనము చేయును. విద్యాశక్తిగూడా ఆరు అంతశ్శత్రువులను

94) ద్వేషము చాణూరుడు. మత్సరము ముష్టికుడు. దర్పము కువలయాపీడమను ఏనుగు. గర్వము బకుడనే రాక్షసుడు. మహావ్యాధి, అఘాసురుడు. కంసుడు కలి.

నిర్మూలించును. ఆ నిర్మూలనము 'ప్రణవము'తో జరుగును. ఈ సంగతి పూర్వము ఉదాహరించిన ఛాందోగ్య బృహదారణ్యక భాగములలో స్పష్టముగా నున్నది. ప్రణవము 'ప్రాణ' స్పందనమే. ముఖ్యప్రాణము 'హనుమంతుడ'ని మధ్వమతము. భగవంతుని 'గద' ముఖ్యప్రాణము. కనుకనే 'గదపిడి'వలె హనుమంతుని తోక కనబడుచున్నది. పైగా హనుమంతుడు గదాపాణి అని ప్రసిద్ధము. శత్రు నిర్మూలనకు ఆయన ప్రసిద్ధుడే.

**"హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః" -సుందరకాండ**
**"ముఖ్యః ప్రాణః ప్రాణోవై ముఖ్యః" - శ్రుతి.**

వాయుజన్యము = నాదము= అగ్ని; అట్లే ప్రాణజన్యము ప్రణవము అగ్ని "ప్రణవము తీవ్ర జపానంతరము వెలుగుగా మారును." దానిని 'మంత్రశిఖ' అందురు. అది ఆంజనేయ వాలాయుధమును, దీప్తవాలమును పోలుచున్నది. కనుక ఆంజనేయుడు ప్రణవము. అగ్ని= వాయుపుత్రుడు కాగలరు. ఇక గద గురించి ప్రమాణములు.

**"గదా చ కాలికా సాక్షాత్ సర్వశత్రునిబర్హిణీ" - కృష్ణోపనిషత్తు.**
**"ఆద్యా విద్యా గదా వేద్యా సర్వదా మే కరేస్థితా" - గోపాలోత్తరతాపిని.**
**"ఓజస్సహోబలయుతం ముఖ్యతత్వం గదాం ధరన్"**
**- భాగ.12వ స్కం. 11వ అధ్యా.**

ఓజస్సు, సహనం, బలము గల ప్రాణతత్వము "గద". బుద్ధిబలయశో ధైర్యాదులు గల ముఖ్య ప్రాణతత్వము హనుమంతుడు. ఈ పోలిక యాదృచ్ఛికము గాదు.

**శార్ఙ్గము :**

భగవంతుని "మాయ"యే శార్ఙ్గము, కాలమని కొన్ని పురాణములు చెప్పుచున్నవి.

**'ధనుః శార్ఙ్గం స్వమాయాం చ' - కృష్ణోపనిషత్తు.**
**"ఆద్యా మాయా భవేత్ శార్ఙ్గం" - గోపాలోత్తరతాపిని.**

**'కాలరూపం ధను శ్శార్జ్గం తథా కర్మమయేషుధిం"**

**- భాగ. 12వ స్కం. 11వ అధ్యా.**

కాలముగూడా భగవంతుని మాయయే. అది కర్మఫల కారణముగా సృష్టికి హేతువు అగును. కనుక కర్మలు బాణాలు అయితే వాటిని సంధించి ఫలరూపముగా మనపైకి కాలము విడుచును. కనుక ధనుస్సు 'కాలాత్మక మాయ' అనవచ్చును. అమ్ములపొది కర్మలు.

**పద్మము :**

విశ్వమే పద్మమని సత్వము పద్మమనియు చెప్పబడినది.

**"అబ్జకాండం జగద్బీజం ధృతం పాణౌ స్వలీలయా"** **95**

**- కృష్ణోపనిషత్తు.**

**"పద్మం విశ్వం కరేస్థితం" - గోపాలోత్తరతాపినీ.**

**"ధర్మజ్ఞానాదిభి ర్యుక్తం సత్త్వం పద్మమిహోచ్యతే"** **96**

శరీరమునందు ఆయా లోకస్థానములందు "పద్మము"లు గలవు. పద్మమునకు వికాస సంకోచములున్నట్లు లోకములకు సృష్టి స్థితిప్రళయములు గలవు. ఇందు సృష్టి=రజోగుణము; ప్రళయం=తమోగుణం; విశ్వస్థితిదశ= సత్వగుణము. కనుక సత్వము విశ్వమునకు అందును స్థితిదశకు ప్రతీకము. సత్+త్వము అనగా ఉనికి. విష్ణువు స్థితిదశకు అధినాథుడు కనుక ఆయన చేతియందలి పద్మము "సత్త్వము-విశ్వము" అగుటలో అసంగతిలేదు.

ఇదిగాక - భగవంతుని కంఠము ఆయన నిర్గుణ స్థితికి నిదర్శనము. అది గుండ్రముగా ఉండుట దాని నిర్వికారత్వమునకు అనంతత్వమునకు గుర్తు. ఆ కంఠముచుట్టు వేసియున్న వనమాల పంచభూతమయ ప్రకృతికి గుర్తు. పైగా కంఠము ఆకాశమునకుగూడ గుర్తుగావచ్చును. ఇంచుమించు నిర్గుణము గనుక. అందుకనే "ఖంబ్రహ్మ" అని బ్రహ్మకు ఆకాశముతో సామ్యము అట్టి ఆకాశములో వెల్లివిరిసిన పంచభూతమయ సప్తవర్ణమయ

---

95) కృష్ణుని చేతికమలము ప్రపంచ బీజమయిన పదార్థము.

96) చేతిలోని కమలము విశ్వమే. ధర్మజ్ఞానాదులతో గూడిన సత్వమే పద్మము.

ప్రకృతిని ''వనమాల''గా చెప్పవచ్చును. వనము ఉత్పత్తికి సస్యశ్యామలత్వమునకు గుర్తు. చూ॥

**"కంఠం తు నిర్గుణం ప్రోక్తం మాల్యతే ఆద్యయా జయా"**
**- గోపాలోత్తరతాపినీ**

**"స్వాం మాయాం వనమాలాఖ్యాం నానాగుణమయీం దధత్"**
**- భాగవతం 12వ స్కం. 11వ అధ్యా.**

ఈ వనమాల రాసలీలలో కృష్ణుని మెడలోనున్నట్లు చాలసార్లు వర్ణింపబడినది.

శ్రీచక్రమందలి బిందు త్రికోణములకు ఈ కంఠ మాలికలకు పోలిక గలదు. కంఠము బిందువువలె వృత్తము. దానిచుట్టు ఉన్న వనమాల కంఠము వద్ద రెండు కోణములుగాను క్రిందకు ఒక కోణముగా వ్రేలాడును. కనుక 'వనమాల' త్రికోణముతో పోలుచున్నది. అదియును అధోముఖ త్రికోణము. అధోముఖమయిన త్రికోణములు శక్తికోణములు. వనమాల ప్రకృతికి సూచిక. ప్రకృతి సృష్టికళ. అధోముఖత సృష్టిని సూచించును. కనుక కృష్ణుడు బిందు త్రికోణ సంయోగమును, సృష్టి కామస్థితిని సూచించుచున్నాడు.

ఇంకను భాగవతము 12వ స్కంధములో 11వ అధ్యాయమునందు విష్ణురూప రహస్యములు చెప్పబడినవి. సారాంశముగా-

| | | |
|---|---|---|
| 1) కౌస్తుభము | = | ఆత్మజ్యోతి |
| 2) శిరస్సు | = | ఆకాశం |
| 3) పాదములు | = | భూమి |
| 4) నాభి | = | అంతరిక్షం |
| 5) కళ్ళు | = | సూర్యచంద్రులు |
| 6) మకరకుండలాలు | = | సాంఖ్య, యోగములు |
| 7) యజ్ఞోపవీతము | = | ప్రణవము |
| 8) కత్తి | = | ఆకాశతత్వము |
| 9) చర్మ (డాలు) | = | తమోగుణము |

10) చామరములు = ధర్మము, కీర్తి

11) ద్వారపాలకులు = అణిమాదిగుణములు.

కృష్ణుడు "విష్ణువు"గా ఆలోచింపబడినచో పైరూప రహస్యములన్నియు కృష్ణునికి కూడా అన్వయించును. విష్ణువునకన్న అతీతుడయిన కృష్ణతత్వము గుఱించి చెప్పువారయినను ఈ అంతరార్థములనే చెప్పవలెను. కనుకనే 'కృష్ణోపనిషత్తు, గోపాలోత్తరతాపిని' మొదలగునవి అట్లే సమన్వయము చేయవలయును.

పైగా ఆ మతములో ఈ విష్ణువుగూడా కృష్ణుని అంశయే.

**"తత్కలాకోటి కోట్యంశా, బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" - పద్మపురాణం**

అంతేగాక ఈ 'సూర్యగోళము'లన్నియు కృష్ణకిరణములనుంచి యుద్భవించినట్లు చెప్పబడినది.

**"తత్ప్రకాశస్య కోట్యంశ రశ్మయో రవివిగ్రహాః**
**తస్య స్వదేహకిరణైః పరానందరసావృతైః**
**తదంశకోటికోట్యంశాః జీవంతి కిరణాత్మకాః" 97**
**- పద్మపురాణం**

ఈ జీవులందఱు కృష్ణకిరణ స్వరూపులనియును పద్మపురాణము చెప్పుచున్నది.

**"గుణాత్మతాత్మని యథా జీవా స్తత్కిరణాంగకాః" - పద్మపురాణం**

పద్మపురాణమునందే మఱొకచోట

**"భుజద్వయవృతః కృష్ణో న కదాచిత్ చతుర్భుజః"**

అని కృష్ణుడు 'ద్విభుజు'డని చెప్పబడినది. చతుర్భుజుడు కాదని తేల్చి చెప్పబడినది.

కృష్ణుడు 'మహావిష్ణువు'నకు మూలకారణమని

---

97) ఆకృష్ణ ప్రకాశంయొక్క కోటి భాగమయిన కిరణాలు అనంతకోటి సూర్యబింబాలు. పరమానంద రసభరితమయిన కృష్ణదేహకిరణాలతో కిరణలేశ స్వరూపులయిన యీ జీవులు జీవించుచున్నారు.

**"కేచిద్వదంతి యస్యాంశం బ్రహ్మచిద్రూప మవ్యయం**
**తదంశాంశం మహావిష్ణుం ప్రవదంతి మనీషిణః" 98**

అని పద్మపురాణమున చెప్పబడినది.

ఇక దేవీపారమ్యవాదుల పక్షమున 'కృష్ణుని' మూలతత్వము పరామర్శింపవలయును.

## దేవీతత్వము – కృష్ణుడు :

**మహాభాగవతము :** (ఇది కృష్ణభాగవతం కాదు. దేవీభాగవతంకాదు. వేఱే పురాణం)

దీనిలో బ్రహ్మ తపముచేయగా ప్రత్యక్షమయిన 'శ్రీదేవి' చెప్పిన సమాధానము – భూభారహరణార్థము తాను కృష్ణుడుగా అవతరింతునని చెప్పెను.

**"నాహం యోత్స్యామి సంగ్రామే స్త్రీరూపా క్షత్రియర్షభైః**
**యతస్తే స్త్రీస్వరూపేణ మాం భక్త్యాసముపాశ్రితాః"**

అనగా నన్ను ప్రస్తుత భూభార కారణమయిన రాజులు స్త్రీరూపము ఉపాసించినారు. కాన వారిని నేను ఈ రూపమున చంపను.

**"కింతుమే భద్రకాళీ యా మూర్తిః సవఘన ద్యుతిః**
**వసుదేవగృహే బ్రహ్మన్ పుంరూపేణ భవిష్యతి**
**దేవ క్యాం ద్విభుజః సౌమ్యో వనమాలావిరాజితః**
**భవిష్యతి మహామాయో దుష్టక్షత్రియమర్దనః" 99**

అనగా, నా "భద్రకాళి" శరీరము "కృష్ణుడు"గా అవతరించి భూభారమును నిర్మూలించును. ఈకృష్ణుడు ద్విభుజుడు వనమాల ధరించినవాడుగా నుండును.

---

98) చిద్రూపమయిన శాశ్వతమయిన బ్రహ్మముగూడా కృష్ణాంశ అని కొందరు చెప్పెదరు. ఆయన అంశలోని అంశగా విష్ణువును కొందరు చెప్పెదరు.

99) మేఘ సమానంగా నీలంగా ఉన్న నా భద్రకాళీ స్వరూపము వసుదేవ గృహంలో పురుష రూపంతో జన్మించును. దేవకి బిడ్డయై, ద్విభుజుడై వనమాలాధారియై, మాయా సహితుడై దుష్టరాజులను మర్దించగలడు.

**"స దక్ష ఏవ నందస్తు యశోదాపి తదంగనా"**

యోగమాయ గౌరీ అవతారము కనుక తండ్రి నందుడు = దక్షుడు యశోద= ప్రసూతి. ఇందుకు కారణము ఏమనగా సతీ ఆత్మాహుతి వృత్తాంతమునకు పశ్చాత్తాపపడిన దక్షుడు తనకు మఱల పుట్టమని దేవిని తపస్సుచేసి అర్థింపగా ఈ 'కృష్ణరూపము' పెంపుడు బిడ్డగా అనుగ్రహించినది. యోగమాయ పుట్టి దక్కలేదు.

దేవకీవసుదేవులు అదితికశ్యపులు. గోపికలందఱు 'భైరవాంశ' నుండి పుట్టిరి.

**"అన్యైశ్చగోపికాబృందైః భైరవాంశసముద్భవైః"**

గోపికలందఱు స్వామికి-సమర్పించుటకు

**"వివిధైః వన్యపుష్పైశ్చ మాలాం నిర్మాయ గోపికాః**
**కృష్ణాంగే సంప్రదాయాతిహృష్టాః కృష్ణం వ్యలోకయన్"** 100

అని 'వనమాల' తయారుచేసి వేసినట్లు చెప్పబడినది. రాత్రులందు ఆయన గోపికల మనస్సులను ఆకర్షించి రాసలీలలు చేసెను. చూ॥

**"రాత్రౌసంహృత్య చేతాంసి గోపీనాం వేణునిస్స్వనైః**
**ఆనీయ కాననే తత్ర రేమే కృష్ణః సకౌతుకమ్"**

ఇందులో మనస్సులను ఆకర్షించి ఆ మనస్సులతో రమించినట్లుగూడా అంతరార్థము వచ్చును.

తంత్రరాజము నందుగూడా ఇట్లే చెప్పబడినది.

లలితాసహస్ర నామములలో దేవికి ముకుందా, విష్ణురూపా అను నామములు గలవు. దానికి వ్యాఖ్యానముగా-

**"కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా**
**స్వవంశవాదనారంభాత్ అకరోద్వివశం జగత్**
**తతస్సగోపీసంజ్ఞాభిః ఆవృతోభూత్ స్వశక్తిభిః"**

---

100) రకరకాల అడవిపూలు మాలగాకట్టి గోపికలు కృష్ణ శరీరమునందు అలంకరించి ఎంతో సంతోషముతో కృష్ణునే తిలకించిరి.

అనగా లలితాదేవి కృష్ణవిగ్రహముదాల్చి వేణునాదముతో తనశక్తులను ఆకర్షించెను. దీనినిబట్టి "గోపికలు అనంగమోహిని" మొదలగు నవావరణ శక్తులు అనుమాట చెల్లినది.

లలితోపాఖ్యానములో–

**"మమైవ పౌరుషం రూపం గోపికాజనమోహనమ్"** అని గలదు. **101**

**కూర్మపురాణములో :**

**"సహస్రమూర్ధాన మనంతశక్తిం సహస్రబాహుం పురుషం పురాణం శయానమబ్ధౌ లలితే తవైవ నారాయణాఖ్యం ప్రణతోస్మి రూపమ్" 102**

అని 'విష్ణువు' గూడా లలితాంశగా చెప్పబడినది.

**"యత్కించిన్నాదరూపేణ శ్రూయతే శక్తి రేవ సా**
**యస్తత్వాంతో నిరాకారః స ఏవ పరమేశ్వరః" 103**

అనగా నాదము వినబడుచున్నంత వఱకు 'శక్తి'కి అది లక్షణము. దేవి 'నాదమయి'. కృష్ణుడు వేణునాద స్వరూపుడు. కనుక కృష్ణుడు 'శక్తి'కి రూపాంతరము.

పద్మపురాణములో–

**"అహం చ లలితాదేవీ పుంరూపా కృష్ణవిగ్రహా**
**ఆవయో రంతరం నాస్తి సత్యంసత్యం హి నారద" 104**

---

101) గోపికా స్త్రీలకు మోహనమయిన కృష్ణుని రూపము నా పురుష విగ్రహమే.

102) ఓ లలితా! సహస్రశీర్షములు గలది, అనంతశక్తి మంతము, సహస్ర బాహువులు గలది. పురాణ పురుషరూపమయినది, సముద్రమున శయనించినదే అయిన నీ నారాయణ రూపమునకు నమస్కరించుచున్నాను.

103) నాదరూపంగా ఏకాస్త ఉన్నా అది 'శక్తి' యొక్క రూపమే. నాదమునకు చివర ఉన్న నిరాకారమయిన నాదాంతస్థితి ఆపరమేశ్వరుడే. ఉన్న నాదము కామకల. దీన్ని మంత్రమే అనగా నాదమును మాత్రమే ఉపాసించుట మోక్షము.

104) నారద! నేను, పురుషరూపముగా కృష్ణుడనయిన లలితను మాయిద్దరిమధ్య ఏభేదమూ లేదు.

బ్రహ్మాండపురాణములో-

**"అద్యాశక్తి ర్మహేశస్య చతుర్థా భిన్నవిగ్రహా**
**భోగే భవానీరూపా సా దుర్గారూపాచ సంగరే**
**కోపే చ కాలికారూపా పుంరూపా చ మదాత్మికా"**

అని చెప్పబడెను. అనగా శివునకు శక్తిగలదు. ఆ శక్తి ప్రయోజనమునుబట్టి నాలుగు విధములు.

1. పార్వతి= భోగశక్తి 2. దుర్గ= యుద్ధశక్తి
3. కాలిక = కోపశక్తి 4. విష్ణువు = పురుషశక్తి.

కనుకనే కామకోటి స్వామివారు – జగద్గురు బోధలలో రాముడు శక్తి అవతారమని, కనుకనే యుద్ధాదిక్రియలు అన్నియు నిర్వర్తించెనని. సీత శివుని రూపమని, ఆమె తటస్థురాలయి అశోకవనమున తూష్ణింభావముగా నున్నదని వారి రంగులుగూడా ఈ తత్వములకు సూచనలని చెప్పిరి. ఈ విషయమునే సమర్థించుచు మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు రామాయణములోని ఒక వాక్యమును వివరించెడివారు. వనవాసమున అనేక దోషములున్నవని చెప్పి రాముడు సీతను అరణ్యమునకు రావద్దు అని చెప్పెను. ఎంత బ్రతిమాలినను రాముడు అంగీకరింపలేదు. అపుడు కోపముతో అన్నట్లు సీత "నీవు మగవేషము వేసికొన్న ఆడదానివి నీకు ధైర్యములేదు" అని అనెను.

"స్త్రియం పురుష విగ్రహం" అను దీనికి అంతరార్థము రాముడు= పురుష వేషము దాల్చిన శక్తి; సీత= స్త్రీ వేషమున ఉన్న పురుషుడని "అర్థాపత్తి".

సారాంశమేమనగా ఉన్నది ఒక్కటే పదార్థము. దానిని 'ఏకంసత్–విప్రాబహుధా వదంతి' అన్నట్లు భక్తులు తమ అనుభవమునుబట్టి శివునిగా, శక్తిగా కృష్ణునిగా విష్ణునిగా కీర్తించినారు. అందు మిగిలిన దేవతలను తమతమ మూలదేవతల అంశలుగా చెప్పుచుండుట అలవాటు.

కనుక 'కృష్ణుడు' – మూలపురుషుడు,
శక్తి అవతారము,

విష్ణుని అవతారము,
శివశక్తిరూపభేదము – అని తేలినది.

'కృష్ణుడు' అను ఈ రూపభేదము ఏ తత్త్వమునకు సూచన అన్న విషయము పరిశీలింపవలయును.

## కృష్ణుడు – కామతత్త్వము :

నిశ్చల నిర్గుణ పరబ్రహ్మము సృష్టికి అభిముఖమయినపుడు "బహుస్యాం ప్రజాయేయ" అని తలచెను. కామము అనునది సృష్టివాంఛ. అది మనలో శారీరక క్రియవలన భగవంతునిలో మానసిక స్పందన వలన జరుగును. శివుని ప్రథమ పరిస్పందము శక్తి అని శైవాగమములు చెప్పుచున్నవి.

ఏకవస్తువు= ద్వి= రెండు, బహుగా మాఱుటకు ఈ వాంఛయేకారణము. ఇందు మొదటిది "ద్వి" అయిన స్థితి. సగము సృష్టికి అభిముఖమయిన స్థితి. సగము కూటస్థముగా స్థాణువుగా అచ్యుతునిగా ఉన్నస్థితి. ఇందు సృష్టికి అభిముఖమయిన స్థితి అనగా 'సృష్టికామము' గల స్థితి. కామమునకు "ఎరుపు రంగు'' చెప్పెదరు. భగవంతుని యందుగల ఈ రెండుస్థితులు రూపాంతరములు.

"శివ – శక్తి" రూపమయిన 'అర్ధనారీశ్వరతత్త్వము'. ఇందలి "నారి" సృష్టికామినియైన 'కామేశ్వరి'. వీరి చరణములు – 'రక్తశుక్ల' చరణములు. రాగరక్తి=ఎఱుపు. ఇది సృష్టి కామమునకు సంకేతము. శుక్ల= తెలుపు. ఇది సత్వస్థితికి నైర్మల్యమునకు సంకేతము. వీరే గౌరీ – శివులు. అనగా–

గౌరి= పసుపు, ఎఱుపు. శివుడు= తెలుపు.

వీరే 'ప్రకాశ విమర్శములు'. ప్రకాశమనగా శుద్ధమయిన వెలుగు. 'విమర్శ' యనగా 'నేను' అనే ఆత్మపరామర్శ. ఇది 'మమ'కారమును తద్వారా సృష్టికామమును సూచించును. కనుక ఎఱుపు రాగము గదా. ఈ తత్త్వమునే 'ఉమామహేశ్వర' తత్త్వము అందురు. ఇదే సగుణ నిర్గుణ సంకీర్ణస్థితి. అంతర్ముఖ బహిర్ముఖ స్థితి. దేవి 'శివదూతి' అయిన స్థితి ఇదేనని 'మా గురువుగారు' చెప్పిరి, మహిషాసురుడు ప్రాపంచిక భోగాలకు ప్రతినిధి.

వానివద్దకు శివుని పంపినది. అనగా 'శివుని' ప్రపంచ వ్యవహారములలోనికి దింపినది. సృష్టికి అభిముఖుని గావించినది. ఇది కృష్ణుడు యోగమాయను ఆశ్రయించిన స్థితి. ఇది ఆజ్ఞాచక్ర ప్రాంతపు స్థితి.

**"అజ్ఞాంతం సకలం ప్రోక్తం తత స్సకలనిష్కలం**
**ఉన్మన్యంతం పరేస్థానే నిష్కలం చ తథాస్థితమ్"**

అని చెప్పబడినది. ఆజ్ఞాచక్రము వఱకు సకలస్థితి. అనగా సగుణస్థితి– ఆజ్ఞనుంచి 'ఉన్మని' వఱకు సకల నిష్కలముగా అనగా సగము సగుణము సగము నిర్గుణముగా నుండును. ఇదే అర్ధనారీశ్వర స్థితి. తరువాత సర్వభేద శూన్యమయిన చిత్తలయము. అచ్చట అంతా నిష్కలము– అనగా నిర్గుణము.

**యోగపరముగా :**

ఈ 'ద్విధా' స్థితికి దేహములో 'ఆజ్ఞా'చక్రము ప్రతీకము. సహస్రారము సర్వస్వరూపము. ఆ అఖండ స్థితినుంచి వచ్చిన 'ఖండస్థితి'కి ఆజ్ఞాచక్రము తొలిమెట్టు. కనుక ఆజ్ఞాచక్రమున రెండు దళములు రెండు వర్ణములు గలవు.

**"హక్షయుక్తం దళద్వయమ్"** **105**

కృష్ణుడు 'ద్విభుజుడు'గానే ప్రతిచోట వర్ణింపబడుటయే కాక 'న కదాచిచ్చతుర్భుజః' అని నాలుగు చేతులు లేవని చెప్పబడినది. 'రాధాకృష్ణులు' గూడా ఆదితత్వముగా ఇద్దఱే. కనుక ఇది సృష్టి ప్రారంభము. ఈ స్థితి ఆజ్ఞాచక్ర ప్రాంతమని తెలియుచున్నదిగదా. ఇదే "ద్వ్యణుకము" అనవచ్చును.

ఇట్టి పరమ తత్వమును 'కామతత్వము'గా ఉపాసించుట గలదు. అందువలననే కృష్ణబీజము "క్లీం" బీజము. ఇది సృష్టికభిముఖతత్వము కనుకనే "మాల" ధరించినట్లు మాటిమాటికి చెప్పబడినది.

**"కంఠం తు నిర్గుణం ప్రోక్తం మాల్యతే ఆద్యయాజయా"**
**– కృష్ణోపనిషత్తు**

'అజ' అనగా ప్రకృతి. త్రిగుణాత్మకము.

**"అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం"**

105) "హం, క్షం" అను 2 దళాలుగల ఆజ్ఞాచక్రము కలదు.

అని చెప్పబడినది. కనుక త్రిగుణాత్మక మాయచుట్టినస్థితి. బిందుత్రికోణ సంబంధస్థితి. కనుక సృష్టి సంకల్పముగల "ఈశ్వరుడు" కృష్ణుడు అని భావింపవలయును. లలితాసహస్రనామ భాష్యములో 'భాస్కరాచార్యుడు' 'కామేశ్వరి' నామమును వ్యాఖ్యానించుచు-

**"జగత్సిసృక్షావానీశ్వరః కామపదేనోచ్యతే"**

అని చెప్పెను. జగత్తును సృజింపవలెనను ఇచ్ఛగల దేవుడే "కాముడు" అని చెప్పబడెను. గీతలో భగవంతుడు-

**"ప్రజనశ్చాస్మి కందర్పః"**
**"ధర్మావిరుద్ధో భూతేషు కామోహం భరతర్షభ"** **106**

అని తన గుఱించి చెప్పెను.

కనుక కృష్ణుడు కామరాజ బీజాధిపతి. సంతాన గోపాలుడు. రాసలీలా విశారదుడు. జగత్తు, సంతానము, దాని మూలతత్వములు ఆయన భార్యలు ప్రేయసులు గోపికలు. ఆదితత్వము రాధ. లేదా రుక్మిణి. ఇలా సమన్వయింపవలెను. కనుకనే 'సాక్షాత్ మన్మథ మన్మథః' అని చెప్పబడెను.

**కామరాజబీజము :**

"క్లీం" ఇది కామరాజబీజము.

క= సుఖము, ల=పృధివీ, ఈ=శక్తి, ం=బిందువు. వీటి సంయోగము 'క్లీం' బీజము. భూమిని బ్రహ్మానందమును జోడించు శక్తిగల పరమ పురుషుడు అని అర్థము చెప్పవచ్చును. భౌతికానందముల నియ్యగల శక్తిగల పురుషుడుగూడా కావచ్చును. అందువలన ఇది కామబీజము, కామరాజబీజము.

అధోముఖముగా ఉన్న స్వయంభూలింగమును కామరాజ బీజముతో 'చాలనం' చేయవలెనని యోగశాస్త్రము.

"అదోముఖః క్రియావాంశ్చ కామబీజేన చాలితః" - శ్రీచక్రవిలసనం.

---

106) పుట్టించు వారిలో కందర్పుడను. అర్జునా, జీవులయందు ధర్మ విరోధంలేని కాముడను నేను.

ఈ బీజములో "ల+క" కలిపి జపించినందువలన త్రివర్గము లభించునని కేవలము కామకల అయిన "ఈం" కారోపాసన వలన మోక్షమని పండితులు చెప్పుచున్నారు. చూ॥

**"యదీం శృణోతి అలకం శృణోతి**
**స హి ప్రవేద సుకృతస్య పంథాం"**

అనగా ఎవడయితే 'ల, క' లేని 'ఈ' వినునో వానికి 'కర్మమార్గము' తెలియదు. అనగా ముక్తి వచ్చును. అనగా "లక" = భూసుఖములు అని అర్థము.

ల॥స॥నా॥ భాష్యంలో "కామ్యాకామకలారూపా" అను నామమువద్ద-

**"కామబీజ మాత్రేణ త్రివర్గః**
**కామకలామాత్రేణతు మోక్షః"** అని చెప్పిరి. **107**

కృష్ణశబ్దమును నిర్వచించు శ్లోకముగూడా ఈ అర్థమునే సమర్పించుచున్నది.

**"కృషిర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః**
**తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే"**

భౌతికానందములను పరమానందములో లీనము చేయువాడు అని అర్థము. కామబీజమును గూర్చి పద్మపురాణములో-

**"రహస్యామృతసంసిక్తైః అర్థయుగ్మాక్షరోమనుః**
**మంత్రచూడామణిః ప్రోక్తః సర్వమంత్రైకకారణం"**

మంత్రమే భగవత్ స్వరూపమని అందలి 'కామకల' కృష్ణుడేనని ఆ కృష్ణుడు దేవీరూపమేనని పద్మపురాణములో చెప్పబడెను.

**"అహం చ వాసుదేవాఖ్యో నిత్యం కామకలాత్మకః**
**సత్యం యోషిత్ స్వరూపోహం యోషిచ్చాహం సనాతనీ**

---

107) క్లీ= ఇదికామబీజము. దీనివలన త్రివర్గము అనగా ధర్మ అర్థకామములు లభించును. దానిపైన ఉన్న '0' నాదము కామకల. దీన్నిమాత్రమే అనగా నాదమును మాత్రమే ఉపాసించుట మోక్షము.

త్వయాపి కృష్ణచంద్రస్య కేవలం ధామ చిత్కలం
గోపనీయం ప్రయత్నేన మాతుః జార ఇవ ప్రియమ్" **108**

## యోగములోనే (నాదపరముగా) :

భాగవతమునందు పరమాత్మ గోలోకమునుంచి బృందానమునకువెళ్ళి అచ్చట గోపికలతో 'బ్రహ్మరాత్రము' చేసెను. దీనిని "బ్రహ్మదినము" అని దేవీభాగవతము చెప్పుచున్నది. బృందావన గోలోకములగూర్చి పూర్వము చెప్పినదానినిబట్టి ఇది తీవ్ర సమాధిస్థితి యని భావింపవలెను. గోలోకము 'ఆజ్ఞా'చక్రము అనుకొన్నచో దానివద్ద వేణునాదము చేయుటతో లేదా వినబడుటతో సమాధి ఆరంభమయినదని భావింపవలెను. నాదయోగ విధానములో దశవిధ నాదములు గలవు. అందు ఆఱవ నాదము తాలనాదము, ఏడవనాదము వేణునాదము, ఎనిమిదవది భేరీనాదము, పదియవది మేఘనాదము. మిగిలిన నాదములకు అంతగా ప్రాధాన్యము లేదు. ఆ నాదములు పుట్టగనే నశించు స్వల్పనాదములు. అందువలననే కృష్ణబలరాములకు ముందు పుట్టినవారు అందఱు వెంటవెంటనే కంసునిచేత నశించిరి. మిగిలినవానిలో క్రిందనుండి వరుసలో ముందు పుట్టినది "తాల" (తాటిచెట్టు అని బాహ్యార్థము) నాదము. అది బలరామునకు సంకేతము. ఆయన 'తాలాంకుడు' తాలధ్వజుడు. తరువాతది 'వేణునాదము' కృష్ణునకు సంకేతము. కృష్ణుడు గర్భరీత్యా ఎనిమిదవ గర్భము. కాని కొడుకుగా ఏడవవాడు. బలరాముడు రోహిణి కొడుకుగా పుట్టెనుగదా. కనుక ఏడవ నాదము వేణునాదము శ్రీకృష్ణుడు అగుటకు అభ్యంతరము లేదు. ఎనిమిదవది భేరీనాదము పైనుంచి చూచినచో కృష్ణునికన్న ముందుది కనుక వసుదేవునితో సంకేతింపబడినది. కనుకనే వసుదేవునకు 'ఆనకదుందుభి' అనుపేరు సరిపోవుచున్నది. వసుదేవుడు పుట్టినపుడు దేవదుందుభులు మ్రోగినవి కనుక ఆయనకు 'ఆనకదుందుభి' అనుపేరు వచ్చినది. ఆ దుందుభి నాదము నాదయోగము నందలి 'భేరీనాదము' అని యూహింపవచ్చును.

---

108) నేను వాసుదేవుడను. నిత్యము కామకలాస్వరూపుడను. నేను స్త్రీ స్వరూపుడను. సనాతన స్త్రీ అయిన లలితను నేనే. నీవుగూడా కృష్ణచంద్రుని స్థానమయిన 'కామకలా' మంత్రమును "తల్లియొక్క విటుని విషయమును దాచినట్లు" ప్రయత్నపూర్వకముగా దాచుము.

దశమమయిన మేఘనాదము గూడా కృష్ణావతార సమయములో వినబడినది. చూ॥

**“జాయమానే అజనే తస్మిన్ నేదు ర్దుందుభయో భువి**
**జగుః కిన్నరగంధర్వాః తుష్టువు స్సిద్ధచారణాః**
**మందం మందం జలధరాః జగర్జురనుసాగరమ్” 109**

మేఘదుందుభుల నాదములు వినబడినవి. యోగార్థ వేదార్థ నిధులయిన పురాణాలలో అచ్చటచ్చట వర్ణింపబడే పుష్పవర్షాలు దేవదుందుభులు మొదలగునవి ఇట్లే యూహింపవలసి యుండును.

**జ్ఞానపరముగా :**

కృష్ణుడు యదువంశీయుడు యదువు ‘యయాతి’ కొడుకు. తల్లిదేవయాని. యదువు రాజ్యభ్రష్టుడు. అనగా యయాతి జననమరణ రూపమయిన యాత్రచేయు జీవుడు. ఈయనకు రెండు మార్గములు గలవు.

1. దేవయానము, 2. ధూమయానము.

ఈ దేవయానము, ముక్తిమార్గము, ఛాందోగ్యములో-

**.......మాసేభ్యః సంవత్సరం సంవత్సరాదాదిత్యం**
**ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసోవిద్యుతం తత్పురుషో**
**మానవః సఏనాన్ బ్రహ్మ గమయత్యేష దేవయానః పంథాః॥**

ధూమయానము అనగా-

**“అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యు పాసతే**
**తే ధూమ మభిసంభవంతి ధూమాద్రాత్రిం రాత్రేరపరపక్ష**
**మపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతి మాసాంస్తాన్నైతే సంవత్సర**
**మభిప్రాప్నువంతి మాసేభ్యః పితృలోకం పితృలోకాదా**
**కాశం ఆకాశాచ్చంద్రమసం ఏషసోమోరాజా తద్దే వానా**

---

109) జన్మరహితుడయిన అజుడు జన్మించువేళ దివ్యదుందుభులు మ్రోగినవి. కిన్నర గంధర్వులు పాడిరి. సిద్ధచారణులు సంతసించిరి. మేఘములు సముద్రమును అనుసరించి గర్జించినవి.

**మన్నం తం దేవాభక్షయంతి తస్మిన్ యావత్సంపాత**
**ముషిత్వా అథైతమేవాధ్వానం పునర్నివర్తంతే.......”**

ఇదే శంబూకుని మార్గము.

ఈ విధముగా దేవయాన మార్గము ముక్తిప్రదము. అందులో కృష్ణుడు జన్మించినాడు. జ్ఞానమార్గమునందు కృష్ణుడుదయించుట ఆవశ్యకమేగదా. దేవయాని కొడుకు యదువు.

నారాయణతీర్థులు దేహపరముగా జ్ఞానమార్గమున కృష్ణునిట్లు సమన్వయించిరి.

**“విభు మశరీర మశేష శరీర గుహాసు నివిష్ట చిదంశం**
**వ్రజ యువతీ జనవల్లభ మాత్మతయా పరిశిష్ట మధీశమ్”**

అనగా శరీరగుహలందు జ్ఞానరూపముగా ఉన్నాడు. చుట్టు గోపికలు పరివేష్టించియున్నారు. ఆయన ‘ఆత్మ’గా మిగిలియున్నాడు.

**“మధురిపు మిహ రాసభువి విహరంతం**
**మాధవ మింద్రియాదిషు వసంతం”**

ఇంద్రియములలో వ్యాపించియున్నవాడు లేదా ఇంద్రియ పరివేష్టితుడై యున్నవాడు.

**“దినకరమండలగం సుపతంతం**
**విశ్వతనుం విషయాదిషుసంతం”**

సూర్యమండలమధ్యములోను (దేహంలో మణిపూరం సూర్యమండల ప్రాంతము) విషయముల మధ్యలోను, ఉన్నవాడు. ఈ విధముగా మనయందున్న ‘జీవుడే’ కృష్ణుడని చెప్పబడినది. అంతేగాక, శరీరము ఒక చక్రముగా అందలి ఇంద్రియాలు విషయాలు మొదలగునవి చక్రములోని ఆకులుగా భావించినచో పరమాత్మ వీటికన్నింటికి ఆధారము గనుక ‘నాభి’గా చెప్పినారు. నారాయణతీర్థులు ఇట్లే చెప్పిరి.

**“అరమివ రథచరణస్య పినద్ధం**
**యత్ర కలానియమేన సుసిద్ధం**

**విశ్వనగరవరరాజ మరాజం**
**వివిధకలాకృత జీవసమాజమ్"** **109ఎ**

అనగా రథచక్రము మధ్య ఆకులువలె పరమాత్మయందే ఈ 'కల'లు అన్నియు నిలిచినవి. ఇది ప్రశ్నోపనిషత్తులో వివరింపబడినది. చూ॥

**"షోడశకలః సోమ్యపురుష"**
**"ఇహైవాంతశ్శరీరే సోమ్య స పురుషః యస్మిన్**
**ఏతాః షోడశకలాః ప్రభవంతీతి............**
**స ప్రాణ మసృజత (ప్రాణం=హిరణ్యగర్భాఖ్యం)**
**ప్రాణాత్ శ్రద్ధాం ఖంవాయుం జ్యోతి రాపః**
**పృధివీం ఇంద్రియం మనః అన్నం అన్నాద్వీర్యం**
**తపో మంత్రాః కర్మలోకాః లోకేషునామ"** **110**

అనగా 16 కలలు.

ప్రాణము అనగా హిరణ్యగర్భుడు. అనగా సమష్టిజీవుడు, శ్రద్ధ, పంచభూతములు, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, వేదములు, కర్మ, లోకములు, నామధేయము మొత్తము 16.

మఱొక మతము; కలలు అనగా పంచభూతములు – 5,

దశేంద్రియములు – 10, మనస్సు – 1 = 16.

**"భూతేంద్రియమనాంస్యేవ క్రమాత్ నిత్యాః కలాః పునః"**

కల= 16వ వంతు.

---

109ఎ) రథచక్రములో ఆకులవలె భగవంతునియందు 16 కలలు నియమంగా నిలిచియున్నవి. విశ్వపట్టణానికి ప్రభువు, తనకేప్రభువు లేనివాడు. వివిధ కలలతో జీవసమాజమును నిర్మించినవాడు.

110) సోమ్యా! పురుషునకు 16 కలలున్నాయి. ఈ శరీరంలోనే ఆ పురుషుడున్నాడు. ఆయనయందే 16 కలలున్నాయి. అతడు ప్రాణమును సృజించెను. ప్రాణమనగా హిరణ్యగర్భుడను ప్రథమ జీవుడు. ప్రాణము నుండి శ్రద్ధను, ఆకాశమును, వాయువును, అగ్నిని, జలమును భూమిని, ఇంద్రియమును, మనస్సును, అన్నమును, అన్నమునుండి వీర్యమును, తపస్సును, మంత్రమును కర్మలోకమును దానియందు పేర్లను సృజించెను.

**"షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్య అస్తం గచ్ఛంతి" -** ఈ 16 కళలు పురుషునిలో లీనమగును.

**"అరా ఇవ రథనాభౌకలాయస్మిన్ ప్రతిష్ఠితాః తంవేద్యం పురుషం వేద యథామా వో మృత్యుః పరివ్యథాః"** **111**

అనగా మనోమయకోశాభిమానియగు పురుషుని యందు పై 16 కళలు పొదగబడినవి. అట్లే శ్రీచక్రమునందు సర్వాశా పరిపూరకచక్రము కలదు. అది 16 రేకుల కమలము. దానియందు కామాకర్షిణి మొదలగు నిత్యలు 16 కలవు. 16 స్వరములు, 16 తిథులు ఉండును. కాగా వానిమధ్యన ఉన్న మనయందలి ప్రత్యగాత్మయే శ్రీకృష్ణుడు.

**"గోవులు - వాక్కులు" అయినచో :**

"గోవులు= వాక్కులు వేదములు" అను ప్రకరణములో చెప్పినట్లు కృష్ణుడు సర్వవేదమంత్ర సారమయిన ఓంకార స్వరూపము అని చెప్పవలెను. అసలు తత్వరీత్యా ఓంకారము గూడా పరబ్రహ్మలో లీనమగును. ఓంకారము నాదరూపము గనుక 'నాదము' పరాశక్తి రూపము గనుక పరాశక్తి రూపము అయిన కృష్ణుడుగూడా నాదమని చెప్పవచ్చును. కృష్ణుడే పరబ్రహ్మమను వారివాదములోనైనచో వేదములకు సంబంధించినంత వఱకు 'ఓంకారము' నాయకుడు గనుక సామ్యమునుబట్టి 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని శబ్ద బ్రహ్మస్వరూపముగా కృష్ణ ప్రతిబింబముగా చెప్పవలసియుండును. కనుకనే-

**"ప్రణవశ్చాస్మి వేదానాం"**
**"ప్రణవ స్సర్వవేదేషు గిరామస్మ్యేక మక్షరమ్"**
**ఋచో అక్షరే పరమే వ్యోమన్**
**యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః**

---

111) 16 కలలు పురుష గమ్యములు. అవి పురుషుని చేరి ఆయనయందు లీనమగును. రథపు కుండయందు చుట్టు ఆకులు వ్యాపించినట్లు ఆయనయందు 16 కలలు (చక్రమధ్యంలో కడ్డీలు లాగా) ఉన్నవి. ఆయనను తెలిసిన వానిని మృత్యువు బాధింపకుండు గాక!

**యస్తన్నవేద కిమృచా కరిష్యతి**
**య ఇత్‌తద్విదుః తఇమే సమాసతే" - బృహజ్జాబాలోపనిషత్ 112**

ఓంకారమునందే సకల దేవతలున్నారు. దాని అర్థము తెలియనివారికి వేదముతో ప్రయోజనము లేదు.

ఈ ఓంకారము ఛందస్సుల నుండి సారముగా పుట్టినది. ఛందస్సులకు అది సారము. వృషభము. ప్రపంచ స్వరూపము. ఆ ప్రభువు నాకు మేధను సమర్పించుగాక. చూ॥

**"యశ్చందసా మృషభో విశ్వరూపః**
**ఛందోభ్యోధ్యమృతా త్సంబభూవ**
**సమేంద్రో మేధయా స్ప ృణోతు" - తైత్తి.**

ఓంకారమును వృషభముగా పోల్చి అగ్నిమంత్రమును ఓంకారముతో పోల్చి సమన్వయము చేసినారు. ఆ ప్రభువు నాకు మేధను సమర్పించుగాక. చూ॥

**"చత్వారి శృంగాః త్రయో అస్యపాదా=**
**ద్వేశీర్షే సప్త హస్తాసో అస్య**
**త్రిధా బద్ధో వృషభో రోరవీతి**
**మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ" 113**

దీనిని ఖగోళగతమయిన వృషభరాశికిగూడా నక్షత్రవేత్తలు సమన్వయము చేయుదురు. అగ్నిదేవతాకమయిన కృత్తికానక్షత్రము ఈ వృషభమునందు గలదు గదా. శబ్దమయమయిన అగ్నియే ఓంకారము. ఆదిత్యుడు ఓంకారము. వృషభాకారము-

---

112) వేదములో నేను ఓంకారమును. సర్వవేదములందు నేను ఓంకారముగా నున్నాను. వాక్కులలో ఒక అక్షరమును నేనే. పరమాకాశమయిన ఆ ఓంకారమున సర్వదేవతలు నివసించెదరు. ఆ అక్షరతత్త్వము తెలియనివానికి ఋక్కుతో ఏమిపని. ఆ తత్త్వము తెలిసినవారు దానితో కలియుదురు.

113) దీనికి 4 శృంగములు. 3 పాదములు, 2 తలలు, 7 చేతులు, 3 బంధనములు. అట్టి వృషభము లేదా ఓంకారము నినదించుచున్నది. ఆ దేవ తేజస్సు మనుష్యులయందు ప్రవేశించెను.

| | |
|---|---|
| శృంగాలు - 4. | "అ+ఉ+మ్+ం" |
| పాదాలు - 3. | విశ్వతైజ సప్రాజ్ఞులు, త్రిమూర్తులు, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు. (ఆత్మలు) |
| శిరస్సులు - 2 | పరా - అపరా |
| చేతులు - 7 | భూర్భువరాది లోకాలు 7. |
| మూడుత్రాళ్ళు - 3 | జాగ్రత్ స్వప్న సుషుప్తి - అనుదశలు. |

అట్టి వృషభ స్వరూపమే ఈ 'గోపాల స్వరూపము'. ఆవులకు ఎద్దువలె వాక్కులకు ఓంకారము అని అర్థము. హరివంశములో గూడా-

**"గౌరేషాచ తధావాణీ తాంచ విందయతే భవాన్**
**గోవింద స్తుతతో దేవ మునిభిః కథ్యతే భవాన్"** **114**

అని చెప్పబడినది. ఇతర విషయములు "రాసలీల" వద్ద చెప్పబడినవి.

## కాలరూప సమన్వయము :

గోవులు కాలము కాలాంశము అనుకొన్నపుడు కాలకర్త అయిన ఆదిత్యుడు లేదా ఆదిత్య గతుడైన పరమాత్మయే 'కృష్ణుడు'.

**"అధఖలుయ ఉద్గీధః స ప్రణవః యః ప్రణవః**
**స ఉద్గీధః ఇత్యసౌ వా ఆదిత్యః ఉద్గీధః**
**ఏష ప్రణవ ఓ మితి హ్యేష స్వరన్నేతు" - ఛాందోగ్యం. 115**

ప్రణవము ఆదిత్యుడు. ఈయనయే కాలకర్త. కనుక 'వేదములు, కిరణములు, కాలములోని భాగములు= గోవులు' అను మూడు పక్షములలో సూర్యుడే కృష్ణుడని చెప్పవచ్చును. ఇక ప్రత్యక్షముగా, కాల కాలాంశ స్వరూపముగా గూడా చెప్పవచ్చును.

**"అనంత ఇత్యహం పార్థ విశ్వరూపం నిబోధ మే**
**ఆదిత్యగ్రహచారేణ యః కాల ఉపపద్యతే**

---

114) ఈ గోవు వాక్కు దాన్ని పొందించువాడవు గనుక నిన్ను గోవిందుడందురు. అది ముని వచనము.

115) ఏది ఉద్గీథమో అది ఓంకారము. ప్రణవమే ఉద్గీధము. ఆదిత్యుడే ఉద్గీధము. అతడే ప్రణవము. ఇతడు ఓం అను స్వరమును పొందుగాక.

**కలా కాష్ఠా ముహూర్తాది దినరాత్ర శరీరవాన్**
**పక్షర్తు మాస వర్షాది యుగ కల్ప వ్యవస్థయా**
**యోయం కాలో మయాఖ్యాతః సోనంత ఇతి సంజ్ఞితః**
**సోహంకాలోవతీర్ణోత్ర భువో భారాపనుత్తయే" 115ఎ**

**- భవిష్యోత్తర పురాణం.**

అనంత వ్రతకల్పములో కృష్ణుడు 'తాను కాలరూపుడుగా భూభారహరణమున'కు అవతరించినట్లు పాండవులతో చెప్పెను.

**"కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః" - గీత.**
**"కాలః కలయతా మహం" - గీత.**

ఈ విధముగా 'కాలస్వరూపుడు' అని తేలుచున్నది. కాలాంశమయిన 'సంవత్సరము' గూడా ఆయన రూపము. చూ॥

**"సంవత్సరో వై ప్రజాపతిః" - శ్రు.**
**"యజ్ఞో వై సంవత్సరః" - శ్రు.**
**"యజ్ఞో వై విష్ణుః" - శ్రు.**
**"యోయం కాలః తస్య తే వ్యక్తబంధో (= ప్రకృతిబంధో)**
**చేష్టా మాహుః చేష్టతే యేన విశ్వమ్**
**నిమేషాది ర్వత్సరాంతో మహీయాన్**
**తం త్వేశానం క్షేమధామ ప్రపద్యే" - భాగ. 10 స్కం. 116**

ఇది కృష్ణావతార సమయమున తల్లి "దేవకీదేవి" అవతరించిన పరమాత్మను స్తుతించిన శ్లోకము. "కాలము" (నిమిషమునుండి సంవత్సరము దాకా) భగవంతుని చేష్టారూపమని స్తుతించినది.

---

115ఎ) పార్థ! నేను అనంతుడను. నా విశ్వరూపమును తెలిసికొనుము. ఆదిత్యుడు మొ॥ గ్రహముల సంచారముతో ఏకాలము ఏర్పడుతున్నదో అదంతా నేనే. కల, కాష్ఠ, ముహూర్తము, దినము, రాత్రి పక్షము, ఋతువు, మాసము, సంవత్సరము, యుగము, కల్పము అను వ్యవస్థలోగల కాలము నేనే. అదే అనంతము. అట్టి కాలరూపుడ నయిన నేను భూభారము పోగొట్టుటకు అవతరించితిని.

116) ప్రకృతిబంధూ! దేవా! కాలము నీ చేష్టయే అందురు. దానివలననే విశ్వం నడుస్తున్నది. నిమిషము నుండి సంవత్సరం వఱకు ఉన్న మహత్తరమయిన కాలము నీవు. క్షేమస్థానమయిన నిన్ను శరణువేడెదను.

**"శ్రీచక్రవిలసనము"లో శివుడుగూడా-**

**"హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి శ్రుతః"**

అని సంవత్సర రూపుడుగా చెప్పబడినాడు.

దేవీభాగవతమున భగవంతుని కాలరూపునిగా ఉపాసించు 'మంత్రము' గలదు. చూ॥

**"నమో జ్యోతిర్లోకాయ కాలాయ అనిమిష**
**పతయే మహాపురుషాయాభిధీమహి" 117**

కనుక కృష్ణుడు 'కాల'రూపుడని ఆయనలోని కాలాంశలే గోపగోపికలని సమన్వయము. భారతమును, భాగవతములోని 11వ స్కంధమును అనుసంధించినచో కృష్ణుడు 'జగద్గురువు'గా మహాయోగిగా కనబడును. అసిధారావ్రతము అసంగయోగము భగవంతుని తత్త్వముగా ప్రదర్శిత మయినది. దశావతారములో "జగద్గురు"వనిపించిన అవతారము ఇదే. చూ॥

**"కృష్ణం వందే జగద్గురుం"**

**"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః"**

అట్లే నా "సాలభంజికా సూత్రధారము" నుంచి -

**"సంసారే సమరే నరస్య భగవాన్ నారాయణః సారధిః**
**తుల్యోచ్చావచ తోత్రవేణు మిధునః కృష్ణో గురూణాంగురుః" 118**

ఈ "గోస్వామి"పై మఱొక గోస్వామి "ఉజ్జ్వలనీలమణి" అనుగ్రంథము రచించెను. కృష్ణునిది "మణికాంతి" తత్త్వము. మా గురువుగారు "నాకు తోచినమాట" అను గ్రంథములో ఈ విషయము చెప్పిరి. రామునిది నిగూఢ వ్యక్తిత్వము. కృష్ణునిది రత్నమువలె కాంతిని వెదజల్లు తత్త్వము. "మణి" కాంతిని వెదజల్లినట్లు కృష్ణుడు లీలలు వెదజల్లెను. ఇది లీలావతారము. కృష్ణుడు మానవ సహజ ప్రవర్తనను ఉల్లంఘించెను. గరుడవాహనము, చక్రాయుధము మొదలగు దివ్యప్రహరణముల నుపయోగించెను. ద్వారక,

117) జ్యోతిర్లోక (మహర్లోకం) స్వరూపుడు, కాలరూపుడు, దేవప్రభువు అయిన మహాపురుషుని ధ్యానించెదము.

118) సంసారంలోనూ, సంగ్రామంలోనూ నరునకు (అర్జున, మానవ) నారాయణుడే సారధి. హెచ్చుతగ్గులమీద, అందుకు ప్రతీకగా చెత్తనూ పిల్లనగ్రోవిమీద సమానాదరణగల కృష్ణుడు గురువులకు గురువు.

శోకము, ఆనందమయత్వము మొదలగునవి ఆయన మనుష్యతను సూచించును. మణి పార్థివము. కాని దాని కాంతి దివ్యము. కనుక 'కృష్ణుని'లో విష్ణువును చూడవలయును.

అట్లు గ్రహింపక మూఢులు తనను అనాదరించెదరని గీతలో భగవానుడే చెప్పియున్నాడు. చూ॥

**"అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం**
**పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్" 118ఎ**

దీనినే 'పద్మపురాణము' చెప్పుచున్నది.

**"సేంద్రియోపి యధా సూర్యః తేజసా నోపలక్ష్యతే**
**తధా కాంతియుతః కృష్ణః కాలం మోహయతి ధ్రువం**
**న తస్య ప్రాకృతీమూర్తిః మేదోమాంసాస్థిసంభవా" 119**

అనగా సూర్యునివలె కృష్ణుడు కాంతియుతుడు. అందులో జననము మన శరీరమువంటిదని భావింపరాదు. కనుక నిందాదోషములు పనికిరావు. పాపహేతువులు.

'జగద్గురు బోధలు'లో "కంచిస్వామి" వారుదహరించిన-

**"ఏకోపి కృష్ణే ను కృతప్రణామః**
**దశాశ్వ మేధావబృధేన తుల్యః**
**దశాశ్వమేధీ పునరేతి జన్మ**
**కృష్ణప్రణామీ న పునర్భవాయ"**

అను శ్లోకము ప్రకారము కృష్ణ నమస్కారము ఒక్కటే 10 అశ్వమేధములతో సమానము. వానికి 'పునర్జన్మ'లేదు. కనుక కృష్ణతత్వము పరతత్వము.

---

118ఎ) సర్వభూతసామ్రాజ్యపతినయిన నా పరమతత్త్వము నెరుగని మూఢులు మనుష్య రూపంలో నున్న నన్ను అవమానించెదరు.

119) సూర్యునకు శరీరాది ఇంద్రియాలున్నా విపరీత కాంతివలన మనకు కనబడవు. అట్లే కాంతి మంతుడయిన కృష్ణుడు కాలమును మోహింపజేయును. ఆయన శరీరము రక్తమాంస రూపమయిన మనదేహం వంటి ప్రకృతిబద్ధ దేహము కాదు.

# అష్టమ పింఛము

## రాధ

కృష్ణునితో అందున 'బాలకృష్ణుని' తో 'రాధాదేవి' జంటగా వర్ణింపబడుట భాగవతమునందు లేదు. పద్మపురాణము మొదలగు పురాణములందు గలదు. ఈమె 'వృషభాను'ని కూతురు. 'విశాఖా' నక్షత్రమునకు 'రాధా' అనుపేరు గలదని పూర్వము చెప్పియుంటిని. విశాఖ యందలి జంటనక్షత్రములు రాధాకృష్ణులని ప్రతీతి. ఈ రాధను గూర్చి-

1) ఒక దేవతగా కృష్ణ సహధర్మచారిణిగా

2) గోకులములో వృషభానుని కూతురుగా రెండు రకముల వర్ణన గలదు.

ఇందు గోలోక వృత్తాంతమే గోకుల వృత్తాంతముగా చెప్పబడి యుండును. ఈ రెండును దేహపరముగా సమన్వయము చేయవలసి యుండును. ఎందుకనగా గోలోక బృందావన వర్ణనము పూర్వము చెప్పినట్లు దేహపరముగానే చక్కగా అన్వయించుచున్నది.

పురాణములు రాధాకృష్ణులుగూర్చి చెప్పిన విషయములు పరిశీలింప వలయును. చూ॥

**"గోవింద ఏవ పురుషో బ్రహ్మాద్యాః స్త్రియ ఏవ చ**
**తత ఏవస్వభావోయం ప్రకృతేర్భావ ఈశ్వరః"**
**"పురుషః ప్రకృతి శ్చాద్యౌ రాధాబృందావనేశ్వరౌ**
**ప్రకృతేర్వికృతం సర్వం వినాబృందావనేశ్వరమ్" 120**

– పద్మపురాణము. పాతాళఖండం

"రాధ" మూలప్రకృతి అని భావము.

**"బహిరంగైః ప్రపంచస్య స్వాంశై ర్మాయాదిశక్తిభిః**
**అంతరంగైస్తథా నిత్యైః విభూతైస్తైః చిదాదిభిః**

120) గోవిందుడే పురుషుడు. బ్రహ్మ మొదలయిన వారందరు స్త్రీలే. ఆయన నుంచియే యీ స్త్రీభావము వచ్చినది. ప్రకృతి యొక్క ఉనికి ఈశ్వరుడే. రాధ ఆద్యప్రకృతి కృష్ణుడు. ఆది పురుషుడు. బృందావన ప్రభువు లేనిచో ప్రకృతి విలాసమంతా వికారమే.

**గోపనా దుచ్యతే గోపీ రాధికా కృష్ణవల్లభా" - పద్మ. పాతాళఖండం 121**

అనగా రాధాదేవి తన మాయతోను, జ్ఞానాది అంతరంగ శక్తులతోను భగవంతుని గోప్యముగా ఉంచినది గనుక "గోపికా" గోపీ అగునని చెప్పబడినది. అనగా ఆవరణ విక్షేపశక్తులతో 'సత్యవస్తువు'ను రహస్య వస్తువుగా మార్చినది అని అర్థము.

**"దేవీ కృష్ణమయీ ప్రోక్తా రాధికా పరదేవతా**
**సర్వలక్ష్మీస్వరూపా సా కృష్ణాహ్లాద స్వరూపిణీ 122**
**తతస్సా ప్రోచ్యతే విప్ర 'హ్లాదినీ'తి మనీషిభిః" - పద్మ. పాతాళఖండం**

కృష్ణుని యందలి "ఆనంద" స్వభావమే రాధ అని అర్థము. అందువలన ఆమె "హ్లాదినీ" శక్తి అందురు. దీనిని నిర్వచించుచు 'సిద్ధాంతరత్నము' అను గ్రంథము.

**"హ్లాదాత్మాపి చ యయా హ్లాదతే హ్లాదయతి చ సా**
**హ్లాదినీశక్తిః"** అని చెప్పినది. భగవంతుడు ఆనందస్వరూపుడే. కాని తాను అఖండముగా నున్నపుడు 'ఆనందము' అను భావన రానేరదు. కాని తాను రెండుగా అయినపుడు ఆనందము, ఆనందించుట- అను భావనలు క్రియలు ఏర్పడును. రెండుగా ఏర్పడిన స్థితియే 'రాధాకృష్ణ' తత్వము. కనుక భగవంతుని 'ఆనంద' శక్తి రాధ. ఇతర ఆగమములందును 'శక్తి' ఆనంద స్వరూపయే గదా. చూ॥

**"సచ్చిన్మయః శివః సాక్షాత్ తస్యానందమయీ శివా" - త్రిశతీభాష్యము**

శ్రీ కంచి పరమాచార్యులవారు తమ జగద్గురు బోధలలో కుమారస్వామిని గూర్చి చెప్పుచు- సత్= పరమాత్మ; చిత్= శక్తి; ఆనందము= కుమారుడు అనియు చెప్పియున్నారు. 'విష్ణువు' విషయములో గూడా-

**"పరేశస్య మహావిష్ణోః తాః సర్వాస్తే కలాకలాః**
**ఆనందరూపిణీ శక్తిః త్వమీశ్వరి నసంశయః" 123**

---

121) బహిరంగమయిన మాయాదిశక్తులచేత, అంతరంగమయిన 'చిత్ మొదలగు శక్తులచేత ఈ ప్రపంచమును, రక్షించుట వలన రాధికను 'గోపి' అంటారు. ఆమె కృష్ణప్రియ.
122) పరదేవత అయిన రాధాదేవి కృష్ణస్వరూపురాలు. ఆమె సర్వలక్ష్మీ స్వరూపురాలు. కృష్ణుని ఆహ్లాదశక్తి ఆమె. అందుచేతనే ఆమెను 'హ్లాదిని' అని అంటారు.
123) పరమేశ్వరుడయిన మహావిష్ణువుయొక్క కలల కలలు అనగా భాగాల్లో భాగాలు వారంతా. ఈశ్వరీ! నీవు మాత్రము ఆనందశక్తివి. సందేహంలేదు.

అని విష్ణువుయొక్క 'ఆనంద' రూపముగా దేవి చెప్పబడినది.

ఈమెనుగూర్చి భాగవతములో ప్రత్యక్షముగా ఏమియు లేదు. కాని అంతర్ధాన ఘట్టమున 'ఒకగోపిక'తో విహరించినట్లు చెప్పబడినది. ఆమె రాధయని వ్యాఖ్యాతలు సూచించిరి. ప్రపంచ, తత్వ, ఇంద్రియ రూపగోపికల నుంచి అంతర్ధానమయిన పరమాత్మకు సంబంధము "మూలగోపిక"తోనే గనుక వ్యాఖ్యాతల సూచన యుక్తియుక్తము.

"గోపాలోత్తరతాపిని"లో రాధను గుఱించి "గాంధర్వి" అని చెప్పబడినది. ఋక్పరిశిష్టమునందు "రాధా" అని చెప్పబడినది. ఈ విషయమును 'ఉజ్జ్వల నీలమణి' గ్రంథములో చూడదగును.

**"గోపాలోత్తరతాపిన్యాం యా గాంధర్వీతి విశ్రుతా**
**రాధేతి ఋక్పరిశిష్టేచ మాధవేన సహోదితా" 124**

గంధర్వ శబ్దము సంగీత సంకేతము. గాంధర్వీ అనగా 'నాదరూపా' అనవచ్చును.

**ఉపాసన :** రాధామాధవులను కలిపి ఉపాసన చేయవలయును. ఈ విషయముగూడా అనేక గ్రంథములందు చెప్పబడినది.

ఋక్పరిశిష్టమునందు–

**"రాధాయా మాధవో దేవో మాధవేనైవ రాధికా విభాతి భువనేష్వా"**

అనగా – రాధామాధవులు కలిసి ప్రకాశింతురని భావము.

**"రాధాసంగే యదా భాతి తదా మదనమోహనః**
**అన్యథా విశ్వమోహోపి స్వయం మదనమోహితః**
**గౌరతేజో వినా యస్తు శ్యామతేజ స్సమర్చయేత్ 125**
**జపేద్వా ధ్యాయతే చాపి సభవే త్పాతకీ శివే" – సమ్మోహనతంత్రము**

---

124) గోపాలోత్తరతాపినిలో ఎవరిని 'గాంధర్వి' అని అన్నారో ఆమెనే ఋక్పరిశిష్టములో 'రాధ' అని మాధవుని తోడుగా చెప్పారు.

125) రాధతో కలిసినపుడే కృష్ణుడు మన్మధునికిన్ని మోహనుడు. లేదంటే విశ్వ మోహనుడైనా ఆయన మన్మధుని వలన మోహంలో పడతాడు. గౌర (పచ్చని) తేజస్సు అనగా 'రాధ' లేనిదే శ్యామ తేజస్సును (కృష్ణుని) ఆరాధింపరాదు. అలా చేసినా జపించినా ధ్యానించినా వాడు పాపి అవుతాడు.

అనగా రాధ పచ్చని / తెల్లని తేజస్సు. కృష్ణుడు నల్లని తేజస్సు. ఈ రెండు కలిపి ధ్యానము చేయనివాడు పాపాత్ముడు అగును. కనుకనే స్వామిని "పీతాంబరధరుని"గా ధ్యానము చేయుదురు.

**"నీలో తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా**
**నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా" 126**

అను మంత్రములో చెప్పబడిన "వర్ణసమ్మేళనమే" రాధాకృష్ణతత్వము గావచ్చును.

"రాధాసుధానిధి" అను గ్రంథములో–

**"రాధాదాస్యమపాప్య యః ప్రయతతే గోవిందసంగాశయా**
**సోయం పూర్ణసుధానిధేః పరిచయం రాకాం వినా కాంక్షతి**
**కించ శ్యామరతి ప్రవాహ లహరీ బీజం న యే తాం విదుః**
**తే ప్రాప్యాపి మహామృతాంబుధి మహో బిందుం పరం ప్రాప్నుయుః"127**

అని చెప్పినాడు. పూర్ణిమలేని చంద్రుని వలన కాంతి లభించదు. రాధలేని కృష్ణుని వలన రక్తి ముక్తి లభింపదు – అని అర్థము.

**వయస్సు :** గోకులమేగాక గోలోక వాసులయిన రాధాకృష్ణుల వయస్సుగూడా చిత్రముగనే యున్నది.

**"త్వయాచ క్రీడతే కృష్ణో నూనం బృందావనే వనే**
**కౌమారేణైవ రూపేణ త్వం విశ్వస్య చ మోహినీ" – పద్మపురాణం 128**

అనగా కృష్ణుడు 'కౌమార వయస్సు'లో నున్నట్లు చెప్పబడినది. రాధాదేవి ఒక సందర్భములో –

---

126) నీలమేఘము మధ్యలో మెరుపు తీగవలె మెరసేది నీవారగింజముల్లువలె సన్ననిది అణువంతగా పచ్చగా మెరిసేది.

127) రాధను ఆరాధించకుండా గోవిందుని పొందాలని ప్రయత్నం చేయటం అంటే పూర్ణిమ రాకుండా పూర్ణచంద్రుడు కావాలని కోరడమే. పైగా శ్యాముని ఆనంద ప్రవాహ బీజమయిన రాధను గుర్తించని వాడు మహా అమృత సముద్రం చేరిగూడా ఒక్క బిందువును మాత్రమే పొందగలడు.

128) బృందావనంలో కృష్ణుడు నీతో (రాధతో) కౌమార రూపంతోనే క్రీడిస్తాడు. నీవు విశ్వమోహినివి.

**"బభూవ దధతీ దివ్య రూప మత్యంత మోహనం**
**చతుర్దశాబ్ద వయసా సమ్మితం లలితం పరం" - పద్మపురాణం 129**

అని 14 ఏండ్ల వయస్సుగా వర్ణింపబడినది. గోపికలు గూడా-

**"సమాన వయస శ్చాన్యాః తథైవ వ్రజబాలికాః"**

అని గోపికలు 14 ఏండ్ల ప్రాయమువారుగా చెప్పబడినారు. వీరంతా గోలోకమువారు. దేవతాస్త్రీలు. పద్మపురాణములోనే మఱొకచోట-

**"బాల్య పౌగండ కైశోరం వయో వందే మనోహరం**
**బాలగోపాలగోపాలం స్మేరగోపాలరూపిణం**
**వందే మదన గోపాలం కైశోరాకార మద్భుతం"**

అని మూడు వయస్సులు అందుకు మూడు పేర్లు వర్ణింపబడినవి. అందు -

"బాల్యములో 'బాలగోపాలుడు' పౌగండములో 'స్మేరగోపాలుడు' కైశోరములో 'మదనగోపాలుడు' అని చెప్పబడెను.

బాల్యము = 5 ఏండ్లలోపు "బాల్యం పంచమ వర్షాంతం"
పౌగండము = 10 ఏండ్లలోపు "పౌగండం దశమావధి"
కైశోరము = దీనినిగూర్చి వివరణ లేదు. కౌమారము కావచ్చును.
కౌమారము = 14 ఏండ్లలోపు "అష్టపంచక కైశోరం"
సీమా = 15 ఏండ్లలోపు "సీమాపంచదశావధి"

అని పద్మపురాణ నిర్వచనము. భాగవతములో కృష్ణుని వయస్సు 'పౌగండ' వయస్సుగా చెప్పబడినది. చూ॥

**"తత శ్చ పౌగండ వయస్సమాహితౌ**
**బభూవతు స్తౌ పశుపాల సమ్మతౌ" - భా.10స్కం.15 అధ్యా.**

తౌ= బలరామకృష్ణులు

**తత్త్వము - ఐక్యము :**

పద్మపురాణమునందే ఒక విషయము వర్ణింపబడినది.

---

129) 14 ఏండ్ల వయస్సుగల అత్యంత సుందరమయిన దివ్యరూపముగల జవ్వని రాధిక.

ఇంతకుముందు “దేవీతత్త్వము - కృష్ణుడు” అనుచోట చెప్పినట్లు రామకృష్ణులు ఇర్వురు ‘దేవీ’ అవతారములు. వారి భార్యలుగా వచ్చి తటస్థముగా కనబడు మొత్తము కథకు కారణమయిన సీత మొదలగువారు శివాంశలనియు తెలియుచున్నవి. అట్లే రాధాకృష్ణుల విషయములో గూడ రాధ= శివుడు; కృష్ణుడు=గౌరి అని పద్మపురాణము సూచించుచున్నది. చూ॥

**“కదాచిద్రాధికా శంభుః చారు పంచముఖాంబుజః**
**కృష్ణో భూత్వా స్వయంగౌరీ చక్రే విహరణం మునే”**

అనగా రాధాదేవి శివునిగాను, కృష్ణుడు గౌరిగానుమారి విహరించిరి.

**“సాక్షాత్‌శంభుః పుమాన్ పూర్ణో రాధాస్త్రీరూప మాశ్రితః”**

అనగా అదే అర్థము. కనుక ఉన్నది ఒకటే రూపము. అదే రెండుగా అయినది. “కుడి, ఎడమ” అనే భేదము మాత్రమే. ఆ భేదము మన అవగాహన మాత్రమే. లేదా భ్రమ మాత్రమే. ఎడమ కుడి, కుడి ఎడమ కావచ్చును. కనుకనే హరిహరనాధుడు ఏర్పడినాడు. హరిహరపుత్రుడు ఆవిర్భవించినాడు. అయ్య+అప్ప= అయ్యప్ప ప్రత్యక్షమయినాడు. ఆలెక్కన మనము అందఱము అయ్యప్పలమే. ఏకశక్తివిలాసములము.

కేశవుడు ఆదిశక్తి అంశము కనుకనే “జగన్మోహిని” అయినాడు. నీలకంఠ దీక్షితుడు తన నీలకంఠ విజయమున విష్ణువును **జగన్మాతా దేవః** అని వర్ణించినాడు.

**“అహం చ వాసుదేవాఖ్యః నిత్యం కామకలాత్మకః**
**సత్యం యోషిత్ స్వరూపోహం యోషిచ్చాహం సనాతనీ” 130**
**- పద్మపురాణం.**

కనుకనే ఆయన “పుంసాం మోహనరూపాయ” అని చెప్పబడెను. కనుకనే ఆయన “బాలాజీ” ఇదంతయు దేవీతత్త్వపరముగా చెప్పబడినది. మొత్తముమీద “ప్రకృతి పురుష” ద్వంద్వము ఆదిదంపతులు వారే రాధాకృష్ణులు.

130) నేను వాసుదేవుడను. నిత్యము నేను కామకలా స్వరూపము గలవాడను. నేను స్త్రీ స్వరూపము గలవాడను. ఆ సనాతన స్త్రీని గూడా నేనే.

# నవమ పింఛము

## "రాసలీలా కృష్ణుడు"

కృష్ణతత్త్వము" వివిధ పురాణములనుబట్టి అంచనా వేసియుంటిమి. గోకులకృష్ణునకు, గోలోక కృష్ణునకు, భారత కృష్ణునకు, భాగవత కృష్ణునకు విష్ణువునకు గల సామ్యము అర్థమగుచున్నది. రాసలీలలో కృష్ణుడు వర్ణింపబడిన విధానమునకు మఱికొంచెము వివరణము అవసరము. ముందుగా కృష్ణుని వేషమును వివరింపవలయును.

1) మయూరపింఛము – కర్ణికాపుష్పము.
2) బెత్తము (యష్టిక) / వేత్రము.
3) వేణువు – నాదము – అధరామృతము.
4) వనమాల / వైజయంతి.
5) "త్రిభంగి"గా నిలుచుండుట.

**పోతనగారి పద్యము :**

**"శ్రవణోదంచిత కర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో**
**అవతంసాయిత కేకిపింఛకముతో నంభోజదామంబుతో**
**స్వవశుండై మధురాధరామృతముచే వంశంబు పూరించుచున్**
**ఉవిదా! మాధవుడాలవెంట వనమందొప్పారెడిం జూచితే"**

**"త్రిభంగం లలితాశేష నిర్మాణసార నిర్మితమ్**
**తిర్యగ్గ్రీవ జితానంతకోటి కందర్ప సుందరమ్**
**వామాంసార్పిత సద్గండం స్ఫురత్కాంచన కుండలమ్**
**కుంచితాధర విన్యస్త స్వవంశీమంజుల స్వనైః 131**
**జగత్త్రయం మోహయంతం మగ్నం ప్రేమసుధార్ణవే" – పద్మపురాణము.**

131) మూడు వంపులుగా నిలిచిన వాడును లలితమయిన నిర్మాణసారమయిన పదార్థములతో తయారయిన రూపముగలవాడును. ఒకవైపు వాల్చిన మెడతో అనంతకోటి మన్మథులను మించిన సౌందర్యము గలవాడును, ఎడమ బుజముమీద చెంపను ఆనించిన వాడును, బంగారు కుండలములు గలవాడును, ముడిచిన పెదవిపై ఆనించిన మురళినుంచి కమ్మని ధ్వనులు పుట్టించి ఆ గాన మాధుర్యంతో ప్రపంచమును ప్రేమసముద్రములో ముంచినవాడును, అయిన కృష్ణుని చూచెను.

## వివరణము :

1. పింఛము : మధ్య ఈన తెల్లగా సాగియున్నది. ప్రక్కన సిరలవంటి ఈనలు. వాటి "నూగు" లేత ఎరుపుగా, ఆకుపచ్చగా కనబడును. శీర్షభాగము మధ్యలో ఒకరకమయిన చిలుకపచ్చన. దానిమధ్యలో నీలము. దానిక్రింద 'ద'వలె చీలిన ఆకారము. మొత్తము వృత్తము 'దీపకళిక' వలె నుండును. ఈ కన్ను "కన్నయ్య" తత్వమును సూచించును.

## సమన్వయము :

1) అశ్వత్థపత్రమువలె, మన "వీపు"వలె, మధ్య కాలువవంటి, వెన్నుబద్దవంటి ఈనె. చుట్టు నాడులవలె ఎముకలవలె ప్రక్కలకు వ్యాపించిన సిరలు–

**"రశ్మయ స్తస్య సంతతాః"**

**2) "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా"**

అన్నట్లు 'ఈన' మెఱుపుతీగవలె 'నూగు' నీలమేఘమువలె నున్నది.

**3) "నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా"** అన్నట్లు 'ఈనె' సుషుమ్నవలె సన్నగా నున్నది. మధ్యలో 'పీత' వర్ణవృత్తము గలిగియున్నది.

**4) "తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"**

దాని 'శిఖ' అనగా అగ్రభాగము. ఈన చివఱభాగము. దీనిమధ్యలో 'పరమాత్మ' ఉండవలెను. నెమలికన్ను పైన 'కన్ను' వలె ఉన్న 'వృత్తము' బిందువు గదా. బిందువు భగవంతునకు బ్రహ్మరంధ్రమునకు ప్రతీక. బిందువు నీలవర్ణము. అది భగవంతుని నీలవర్ణమునకు ఆకాశతత్వమునకు గంభీరతత్వమునకు అనంతత్వమునకు గుర్తు.

**"విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం"**

దానిచుట్టూ కనబడు పీతవర్ణము పీతాంబరత్వమునకు గుర్తు. పైగా ఆ వృత్తము రంగునుబట్టి ఆకారమునుబట్టి 'అగ్నిశిఖ'వలె వెలుగుచుండును. కనుక–

**"తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితా"**

మొత్తము నెమలికన్ను 'మెఱ మెఱ' మెఱయుచుండును. కనుక "అది, దాని 'ఈన' దాని రెమ్మలు రెమ్మల నూగు" అన్ని కాంతివంతములు కనుక మంత్రపుష్పమునందు చెప్పిన "సుషుమ్నా నాడి, దానియందున్న పరమాత్మ" తత్వమును చక్కగా సూచించును.

ఇక "వృత్తము" క్రిందవైపు రెండుగా చీలియుండుట అనగా 'బిందురూప పరమాత్మ' తన ఏకత్వ స్థితినుండి రెండు అనే స్థితికి వచ్చినందుకు సంకేతము. సృష్టి అథోముఖము కనుక 'చీలిక' క్రిందవైపు ఏర్పడినది. "కృష్ణుడు, ద్విభుజుడు, రాధాకృష్ణులు జంట" అను విషయములకు ఇది సంకేతము. ఇప్పుడు చుట్టు ఉన్న రెమ్మలు గోపికలు గోవులు గోపకులు అని భావించినచో "నెమలికన్ను" పూర్తిగా కృష్ణతత్వమునకు సరిపోవును.

చుట్టూ ఉన్న ఆకుపచ్చ రంగుగూడా శక్తికి సూచనయే. "నాకు తోచినమాట" అను గ్రంథములో మా గురువుగారు ఉదహరించినట్లు దేవీధ్యానములు రెండు విధములుగా నుండును.

**1) "ఉత్తిష్ట పురుషి హేమప్రఖ్యాం"** – అని హేమరూపముగా ధ్యానము చేసినచో "సంసారభయ నివృత్తి" కలుగును.

2) "నవదూర్వాసదృశీం" – అని 'గరిక' రంగుగా ధ్యానించినచో లోకములోని భయములను పోగొట్టును. కనుకనే దేవిని 'దూర్వ'గా ధ్యానించుటయు గలదు.

**"సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా**
**సర్వం హరతు మే పాపం దూర్వా దుఃస్వప్ననాశినీ"** **132**

"నెమలి యీక"లోని "రెమ్మలకు గరికపోచలకు" సామ్యము స్పష్టమేగదా. కనుక ప్రకృతికి, సృష్టికి ఈ సస్యశ్యామలత్వము ప్రతీకగా తీసికొనవచ్చును. ఇదిగాక నెమలి ఈకలలో ఉన్న రంగుల వైవిధ్యము గాయత్రికి,

---

132) సహస్రముకన్న మించిన వ్యాప్తి కలది 100 మూలములు అంకురములు గలది, దుస్స్వప్నమును సంసారమును పోగొట్టునది అయిన గరిక నా పాపమును పోగొట్టుగాక!

సూర్యకిరణములకు సంకేతము. కనుక త్రిమూర్తి స్వరూపుడైన సూర్యునకు సూర్యమండల స్థితుడయిన భగవంతునకు నెమలికన్ను సంకేతము. ఇదిగాక; అక్షిపురుషోపాసనకలదు. అనగా దక్షిణనేత్రమందు మనకు ప్రత్యక్షమగు 'చైతన్యము'ను ప్రత్యగాత్మగా ఉపాసన చేయుట ఉపనిషత్తులలో గలదు. అటువంటి 'అక్షిపురుష'ని ఆలయమయిన కంటిని ఇది సూచింపవచ్చును. రెమ్మలు రెప్పవెంట్రుకలకు మధ్య వృత్తము కనుగ్రుడ్డుకు పోలిక కావచ్చును.

దీనిపై ఒక సందేహము కలుగగలదు. ఇంత ఆలోచనతో నెమలికన్ను నిర్మాణము సాగినదా? కాని 'శివలింగ పుష్పముల'ను హనుమంత బీర "ఆకులను చూచిన వారికి" మానవదేహము మొదలగు సమస్త ప్రాణి శరీర నిర్మాణమును చూచినవారికి ఇది అసంభవమనిపించదు. ఏమయినను 'సామ్యము' ఉన్నది గనుక 'సంకేతించుట'లో దోషము లేదుగదా. కృష్ణుడు 'పింఛధారి' అయ్యెను. ఇదిగాక ఐంద్రజాలికులు తమ "గారడీ"కి 'నెమలి పింఛముల'ను వాడెదరు. ఇది పూర్వాచారము. భగవంతుడు 'యోగమాయా' వతారము గనుక అందుకు గుర్తుగా 'పింఛధారి' అయ్యెను. ఇంద్రుడు, నెమలికి ఇచ్చిన వరమే ఇచ్చట పింఛములకు కారణముగదా. కనుక అది కంటికి ప్రతిరూపము.

'కర్ణికారము' అనగా గోగుపువ్వు. ఇది పచ్చదనమునకు గుర్తు. ఇదియును నెమలికన్నులోని పచ్చదనము వలెనే యూహింపదగును. సంసారభయ నివర్తకము సంసార ప్రవర్తనము అయిన స్థితిద్వయమునకు ఇవి సూచనలు. **ఇది అంతయు నా ఊహామృతము.**

2) బెత్తము – వెన్ను.

3) వేణువు – నాదము – అధరామృతము. ఈ రెండింటిని కల్పి చర్చింపవలయును. పద్మపురాణములో వేణువు పేరు 'సమ్మోహినీ' అని చెప్పబడినది. దాని నాదము 'పంచమము'గా నుండును.

**"సమ్మోహిన్యాఖ్యయా వంశ్యా పంచమారుణచిత్రయా"** పోతనగారు "షడ్జధ్వనికి మర్మసరణిపూజ" అన్నారు. **133**

133) పంచమ స్వరముతో నిండిన సమ్మోహిని అను వేణువుతో కూడినవాడు.

ఇచ్చట కొంత లోతుగా ఆలోచింపవలయును. మూలాధారాత్తు సహస్రారము వఱకు ఉన్న బ్రహ్మదండమే 'వేణువు' ఈ వేణువు రుద్రుని రూపము అని కృష్ణోపనిషత్తు. చూ॥

**"వేణుస్తు భగవాన్రుద్రః యష్టికా కమలాసనః"**

దీనినిబట్టి రుద్రుడు అనగా శరీరములో రుద్రగ్రంధి ప్రాంతము కృష్ణునిచేతి వేణుభాగము అని చెప్పవలెను. రుద్రగ్రంధి ఆజ్ఞాచక్ర ప్రాంతమున నుండును. ఈ చక్రము భ్రూమధ్య ప్రాంతమున నుండును. శివధనుస్సు ఇట్టిదే.

**"ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ"**

**- లలితా సహస్రనామస్తోత్రం**

(అందువలననే 'వేణునాదము' యోగక్రమములో సప్తమము)

రుద్ర=రోదనము చేసినవాడు.

**"సోరోదీత్ తద్రుద్రస్య రుద్రత్వం"**

రోదనం అనేది ధ్వని, అది పుట్టబోయే 'రోదసి'. విశుద్ధచక్రము కంఠములో ఉండును. ఆ చక్రతత్వము ఆకాశము. అది నాదమునకు స్థానము. కనుక 'విశుద్ధ ఆజ్ఞాచక్రముల' ప్రాంతములోని 'సుషుమ్న' కృష్ణవేణువు.

నాదము చేయని వేణువు 'బెత్తము'అని చెప్పవచ్చును. మూలాధార స్వాధిష్ఠానములు తమోమయములు. నాదము వినబడదు. కనుక ఆ ప్రాంతపు 'వేణువు' 'యష్టిక' అనగా కఱ్ఱ. అది పశువులను తోలుటకు తరువాత కురుక్షేత్రములలో గుఱ్ఱములు తోలుటకు, వాటిని శిక్షించుటకు ఉపయోగపడును. ఈ ప్రాంతమున బ్రహ్మగ్రంధి యుండును. కనుకనే-

"యష్టికా కమలాసనః" అని ఆ 'బెత్తము= బ్రహ్మ' అని కృష్ణోపనిషత్తు సూచన. జీవుని చేతిలో ఇదియే మూలాధారస్వాధిష్ఠాన పర్యంత వ్యాప్తమయిన గాండీవము కావచ్చును. అట్లే మూలాధారము దక్షిణ దిక్కు. అగస్త్యదత్తమయిన రామకోదండము గూడా అదే కావచ్చును. ఇక-

**నాదము :**

వేణువు ''సమ్మోహిని'' మామూలు పిల్లవగ్రోవి కాదు- అని స్పష్టమగుచున్నది. కనుక నాదముగూడా మామూలు నాదము కాదు. అది సుషుమ్నలో ప్రాణవాయువు ప్రయాణించునపుడు జరుగునాదము. యోగిజనులకు అనుభవవేద్యము. ఈ నాదముగూర్చి చేసిన వర్ణనలు కృష్ణుని వేణునాదమునకు సరిపోవుచున్నవి. కృష్ణమురళీరవము 'ఓంకారమని, క్లీంకారమని' ప్రమాణములు గలవు. వానిని పరిశీలించెదము.

**"నాభే రూర్ధ్వం హృదిస్థానాత్ మారుతః ప్రాణసంజ్ఞకః**
**నదతి బ్రహ్మరంధ్రాంతే తేన నాదః ప్రకీర్తితః" 134**

**"ఆకాశాగ్నేః మరుజ్జాతః నాభేః ఊర్ధ్వం సముచ్చరన్**
**ముఖేభివ్యక్తి మాపన్నో య స్స నాదః ప్రకీర్తితః" 135**

అనగా నాభిపైన దహరాకాశమునందు పుట్టిన ప్రాణవాయువు ముఖము నందు వ్యక్తమగును. అదే యోగికి బ్రహ్మరంధ్రమున ధ్వనించును.

ఈనాదము భ్రూమధ్యమున నున్న మనస్సును లయము చేయును. చూ॥

**"ప్రదీప కళికాకారం మనోత్రాస్తేతినిర్మలమ్" - చక్రకౌముది. 136**

(అత్ర= ఆజ్ఞాచక్రమునందు)

**"నాదరూపం భ్రువోర్మధ్యే మనసో మండలం విదుః" 137**
**- యోగశిఖోపనిషత్తు.**

నాద మనస్సులకు అంత అవినాభావ సంబంధము ఉన్నది. కనుకనే నాదమునందు మనస్సు లయమగును. చూ॥

---

134) నాభికి పైన ప్రాణమనే గాలి హృదయమునుండి బయలుదేరి బ్రహ్మరంధ్రము చివరలో సవ్వడి చేస్తుంది గనుక దానిని నాదము అందురు.

135) ఆకాశాగ్ని నుండి పుట్టిన గాలి నాభికిపైన నడచుచు ముఖమువద్ద బయటపడును దీనిని నాదమందురు.

136) దీపకళికవలె అత్యంత నిర్మలమయిన మనస్సు ఇచ్చట ఉండును.

137) భ్రూమధ్యమున నాదరూపమయిన మనస్సుయొక్క మండలముండును.

**నాదోంతరంగ సారంగబంధనే వాగురాయతే**
**అంతరంగ కురంగస్య వధే వ్యాధాయితోపిచ**
**మకరందం పిబన్ భృంగో గంధం నాపేక్షతే యధా 138**
**నాదాసక్తం తధాచిత్తం విషయాన్నహికాంక్షతే" - హఠయోగప్రదీపిక.**

అనగా నాదము మనస్సును బంధించి కరగించును. తద్వారా నాదములో లీనమయిన వానికి మనస్సు లేదు. కనుక విషయ కాంక్షలు నశించును. కనుకనే గోపికలు పతి పుత్ర సోదరాదులను విడిచి వచ్చిరి.

**"యత్రనాదే యధా చిత్తం రమతే యోగినో భృశం**
**విస్తృతం సకలం గుహ్యం నాదేనసహ శామ్యతి" - శివసంహిత. 139**

నాదమునందు మనస్సు కరగును. అంతట అన్ని విస్మరించి సాధకుడు వాని చిత్తము నాదముతో సహా శమించును.

తరువాత విషయము 'సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు'లో చెప్పబడినది.

**"మహాశూన్యం తతోయాతి సర్వసిద్ధి సమాశ్రయమ్**
**నిష్పత్తౌ వైణవః శబ్దః క్వణతీతి క్వణోభవేత్"**

అనగా నాదము మహాశూన్యము నందు (సహస్రారము) లయమగును. ఆ సందర్భమున 'వేణునాదము' 'క్వణ' అని వినిపించును. ఈ వేణునాదము ఓంకారమని చెప్పుచున్నారు. ఆజ్ఞాచక్రమువద్ద నాదమండలములో ఓంకారమున్నట్లు చక్రకౌముది చెప్పుచున్నది.

**"లింగం తత్కర్ణికాంతస్థం త్రికోణ మతిసుందరమ్**
**సౌదామినీ సమం తస్మిన్ వేదాదిం సంస్మరేత్ బుధః" 140**

---

138) మనస్సనే లేడిని బంధించే వల నాదము. మనస్సనే లేడిని చంపే వేటగాడు గూడా నాదమే. మకరందము త్రాగే తుమ్మెద వాసన కోసం పోనట్లు నాదమునందు అతికిన మనస్సు ఇక విషయాలను కోరదు.

139) ఏ నాదమునందు యోగియొక్క చిత్తము మిక్కిలిగా నిమగ్నమగునో ఆనాదమునందే అంతటి విస్తృతమయిన జగత్తు గోప్యంగా లీనమగును.

140) ఆపద్మముయొక్క గద్దెలో ఒకలింగము, అతిమనోహరమయిన త్రికోణము ఉండును. అది మెరుపుతీగవలె ఉండును. దానిమధ్యన వేదాది అయిన ఓంకారమును స్మరింపవలెను.

'వేదాది' అనగా వేదములకు ఆదిబీజమయిన ఓంకారము. అయితే కృష్ణబీజము 'క్లీం కారము' కదా. ఆయన నాదము 'ఓం' కారమగుట ఎట్లు కుదురును? అందుకు "గోపాలోత్తరతాపిని"లో సమన్వయము గలదు.

**"క్లీం మోంకారస్యైకత్వం వదంతి బ్రహ్మనాదినః"**

అనగా 'క్లీం, ఓం' ఈ రెండును ఒకటేనని బ్రహ్మవేత్తలు భావింతురట. ఇవియేగాక పంచ ప్రణవములు గలవు. అందులో 'క్లీం' ఉన్నది. నాదమునకు ఇవి ప్రతీకములే. వీని చివఱ వినబడు 'అర్ధమాత్రాస్వరము' ప్రాణనాదమే. ఆత్మరీత్యా దేహధారులందఱు చివఱకు ''ఏకతత్త్వము' అయినట్లు ఈబీజాక్షరములన్నియు చివఱకు 'ప్రాణము'నందు ఏకమగును. కనుక 'క్లీం' ప్రణవమగుటకు అవకాశము గలదు. కనుకనే కృష్ణకర్ణామృతములో –

**"ఓంకారార్థ ముదీరయన్ విజయతే వంశీనినాదః శిశోః" 141**

వేణువు రుద్రుడు. కనుక వేణునాదము రుద్రశక్తి దేవినాదమయి. నాదరూప.

**"నారాయణీ నాదరూపా నామరూప వివర్జితా"**

**– లలితాసహస్రం**

రుద్రనాదము కనుక కాముని దహించునే గాని వృద్ధి నొందింపదు.

**"జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్"**

ఈ రుద్రనాదము వలన మనోనాశము జరిగి వైరాగ్యము స్వస్వరూప జ్ఞానము లేదా భాగవత జ్ఞానము కలుగును. గోపికలకు జరిగినది అదే. నాదము శక్తిమయము. నాదాంతము బ్రహ్మమయము. కృష్ణుడు నాదమునకు అనగా మాయకు వశము గాడు. కనుకనే పోతన "స్వవశుండై" అని పలికెను. పైగా ఇట్లనెను –

**"బ్రహ్మగాంధర్వగీతంబు పఱగజేసె
చతురనటమూర్తి గోపాలచక్రవర్తి"**

---

141) శిశువయిన కృష్ణునియొక్క వంశీరవము ఓంకారమును వివరించుచు సాగుచున్నది.

## అధరామృతము :

రాసలీలలకు శృంగారపు రంగుపూసిన విషయములలో ఇది ఒకటి. ఇది ఇచ్చట వివరింపబడును. వేణునాదము అధరామృతము – ఒక్కటే గనుక ఆ విషయముకూడ వివరింపబడును.

'కృష్ణ' అనగా భౌతికానందములను బ్రహ్మానందములో లీనము చేయువాడు అని అర్థము చెప్పబడినది. మూడు పురుషార్థములు భౌతికములు. అతీతమయిన మోక్షము భౌతికముకాదు. మోక్షము శాశ్వతానందము. మిగిలిన మూడు పురుషార్థములు తాత్కాలికానందమును చేకూర్చును. అట్టి మోక్షము నిచ్చునది 'బ్రహ్మ'జ్ఞానము. బ్రహ్మకు శబ్దరూపము ప్రణవము. ఆ ప్రణవనాదము వేణునాదము ఒకటేనని పైన తెలుపబడినది.

1. అ+ధర+అమృతము అనగా ధరాసంబంధము కాని / 'మృతము' కాని ఆనందము.

2. అధర= క్రిందికి దిగివచ్చిన (గంగా ప్రవాహమువలె) అమృతము= శాశ్వతానందము.

3. అమృతం – మృతికి వ్యతిరేకము అనగా 'ప్రాణము' క్రిందికి దిగి వచ్చిన ప్రాణనాదము.

4. ఇంకా అనేక అర్థములు చెప్పవచ్చును. ఏదయినను నాదమునకు అన్వయింపవలెను. అది 'కవి' తాత్పర్యము. చూ॥

**సురతవర్ధనం శోకనాశనమ్**
**స్వరితవేణునా సుష్ఠుచుంబితమ్**
**ఇతరరాగ విస్మారణం నృణాం**
**వితర వీర నః తే అధరామృతమ్"** **భాగ. 10 స్కం. 142**

ఇది గోపికలు అధరామృతమును వర్ణించిన ఘట్టము. ఆ వేణువు స్వరితము. అనగా మూడవ స్వరము. సమాన స్వరము. ఇది రుద్రగ్రంథికి,

142) వీరుడా! నీ అధరామృతము అనగా పెదవినుంచిసాగిన మురళీరవము సురతమును పెంచును. శోకమును పోగొట్టును. స్వరముగల, స్వరితస్వరూపమయిన వేణువు నుండి వెడలినది. మనుష్యులకున్న ఇతర ఆసక్తులను మరపించునది.

సర్వసమభావనకు ప్రతీక. ఈ వేణువుకు లభించినది అధరామృతము. ఇది సురతమును పెంచును. సురతము అనగా ప్రథమ ప్రకరణములో భావించినట్లు దివ్యసమాధి. శివశక్తియోగము. దానికి నాదము తోడ్పడును. అది ఇతర రాగములను మఱపించునట నిజమే. కనుకనే–

**"నాదాసక్తం తథాచిత్తం విషయాన్ నహికాంక్షతి"** **143**

అని హఠయోగప్రదీపిక చెప్పినది గదా! మనుష్యులకు రాగ పరిహారకము. అంతేగాని కాముకులకు అని చెప్పలేదు. కనుక ఇది అధరజలము / లాలాద్రవము కాదు. కేవలము నాదమే. కనుకనే పోతనయు నాదముగనే చెప్పెను.

**"మధురాధరామృతముచే వంశంబు పూరించుచున్" – భాగవతం**

ఇచ్చట మురళిలోనికి లాలాజలము దూరినదని చెప్పలేము కదా! ఎవరయినను వేణునాదమునే అధరామృతముగా దర్శించిరనుట స్పష్టము.

**వనమాల :**

రాసలీలలో మాలాధారియై పరమాత్మ వనములో సంచరించినట్లు చాలాచోట్ల చెప్పబడినది.

**"మాలాం బిభ్రద్వైజయంతీం వ్యచరత్స వనాద్వనమ్" – భాగవతం.**

**"మౌళిపింఛము కంఠదామమును మెఱయ" – పోతన**

ఈ "వనమాల" గురించి వివిధ గ్రంథములలో వివరణలు లభించును.

విష్ణుపురాణమునందు;

**"పంచరూపా తు యామాలా వైజయంతీ గదాభృతా**
**సా భూతహేతుసంఘాతా భూతమాలా భవేద్ద్విజ"**

వనమాల "పంచభూతముల మాలిక" చెప్పబడినది.

"విష్ణురహస్యము" నందు మఱికొంచెము వివరముగ చెప్పబడినది.

---

143) నాదాసక్తి పొందిన చిత్తము విషయములను కోరదుగదా!

**"పృధివ్యాం నీలసంజ్ఞానం అబ్ధ్యో ముక్తాఫలానిచ**
**తేజసః కౌస్తుభో జాతః వాయోః వైదూర్య సంజ్ఞకః**
**పుష్కరాత్పుష్యరాగస్తు వైజయంత్యా హరేరిమే"**

అనగా వైజయంతి పంచరత్న మాలికాకారముగాను, పంచరత్నములు పంచభూతములకు సంకేతముగాను చెప్పబడినవి.

| | | |
|---|---|---|
| భూమి | - | నీలము |
| జలము | - | ముత్యాలు |
| అగ్ని | - | కౌస్తుభము |
| వాయువు | - | వైదూర్యము |
| ఆకాశము | - | పుష్యరాగము |

పంచభూతాత్మకమయిన 'వనమాల' భగవంతుని "ప్రకృతి"యే. ఆయన మాయ త్రిగుణాత్మక శక్తియే గదా. కనుకనే-

**"స్వాం మాయాం వనమాలాఖ్యాం నానాగుణమయీం దధత్"**
**- భాగ. 12 స్క. 12 అధ్యా.**

అని భాగవతము మాయ=వనమాల అని, అది గుణమయమయిన 'మాయ' అని చెప్పినది. నిర్గుణ బ్రహ్మచుట్టు త్రిగుణాత్మక మాయ విస్తరించినట్లు కృష్ణుని కంఠముచుట్టు వనమాల, కృష్ణునిచుట్టు గోపికలు, బిందువుచుట్టూ త్రికోణమువలె తోచుచున్నది. కనుకనే

గోపాలోత్తరతాపినిలో

**"కంఠం తు నిర్గుణం ప్రోక్తం మాల్యతే ఆద్యయాజయా"** 144

అనిచెప్పిరి. అనగా 'వనమాల' ఆదిశక్తి అయిన 'అజ' అని అర్థము. ఈ 'అజ'లోహితశుక్ల కృష్ణవర్ణములని పూర్వము చెప్పబడినది.

సూర్యుడే కృష్ణుడనుకొన్నచో లేదా సూర్యాంతర్గత నారాయణుడను కొన్నచో ఈ పంచభూతాత్మక, పంచవర్ణాత్మక వనమాల "గాయత్రి" యని చెప్పవచ్చును. ఎందుకనగా-

---

144) కంఠం నిర్గుణ బ్రహ్మకు సంకేతం. దానినిచుట్టి ఉన్న వనమాల ఆదిమాయాశక్తి.

1) ఆమె ప్రకృతి రూపిణి.

2) తత్త్వస్వరూపురాలు = తత్వార్థ వర్ణాత్మికా.

3) 5 రంగులు గలది.

**త్రిభంగిగా నిలిచియుండుట :**

పద్మపురాణము కృష్ణుని వర్ణించుచు–

**"త్రిభంగం లలితాశేష నిర్మాణసారనిర్మితం"**

అని చెప్పినది. త్రిభంగం అనగా మూడు 'విరుపులు' గలవాడు. పోతనగారు గూడా–

**"డాకాలిమీద నడ్డము సాచి నిల్పినపదనఖద్యుతి భూమి ప్రబ్బికొనగ"**

అని వర్ణించిరి. "మెడ వంపు, నడుము వంపు, కాలిమెలిక" మూడు వంపులు. దీనినే 'వ్యత్యస్త పాదారవిందముల'ని వర్ణింతురు.

ఈ మూడు వంపులు మూడులోకములను మూడు గ్రంథుల స్థానములు గల దేహమును, సూచించును. ఈ 'మెలికలు' పాము మెలికలను సూచించును. సుషుమ్నకు అతికియున్న 'ఇడాపింగళల' దృశ్యము కాలిమెలికలను పోలుచున్నది. నాగేంద్రుని శిలాప్రతిమలు రెండు పాములు పెనవేసికొనినట్లు ఉండుట సహజమే గదా. ఈ కాళ్ళు వాటిని జ్ఞప్తికి తెచ్చుచున్నవి. ఇది సంతానదాయకమయిన నాగేంద్రముద్రగా భావింపవచ్చును. అనగా మనము గమనించుచు వచ్చిన 'సృష్టిసంకేతము' ఇందును కన్పట్టుచున్నది. ఇది ఒక 'ఊహగా' భావింపవచ్చును. దీని విషయమై గ్రంథసాక్ష్యము లభింపలేదు. బుద్ధిమంతులు గ్రంథాన్వేషణ చేసినచో లభింపవచ్చును.

ప్రణవము నందలి మూడు స్థితులుగూడా ఇందు సూచింపబడవచ్చును. సృష్టికి గడపవంటిది కృష్ణతత్వము. గడపనుంచి లోనికి పోయినచో అంతరంగ లభ్యమయిన ఆత్మానందము. బయటకు వచ్చినచో శక్తివిలాసమయిన విశ్వవిహారము. ఆవరణములోనికివెళ్ళి దైవదర్శనమా? విక్షేపమునందు విహరించి "నారీకేళీ"య మయిన ఆనందమా! అనునది మన నిర్ణయముపై ఆధారపడినది.

# దశమ పింఛము

## గోపికలు - వారి కామము

ఏదియేమయినను గోపికల మనస్సులు భగవంతునియందు లగ్నమయినవి. అది బాహ్యార్థమున కామరూపముగా భక్తిగా కనబడుచున్నది. అంతరార్థమున ప్రకృతి సహజమయిన 'భగవత్పరత్వము'గా యోగసాధ్యము జ్ఞానసాధ్యము అయిన ప్రపత్తిగాను కన్పట్టుచ్నుది. కనుక దీనిని తుచ్ఛశారీరక కామమని చెప్పుట అనాలోచితము. అసలు "కామము" అనగా 'కోరిక'. రతి అనగా ఆసక్తి. వీటికి నింద్యమయిన అర్థములు వ్యవహారములో వచ్చినవి. శాస్త్రములలో అట్లుకాదు.

ఈ కామములు మూడు విధములు.

1) మదనుడు, 2) చిక్లీతుడు, 3) దమనుడు.

ఇందు "మదనుడు" అనగా - మన మనస్సులో అన్నవికారముగా పుట్టే అన్ని రకముల కోరికలు. చూ॥

**"అబన్నవికృతౌ చిత్తే జాతః కామో హి చిత్తజః" 145**

**- సూక్తార్థ సంగ్రహము**

ఇది మూలాధారములోనున్న 'కందర్ప' వాయువు కావచ్చు. "శ్రీరత్న చింతామణి"లో-

**"కందర్పో నామ వాయుః నివసతి సతతం తస్యమధ్యేసమంతాత్**
**జీవేశో బంధుజీవప్రకర మభిహసన్ కోటిసూర్య ప్రకాశః" 146**

తరువాత వాడు 'చిక్లీతుడు' ఈయన దేవీతనయుడు. అమ్మవారి కటాక్ష వీక్షణముతో పుట్టినవాడు. వినాయకుడు ఇట్టివాడే. పైగా "లక్ష్మీతనయుడు" అని ఒక కథ.

**"శ్రీదేవ్యాః తనయో జజ్ఞే చిక్లీతో నామ మన్మథః" - సూక్తార్థసంగ్రహః**

---

145) జలము, అన్నమువలన తయారయిన మనస్సునందు పుట్టిన కామము చిత్తజము.
146) కందర్పమను పేరుగల వాయువు మూలాధారము వద్ద నుండును. దానిమధ్యన మంకెన పుష్పమును మించిన ఎర్రని కాంతితో జీవుడుండును.

**"హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవనౌషధిః" 147**

**- ల॥ స॥ నా॥**

ఈయన మనకు ఉపాస్యుడు. 'చిక్లీత' శబ్దమునకు "క్లీం" బీజమునకు పోలిక చిత్రముగా కలియుచున్నది. శ్రీసూక్తములో ఈ చిక్లీతుని గూర్చి యున్నది.

**"ఆనందః కర్దమఃచైవ చిక్లీత ఇతి విశ్రుతాః**
**ఋషయః తే త్రయః పుత్రాః స్వయం శ్రీరేవ దేవతా" 148**

ఈ చిక్లీతుని తమ యింటికి రావలెనని స్వాగతించుట శ్రీసూక్త సమ్మతము.

**"ని, చిక్లీత, వసమేగృహే" - శ్రీసూక్తము.**

ఈ "చిక్లీతుడు" పురుషార్థత్రయమునకు కారకుడు. చూ॥

**"లక్ష్మ్యాః త్రివర్గరూపాయాః ప్రాప్తిః కామనిబంధనా**
**తస్మాత్ చిక్లీతనామానం లక్ష్మీపుత్రం సుదుర్జయమ్" 149**

**- సూక్తార్థసంగ్రహము**

కామేశ్వరీ మంత్రమునకు కాముడు ఒక ఋషి. ఆ సంగతి "ఋష యస్తే త్రయః పుత్రాః" అను వేదవాక్యము వలన స్పష్టమే గదా! సౌభాగ్య విద్యామంత్రమునకు "ఆనందుడు" ఒక ఋషి. "ఆనందభైరవుడు ఋషి." భైరవ సంప్రదాయములో పురుషులందఱు భైరవులు. స్త్రీలు అందఱు "భైరవీ" స్వరూపములు. కనుక ఆనందః - ఆనందభైరవః అని అర్థము.

ఈ చిక్లీతుడే ప్రద్యుమ్నుడు కావచ్చును. లక్ష్మీపుత్రుడు గనుక. పద్మపురాణములో కృష్ణ స్థాన వర్ణనలో -

---

147) శివుని కంటిమంటలో తగలబడిన మన్మథుని సంజీవింపజేసిన ఓషధీలత లలితాదేవి.

148) ఆనందుడు, కర్దముడు, చిక్లీతుడు అని ప్రసిద్ధులయిన ముగ్గురు ఋషులు శ్రీదేవికి పుత్రులు. ఆ శ్రీయే స్వయంగా దేవత.

149) ధర్మ, అర్థకామములను త్రివర్గ రూపమయిన లక్ష్మి లభించటానికి 'కాముడు' అవసరం. కనుక లక్ష్మీపుత్రుడు అజేయుడయిన "చిక్లీతుడు" అను కాముని సేవింపవలయును.

**"ప్రద్యుమ్నం చ రతిం దేవీం తత్రోపరి సుఖస్థితం**
**జగన్మోహన సౌందర్య సారశ్రేణీ రసాత్మకం" 150**

అని ప్రద్యుమ్నరతిదేవతల ఆవాహన చెప్పబడినది.

3) మూడవవాడు "దమనుడు." మదన "దమన"గా తిరుగబడినది. మదనుడు భస్మమయినచో పుట్టినవాడు దమనుడు. వీనివలన అందఱు అజ్ఞానులు అగుదురు. "మేరుతంత్రం"లో దమనుని ప్రార్థననుబట్టి యీ విషయము చెప్పవచ్చును.

**"కామ భస్మ సముద్భూత రవిపోష్య జలోద్భవ**
**ఋషి గంధర్వ దేవాది మోహనాయ నమోస్తుతే" 151**

కనుకనే భండుడు సర్వలోకమును విశుక్రముగా విషంగముగా చేసినవాడు అని చెప్పబడినది. భండుడు మన్మధభస్మ సంజాతుడు అని బ్రహ్మాండ పురాణము.

ఇందులోని చిక్లీతుడే గోపికల కాముడు. వారికి పురుషార్థములు అనుగ్రహించి వారి చిత్తవృత్తులను భగవంతునివైపు ప్రవర్తింపజేసినవాడు. కృష్ణబీజముగూడా కామబీజము / కామరాజబీజము. అందలి "క్లీ" అను భాగము 'చిక్లీతుడు' అను పురుషార్థ సాధకుడు. దానిపై 'ఈం' బీజము భగవంతుడు. మోక్షదాయకుడు.

ఈ= శక్తిబీజం కనుక శక్తియుతుడైన నాదస్వరూపుడైన కృష్ణుడు=ఈం. అనగా ఈ=రాధ, ఏ=కృష్ణుడు.

## గోపికలు - వారి భక్తి :

**వందే నందవ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః**
**యాసాం హరికథోద్గీతం పునాతి భవనత్రయమ్ ॥ 152**

---

150) జగన్మోహనమయిన సౌందర్య సారరూపమయిన రతిప్రద్యుమ్నుల జంటను అచ్చట భావింపవలయును.

151) మన్మధభస్మమున పుట్టినవాడా! సూర్యపోషణలోనున్న వాడా! జలమున ఉద్భవించినవాడా! ఋషులను, గంధర్వులను, దేవతలను అట్టివారిని మోహింపజేయు నీకు నమస్కారము

152) ఎవరు కీర్తించిన హరికథా రూపమయిన ఉద్గీతము ముల్లోకములను పవిత్రము చేయుచున్నదో అట్టి నందవ్రజ గోపికల పాదధూళికి నమస్కారము.

లోకపావనము, లోకాతీతమయిన వీరి 'భక్తి' శృంగార మిళితముగా ప్రదర్శింపబడుటచే విమర్శలకు, సందేహాలకు తావిచ్చినది. అంతరార్థ పరముగా గోపికలకు భగవంతునకు నిత్యసంబంధము అద్వైతము. మఱి ద్వైతభావన శృంగారరూపభక్తి ఎందుకు?

అద్వైతమున్నప్పటికి అది యథార్థతత్త్వమయినను శరీరభేదమున్నంత వఱకు 'భక్తియోగము' ఉపాదేయము. భావాద్వైతమున్నను క్రియలో ద్వైతము అవసరము కదా. ఒక ఆచార్యుడు చెప్పినట్లు మనము భగవంతుడు ఏకమేయైనను, మనము భగవంతుని అంశలమేకాని, భగవంతుడు మన 'అంశ'గా చెప్పలేము. తరంగమునకు సముద్రమునకు అభేదము అందఱకు తెలిసినదే. కాని సముద్రముయొక్క తరంగము అనుట సహజము. కాని "తరంగముయొక్క సముద్రము" అనము కదా! చూ॥

**"సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీనః త్వమ్**
**సాముద్రో హి తరంగః క్వచన సముద్రో న తారంగః"**

కనుక 'భక్తియోగము' అద్వైతభావన యందైనను ఆచరణీయతను కోల్పోవదు. పైగా అద్వైతభావనానంతరము సాగు భక్తియోగము ద్వైతమే అయినను, అద్వైతముకన్న సుందరతరము. మోక్షము అజ్ఞాతము. భక్తి జ్ఞాతము. నవరసభరితము. చూ॥

**"ద్వైతం బోధాయ మోహాత్ ప్రాక్**
**ప్రాప్తే బోధే మనీషయా**
**భక్త్యర్థం కల్పితం ద్వైతం**
**అద్వైతా దపి సుందరమ్" - (కరపాత్రజీ స్వామిచే ఉదాహృతము)**

అందువలననే జ్ఞానులయినను 'భక్తిరహితులు' గాలేదు. ప్రహ్లాదుడే అందుకు ఉదాహరణము. శుకమహర్షియు అంతే. భక్తులకు భక్తియోగము మఱగిన తర్వాత మోక్షముగూడా వద్దనిపించునట. చూ॥

**"సాలోక్య సార్ష్టిసామీప్య సారూప్యైకత్వ మిత్యుత**
**దీయమానం నగృహ్ణాతి చనో మత్సేవనంవినా" - భాగ.**

అని కృష్ణుడే చెప్పెను.

అందువలననే ఒక భక్తుడు కాశీలోని విశ్వేశ్వరుని మందిర సోపానముల వద్ద సెలవు తీసికొనుచు ఇట్లనెను.

"ఓ సోపానములారా! నేటినుంచి మిమ్ము సేవించు భాగ్యము లేకుండా చేసే 'మోక్షము' అనే చీకటిలోనికి ప్రభువు నన్ను పంపుచున్నాడు" అని చూ॥

**"అద్యారాధనతోషితేన విభునా యుష్మత్సపర్యా సుఖా**
**లోకోచ్ఛేదిని మోక్షనామని మహామోహే నిలీయామహే"**

'శ్రీకృష్ణవిలాస' కావ్యములో 'సుకుమారు'డనే కవిగూడ-

**"నవాభ్రవర్ణం నలినాయతాక్షం**
**పీతాంబరం హారకిరీటినంత్వాం**
**వయం తు సేవేమహి వీక్షమాణాః**
**సాయుజ్య మన్విచ్ఛతి క స్సుఖార్థీ"** **153**

అని చెప్పెను. జగన్మోహనమయిన కల్యాణరూపమును దర్శించు ఆనందము తెలిసినవాడు ఎవడును సాయుజ్య మోక్షము కోరడట.

అటువంటివారే గోపికలు. వీరు పరమాత్మ సంగమును కోరివచ్చినవారు. ఇతర మోక్షము కోరలేదు. పరమాత్మయొక్క నిత్యసాన్నిహిత్యము- నిత్యసంగము కోరినవారు. కృష్ణుడు తగదని బెట్టుచేసిననువారు పట్టువదలలేదు. దేవుడే వారిమధ్యకు దిగివచ్చినాడు.

పరమాత్మ వేణుగానము ప్రారంభించిన వెంటనే వారు సర్వత్యాగము చేసి అనివార్య వేగముతో వెంటపడినారు. వీరిస్థితి శ్రీశంకరులు 'శివానందలహరి'లో చెప్పినట్లున్నది.

**"అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికాః**
**సాధ్వీనైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభం**

---

153) నీలమేఘసమానవర్ణుడు, పద్మవిశాలనేత్రుడు, పీతాంబరధారి, హారకిరీటధారి అయిన నిన్ను దర్శించుచు మేము సేవిస్తాము. సుఖవాంఛ గలిగిన భక్తుడెవడయినా సాయుజ్యమును కలిసి లీనమయిపోవుముక్తిని కోరడు.

**ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం**
**చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా "సా భక్తి రిత్యుచ్యతే" 154**

అనగా ఉరుము వినపడగనే ఊడుప గింజలు తమచెట్టును చేరినట్లు, సూదులు అయస్కాంతమును చేరినట్లు, ఇచ్చట గోపికలు వేణునాదము విన్నంతనే కృష్ణుని చేరిరి.

కనుక వీరిది 'శరణాగతి' ప్రపత్తి.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః".**





154) ఉరుము వలన సచేతనమయిన ఊడుప గింజలు చెడ్డును చేరినట్లు సూదులు అయస్కాంతమును చేరినట్లు, పతివ్రత తనభర్తవద్దకు వెళ్లినట్లు తీగ చెట్టుమీదకు ప్రాకినట్లు, నది సముద్రుని చేరినట్లు, మనస్సు పశుపతి పాదారవిందమునుచేరి నిలుచునో అదీ "భక్తి" అనబడును.

# ఏకాదశ పింఛము

## గోపకన్యా వస్త్రాపహరణం

గోపకులను గోవులను భగవంతుడు తన లీలావిలాసములతో నిత్య సాహచర్యముతో ఆనందపఱచుచున్నాడు. వారి బుద్ధి వృత్తులవంటివారు గోపికలు. గోవులకు గోపికులకు నడుమ వారి పాత్ర నిలిచియున్నది. ఇంతవఱకు భగవంతుడు వారు తయారుచేసి దాచిన 'నవనీతములను, దధిక్షీరములను' అల్లరిగా అల్లారుముద్దుగా ఆరగించియున్నాడు. అట్టివారిని ఉద్ధరింపదలచినవాడై పరమాత్మ వారి ప్రవృత్తులను నివృత్తివైపు మరలించుటకు మొదట ఒక 'శరదృతువు'లో అపూర్వ వేణుగానము చేసెను. ఆ గానములో ఆబాలగోపాలము ఆనందపరవశులైరి. గోవులు మేత ఆపినవి. దూడలు పాలుత్రాగుట మాని అట్లే నిలబడినవి. నదులు ప్రవహించుట ఒక్క క్షణమాపినవి. ఇట్టి అత్యంత వశీకరణ మంత్రమయిన "వంశీ"నాద 'క్లీం' కార"మునకు సంపూర్ణముగా లొంగి పరవశించి పరితపించినవారు గోపికలు. కేవలము వారే ఇంతగా ఆ కృష్టలగుటకు కర్మఫలప్రదాత అగు భగవంతుని ఇచ్ఛయే కారణము.

ప్రథమ వేణుగానము వినిన తరువాత 'గోప కుమారికలు' కాత్యాయనీ వ్రతము చేసిరి. ఈవ్రతము 'హేమంత' ఋతువులో సాగినది. ఇందే ప్రథమ వివాదాస్పదమయిన "వస్త్రాపహరణము" తారసపడును. దాని తత్త్వముగూడా చర్చించిన పిమ్మట "రాసలీల"కు హాజరు కాగలము.

**కాత్యాయనీ వ్రతము :**

**"హేమంతే ప్రథమే మాసి నందవ్రజకుమారికాః**
**చేరుః హవిష్యం భుంజానాః మాసం కాత్యాయనీవ్రతమ్" 155**

155) హేమంత ఋతువున మొదటి మాసమున (మార్గశిరం) నందవ్రజములోని బాలగోపికలు హవిష్యమయిన అన్నము తినుచు ఒక నెలపాటు కాత్యాయనీ వ్రతము చేసిరి.

వీరిని 'కుమారికలు' అన్నారు. రామకృష్ణులు ఈనాటికి పౌగండ వయస్సువారు.

**"తతశ్చ పోగండ వయస్సమాహితౌ**
**బభూవతుః తౌ పశుపాలసమ్మతౌ" - భా - 10.15.**

దీనినిగూర్చిన 'చర్చ' ఇంతకుముందు జరిగినది. సారాంశము ఏమనగా, రామకృష్ణులకన్న గోపబాలికలు చిన్నవయస్సుగలవారు అని చెప్పవచ్చును. కనుకనే "కృష్ణుడు, పతి" గావలెనని వారు కోరుట సంభవించినది. కనుక ఇందులో అనౌచిత్యము లేదు. 10 ఏండ్లలోపు వారు కుమారికలు. అయితే అంతటి చిన్నవారే అంతటి వ్రతము చేసిరా అని శంకింపగలవారికి ధ్రువుడు, ప్రహ్లాదుడు, దేవీభాగవతములోని సుదర్శనుడు సత్యవ్రతుడు, మార్కండేయుడు మొ॥ కథలు సమాధానము. ద్రౌపది, సీత అయోనిజలు, అగ్నికుండ సంజాతలు అనుట ఎంత హేతుబద్ధమో ఎంత సాభిప్రాయమో ఈ కథయును అంతటిదే. పైగా వీరు వ్రతపూర్వకముగా 'వ్యభిచారము' కోరిరి అని, దానినే భగవంతుడు రాసలీలలో తీర్చెను అనుటయు అంతే హేతువిరుద్ధము. ఇవి ఆధ్యాత్మిక కథలు. మనము ముందు అనుకొన్నట్లుగా, ఇవి అంతరార్థపరముగా సమన్వయము చేయకపోతే మనకే గతిలేదు.

వ్రతము చేసిన ఋతువు హేమంతము. మహర్షి ఈ ఋతువునే చెప్పవలసిన కారణము పరిశీలన చేయవలయును. పూర్వము చెప్పినట్లు ఈ కాలవిభాగము మన శరీరమునందే యున్నది.

**హేమంతాద్యాశ్చ ఋతవః షట్చక్రే క్రమశః స్థితాః" - చక్రకౌముది.**

ఈ ప్రకారము 'శరదృతువు' ఆజ్ఞాచక్రమున భ్రూమధ్యమున ఉండగా హేమంతఋతువు మూలాధారమున నున్నది.

**"సంవత్సరాత్మకం దేహం" - చక్రకౌముది.**
**"మాసానాం మార్గశీర్షోస్మి" - గీత.**

మూలాధారము సంకోచమునకు, అజ్ఞానమునకు కేంద్రము. కనుక అది హేమంత ఋతువు. జ్ఞానసూర్యుడు అజ్ఞాన నీహారముతో

యుద్ధముచేయు స్థితి. ఇచ్చట ఈ గౌరీవ్రతమును చేయువారు "నంద వ్రజకుమారికాః" వ్రజం=నాడీసమూహ రూపమయిన శరీరభాగము. అందులో 'కుమారికలు' అంటే అందఱికన్న చిన్నవారు అనిగదా అర్థము.

సృష్టి భగవంతుని నుంచి క్రిందకు దిగినది. ఆ వరుసలో "మూలాధారము" చివఱిది. కనుక ఇందలి నాడులు, రశ్మలు, ఇంద్రియ వృత్తులు తమపై చక్రములకు తరువాత పుట్టినవి. కనుక "నందవ్రజకుమారికాః" అనగా మూలాధారనాడులు మొదలగునవి అని సారాంశము. వీరు భుజించినది హవిష్యము. ఇది అన్నమయకోశమునకు సాధనకు సూచన. క్షారలవణ వర్జితమయిన అన్నము హవిష్యము. మూలాధారమునందున్న అగ్నియందు వ్రేల్చుటకు సిద్ధము చేసిన కామక్రోధాదిరహిత తటస్థభావనలు ఈ హవిష్యము. జఠర వైశ్వానరునకు సమర్పింపబడు వ్రతహవిస్సు. ఇట్టి విషయములను భావనోపనిషత్తు నందు చూడగలము.

ఉపాస్యదేవత 'కాత్యాయని'. ఈమె మూలాధారగత కుండలిని. భగవంతుని జేరదలచినవారికి ఈమెయే మార్గము. శరీరమును 'గ్రామము'గా భావించినచో ఈమె 'గ్రామదేవత' కాగలదు. రుక్మిణీదేవిగూడా కాత్యాయనినే ఉపాసించి యీమె ఆలయము వద్దనే భగవంతుని పొందినది గదా. కనుక మూలాధారములోని చిఱునాడులున్నియు కలిసి 'కుండలినీ' శక్తిని ఉపాసించినవి అని భావము.

**పూజా విధానము :**

> **"ఆప్లుత్యాంభసి కాలింద్యాః జలాంతే చోదితేరుణే**
> **కృత్వా ప్రతికృతిం దేవీం ఆనర్చుః నృపసైకతీమ్" 156**

**కాళిందీ నదినీటిలో స్నానము :**

పింగళానాడిని 'కాళింది' అనుట ప్రసిద్ధమే. ఈ రెంటికిని సూర్యుడు అధిష్ఠాన దేవత. సూర్యమార్గమును అర్చిరాది మార్గమందురు. ఇది

156) అరుణోదయముకాగానే యమునా జలములో స్నానముచేసి దేవీచిత్రమును ఇసుకతో తయారుచేసి పూజించిరి.

మోక్షమార్గము. నీరు నలుపు. అప్పటికి వారియందున్న తమోగుణమునకు సూచన.

ఈ జలము 'స్వాధిష్ఠానచక్రము'. మూలాధారస్వాధిష్ఠానములు రెండును చీకటి / అజ్ఞానచక్రములు. అది ప్రాణతత్త్వము. ప్రాణమయకోశానికి సూచన. అనగా అన్నమయ ప్రాణమయకోశముల సాధన జరిపినట్లు వ్యంగ్యముగా తెలియుచున్నది.

సూర్యుడు జలాంతమున ఉదయించుట. జలము= స్వాధిష్టానచక్రము అనుకొనగా దాని అంతము అనగా చివఱ అని అర్థము. స్వాధిష్ఠానము తరువాత 'మణిపూరక చక్రము'. ఈ చక్రమునందు సూర్యుడు గలడు. ఆయన ఉదయించుట అనగా 'మణిపూరకచక్రము' వద్ద సాధకులకు "కాంతి దర్శనము" అను యోగసంఘటన సూచితము. మణిపూరకము అగ్ని చక్రము. సూర్యుడు, విష్ణువు అచ్చట నుందురు. పైగా అది అరుణవర్ణమయిన చక్రము.

**విగ్రహారాధన :**

"సైకత విగ్రహము" సైకతలింగ పూజసుప్రసిద్ధమే. సికత అనగా ఇసుక. ఇది తెలుపు లేక పసుపుగా నుండును. రాసలీలలో చేసిన వర్ణనను బట్టి ఈ యిసుక 'పచ్చని'దని చెప్పవలెను. లేదా బంగారు వర్ణము అని చెప్పవలెను.

**"నద్యాః పులినమావిశ్య గోపీభిః హేమవాలుకం"**

ఈ 'పీత'వర్ణము దేవికి ప్రసిద్ధమే. అది సంసారభయమును పరిహరించును. ఈ విషయము "నెమలికన్ను" వద్ద చూడవలెను.

**ప్రార్థన :**

**"కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి**
**నందగోపసుతం దేవి పతిం మేకురు తే నమః"** **157**

వీరు దేవిని "మహామాయే మహాయోగిని" అని ప్రార్థించారు. కనుకనే తరువాత భగవంతుడు రాసలీలలో "యోగమాయాముపాశ్రితః" అనగా

157) మహామాయాదేవీ! కాత్యాయనీ దేవీ! మహాయోగినీ! మహేశ్వరీ! నందగోపుని పుత్రుడయిన కృష్ణుని మాకుపతిగా జేయుము.

యోగమాయ ధరించినట్లు చెప్పబడినది. కనుకనే 'రాసలీల, వస్త్రాపహరణము' ఈ రెండు 'యోగలీలలు' అని చెప్పవలయును. ఇదంతా ఉషఃకాలమున జరిగినది. అది జ్ఞానోదయమునకు తమోనివృత్తికి సూచన.

వారు కృష్ణగానము చేయుచు వచ్చి తమవస్త్రములను విడిచి తీరముపై నుంచి స్నానమునకు నదిలోనికి దిగిరి. ఇచ్చట వస్త్రములను వారే వదలిన విషయము గుర్తించవలయును. వారు వదలినవాటినే కృష్ణుడు అపహరించెను. పైగా వారు "కుమారికలు" అని గుర్తింపవలయును. చిన్నపిల్లలే కాని యీడేరిన కన్యలు గారు.

ఈ విషయము గ్రహించిన కృష్ణుడు అచ్చటకు వచ్చి వారి "కర్మఫలసిద్ధి" కొఱకు "వస్త్రాపహరణము చేసినట్లే మహర్షిమాట.

**"భగవాం స్తదభిప్రేత్య కృష్ణో యోగీశ్వరేశ్వరః**
**వయస్యై రాగతస్తత్ర వృత్తః తత్కర్మసిద్ధయే" 158**

యోగీశ్వరుడైన 'కృష్ణుడు' అని మఱల మఱల చెప్పుట వలన ఇది యోగవృత్తాంతము అని గ్రహింపవలయును.

కృష్ణుడు ఒంటరిగా రాక స్నేహితులతో వచ్చుట ఒక విశేషము. రాసలీలకు ఒంటరిగా వచ్చిన విషయము మఱువరాదు. రాసలీలనాడు ఆయన వేణుగానము విని సహజ సహచరులయిన గోపకులు రాకపోవటము ఒక వ్యంజకము. ఇచ్చట వచ్చుటకు కారణమేమనగా, అచ్చముగా కృష్ణుడయితే గోపికలు సిగ్గుపడరు. అందువలన గోపకులనుగూడా తెచ్చి వారి "సిగ్గు" అనే దేహాభిమానమును వదలించినాడు. ఈ గోపకులు దేవతలేనని కృష్ణాంశలేనని కృష్ణుడు సర్వవ్యాపియని, దిక్పాలకులు సర్వసాక్షులని వారికి బోధించుటకు స్నేహితులతో వచ్చుట అవసరము.

వారి వస్త్రములను తీసికొని వెంటనే 'నీప' వృక్షము ఎక్కినాడు.

వస్త్రములువారి "అజ్ఞానావరణలు" అని అభిప్రాయము. అయితే; వారి అజ్ఞానావరణలు వారే తొలగించికొనగా భగవంతుడు చేసినదేమి? వాటిని

---

158) వారి విషయము గ్రహించిన కృష్ణభగవానుడు యోగీశ్వరేశ్వరుడు వారికర్మ సిద్ధి కొఱకు తన స్నేహితులతో కలిసి అచ్చటకు వచ్చెను.

ఆయన గ్రహించుట ఏల? పైగా వారు వదలిన అజ్ఞానావరణలు కావలెనని వారు మఱల భగవంతునే ఏల కోరిరి. పైగా భగవంతుడు వారికి అజ్ఞానావరణములను తిరిగి ఏల ప్రసాదించెను. ఈ కార్యక్రమమంతయు వారి కర్మ ఫలసిద్ధి కొఱకు జరిగినట్లుగదా, కవి చెప్పినది. మఱి వారికి మఱల "హరి" అజ్ఞానావరణలు ప్రసాదించినచో కర్మసిద్ధి ఎట్లగును. కనుక ఈ "వస్త్రములు" ఏమిటి అన్న విషయము చర్చింపవలయును.

1) తాత్కాలికముగా 'వ్రతము' కొఱకు మనము మడికట్టి నియమాలు పాటించి తరువాత యధేచ్ఛగా సంచరించెదము. అనగా మనము చేసిన ఈ నియమ పరిరక్షణము, అనాచారత్యాగము కేవలము ఒక ఉద్దేశ్యము కొఱకే తప్ప వేఱు కారణము లేదు. వ్రతం చేయుచుండగా కోపపడరాదు. కామము పనికిరాదు. అయ్యప్ప దీక్షలో కొన్నిరోజులు ఇలాగే నియమాలు పాటించెదరు. తరువాత ఆ భావన మచ్చుకయినా కనబడదు. కాని నియమాలు శరీరానికి కాదు, మనస్సుకు. మానసికంగా ఆ భావనలు నిత్యము ఉన్నచో వాడు స్వామికి సన్నిహితము కాగలడు. రోగములో పథ్యముచేసి, తరువాత యధేచ్ఛగా తిరుగువాడు మఱల రోగమునకే దగ్గఱ అవును.

అదేవిధముగా వారు వస్త్రములను వదలుట తాత్కాలికము. వ్రతాంగమయిన స్నానము కొఱకు, జ్ఞానపరముగా, ఆలోచన చేసినచో వారు 'ఆవరణలు' తాత్కాలికముగా తొలగించిరి. శరీరాభిమానము పోలేదు. నిజముగా ఆవరణలు తొలగలేదు. పైకి మడి లోపల అరిషడ్వర్గములు యధాతథముగా నున్న స్థితి యిది. పైగా భగవంతుడు సర్వవ్యాపి అనే భావము రాలేదు. కనుకనే వస్త్రాలు విడిచినారు. తీరా, భగవంతుడు అచ్చట కనపడినపుడు సిగ్గుపడినారు. అంతేగాక నగ్నస్నానము పనికిరాదు. దిక్పాలకులు సర్వసాక్షులు అయిన సూర్యచంద్రాదులు చూచెదరనే భావముగూడా లేదు. కనుకనే పూర్ణతత్వజ్ఞానము వారికియ్యవలసిన అవసరమున్నది. వారు నిజముగా ఆవరణ త్యాగము చేయలేదు కనుకనే మఱల ఆవరణలు అనగా వస్త్రములు అడిగారు. వారికి జ్ఞానము కలిగించిన తరువాత భగవంతుడు వారికి వస్త్రాలు ఇచ్చాడు. జ్ఞానులకు ఆవరణలు, ఆభరణాలుగా మారుతాయి. జీవన్ముక్తులయినవారు అవధూతలు

ప్రపంచములో మామూలుగా కనబడుచున్నను ప్రాపంచిక వ్యవహారములు వారిని ఆవరించవు. సారాంశమేమనగా–

1) వస్త్రములు మాయావరణములే.

2) వారు వాటిని తాత్కాలికముగా వదలి తీరమునందు దాచిరి. వదలుకొనలేదు. ఏకాంతముగాబట్టి వాటిని చెడకుండా ఉండటానికి దాచినారు. పైగా విడిచినవి, మలినమయినవి, కట్టుట ఆచారభంగము. అయితే బాలికలు గనుక ఇలా చేసినారు.

3) ఇట్లుగాక అసలయిన "నిరావరణత" తెలియజెప్పి వారిని సంపూర్ణ నిరావరణులుగా చేయదలచుటయే ఇందు భగవల్లీల.

కనుక భగవంతుడు 'నీప' వృక్షమును ఎక్కి కూర్చొనెను. నీపవృక్షము కదంబము సమానార్థకములే. "నీపాలయా సురభిధూపాలకా" అని కదంబ వనవాసిని అయిన దేవిని ఆచార్య శంకరులు వర్ణించిరి. ప్రతీప, అనూపము వలె 'నీపము' అనగా 'జలమునకు దగ్గరిది' అని అర్థము చెప్పవచ్చును.

యోగపరముగా ఇది 'స్వాధిష్ఠానము' అను జలచక్రము వద్దనున్న "వెన్ను"లోని అంశమే. జ్ఞానపరముగా; గోపకుమారికల సంకల్పమే యీ నీపవృక్షము.

**"సంకల్పాః కల్పతరవః"** అని భావనోపనిషత్తు.

అనగా మన సంకల్పములే మనలోని కల్పవృక్షములు. కృష్ణకథలో కదంబమే కల్పవృక్షము.

**"కల్పవృక్షః కదంబోయం పరానందైక భాజనం"** అని పద్మపురాణము చెప్పినది.

గోపికలు మూలాధార స్వాధిష్ఠానములయందు ఉండగా భగవంతుడు పైన, మణిపూరచక్రమునందు వారికి గోచరించుట యోగపరముగా చెప్పదగును. అసలు కథలోనికి వచ్చెదము.

**"అత్రాగత్యాబలాః కామం స్వంస్వం వాసః ప్రగృహ్యతాం**
**సత్యం బ్రువాణి నో నర్మ యద్యూయం వ్రతకర్శితాః" 159**

వ్రతంతో కృశించిన వారుగాబట్టి వారికి తనవద్దకు వచ్చే అవకాశం కలిగినది. వారందఱు బయటకు వచ్చి వస్త్రములు తీసికొనవలెను. ఇది పరిహాసము కాదు సత్యము అనుచున్నాడు పరమాత్మ. ఇందలి సత్యము ఏమిటి? పరిహాసంగా తీసికొనవద్దని మనకు గూడా ఋషిహెచ్చరిక. కనుక బాగా "భావన" చేయాలి.

1) బయటకు రావటం అంటే తమ అజ్ఞాన స్థలములనుండి జలావరణము నుండి అని అర్థము. వారు వస్త్రములు లేకపోవుట వలన తాము స్నానముచేయు చెఱువు నీరే 'ఆవరణము'గా చేసికొని ఉన్నారు. అంటే వస్త్రములు తీసినంతనే ఆవరణములు తొలగలేదు. 'జలం' ఆవరణముగానే యున్నది. కాళిందీ జలము అజ్ఞానసూచకము. నలుపు, జడత్వము, చల్లదనము=అజ్ఞాన సూచకము.

2) వీరికి ఉన్న అసలు ఆవరణము దేహాభిమానము. అది 'హ్రీ' రూపముగా వీరియందు ఉన్నది. 'హ్రీ' అనగా లజ్జ= సిగ్గు. 'హ్రీ' అనునది మాయాభేదమే. 'హ్రీం' కారస్వరూపమే. భగవంతుని భార్యలలో-

**"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"**

అని పురుష సూక్తములో చెప్పబడినది. "గోపికలు" అను వ్యాసమునందు ఈ విషయము చూపబడినది.

"హ్రీ" అనగా భాగవతమున (11/19 "జుగుప్సాహ్రీరకర్మసు" అనియు.

భారతమున యక్షప్రశ్నలలో - "హ్రీరకార్య నివర్తనమ్" అనియు చెప్పబడినది. అనగా

హ్రీ= అకార్యములు చేయుటకు సిగ్గుపడుట. మఱియు "హ్రీ" అనగా హరించునది- అనియు అర్థము. 'హృ' ధాతువు నుండి పుట్టినది. జీవుని

159) ఓ అబలలారా! ఇచ్చటకు వచ్చి స్వేచ్ఛగా మీమీ వస్త్రాలను తీసికొనండి. నిజం చెప్తున్నాను. ఎగతాళి కాదు. ఎందుకంటే మీరు వ్రతంచేసి చిక్కిపోయినారు గదా!

భగవంతుని నుండి హరించునది- అని భావింపవచ్చును. అనగా మాయాస్వరూపము. అవిద్య

1) గోపికలకు గల 'హ్రీ' :

మగవారికి నగ్నముగా గనబడుట అను అకార్యము నుంచి తప్పించునది.

2) భగవంతుడు నేర్పదలచిన 'హ్రీ' : బాహ్యార్థముగా-

క) వ్రతోచితముగాని "నగ్నస్నానము" అను అకార్యము నుంచి నివారణ.

ఖ) నగ్నస్నానమునకు కారణమయిన "ఏ కా ం త భా వ న" ఒక అకార్యము. హరి సర్వవ్యాపి అనుభావనకు విరుద్ధము. కనుక దానినుంచి నివారణ.

గ) జలము, స్థలము, దిక్కులు సూర్యుడు మొదలగువారు సాక్షులయి యుందురు. వారిని మఱచి ఏకాంతమని భావించుటయు అకార్యము. దానినుంచి నివారణ.

3) భగవంతుడు నేర్పదలచిన 'హ్రీ' : అంతరార్థపరముగా

శరీరాభిమానము ఒక అకార్యము. దానివలననే వారు తరువాత వస్త్రములను కోరిరి. వస్త్రములను ఆవరణలుగా భావించుటకు కారణము శరీరాభిమానమే. శరీరాభిమానమే ఒక అజ్ఞానము. అదే ఆవరణము. కనుకనే గజేంద్రుడు-

**"అంతర్బహిశ్చావృతయేభయోన్యా"** అని **159ఎ**

ఆక్రోశించెను. ఈ అజ్ఞానమే "హ్రీ" భగవంతుని నుండి జీవులను హరించునది. దీనినే భగవంతుడు నివారించదలచినాడు. కనుక శాశ్వత 'హ్రీ'ని నివారించుట అంతరార్థము. వ్రతసంబంధమయిన "హ్రీ"ని కలిగించుట బహిరంగ ఉద్దేశ్యము. శాశ్వత హ్రీని నివారించుటకు బట్టలతో పనిలేదు. అది మానసికము, ఒకసారి దానినుంచి బయటపడినచో అది నిర్వీర్యమగును.

159ఎ) లోపల బయట అజ్ఞానము ఆవరించిన గజశరీరము వద్దు.

3) శాశ్వత హ్రీని నివారించుటకు భగవంతుడు గోపాలకులను తెచ్చి యుండును. పరమాత్మగా పతిగా గోరుచున్నవారే కనుక, వారు సరిపెట్టుకొని కృష్ణుని ముందఱ నగ్నముగా పైకి రావచ్చును. అంతమాత్రమున వారి 'హ్రీ' తొలగినట్లు కాదు. అందువలన గోపబాలకులను వెంటబెట్టుకొనివచ్చెను. కనుక తప్పనిసరిగా 'హ్రీ' తొలగుటకు ఈ సన్నివేశము సరిపోవును.

**"సర్వం ఖల్విదం బ్రహ్మ,**
**వాసుదేవ స్సర్వమితి**
**విశ్వం విష్ణుః"** అను భావన వచ్చితీఱును. గోపాలకులు అందఱు "హరిరూపులే" యని తెలియగలదు. లింగభేదము, వ్యక్తిభేదము తొలగవలయును.

**"ద్వితీయాద్వై భయం భవతి"**

అన్నట్లు "భగవంతుడు ఒక్కడే, రెండవవాడులేడు" అన్నభావన రావలయును. అప్పుడు 'హ్రీ'లేదు. ఆవరణలు ఉండినను ఊడినను తేడాలేదు. "ద్రష్ట" దృశ్యము, దర్శనము" అను త్రిపుటి నశించవలెను. లోకసముదాచారము కొఱకు ఈ ఆవరణలు. లజ్జతో కాదు.

4) నేరుగా తాను ప్రత్యక్షమయియుండగా తననే సేవింపక, "గౌరీపూజ" అనే ఉపాసన, దానికొఱకు మాసవ్రతము కాయక్లేశము, ఎందుకు? 1) తాను వేరు గౌరి వేరను భావన. 2) తాముగా కృష్ణుని చేరుటకు 'హ్రీ' ఇవి కారణాలు. కనుక యోగమాయా ప్రసాదముగా "యోగేశ్వరుడు" వారిని 'సంకోచము' నుండి బయటకు తెచ్చెను.

5) తనవద్దకు చేరుకొనేవారికి ఇట్టి మానసిక ఆవరణలు నశించ వలెనని సూచన. నశింపజేసెదనని హెచ్చరిక.

**"దదామి బుద్ధి యోగం తం" - గీత.**

6) యోగపరముగా 'నీపము' అనగా స్వాధిష్ఠానమువద్ద 'వెన్ను' ప్రాంతము అని చెప్పియున్నాము. మూలాధార స్వాధిష్ఠానములు అజ్ఞాన చక్రములు. వాటినుండి బయటకు రప్పించుట హరి సంకల్పము.

7) అన్నమయ, ప్రాణమయ, కోశములు కూడా అజ్ఞానకోశములు శరీర భౌతిక నిర్వహణకు సంబంధించినవి. అందువలన వాటినుంచి బయటకు రప్పించుట భగవానుని కోరిక.

ఈ విధముగా భావనలు చేసినచో వస్త్రాపహరణ ఘట్టములోని సాంప్రదాయిక అంతరార్థము తేటపడును. ఇక కథలోనికి వచ్చెదము.

చివఱకు కొంత వాదన జరిగిన తరువాత ఆ కన్యలు తమ యోనిభాగమును చేతితో కప్పుకొని బయటకు వచ్చిరి. చూ॥

**"పాణిభ్యాం యోని మాచ్ఛాద్య**
**ప్రోత్తేరుః తీర మంగనాః" - భాగవతం. 160**

'అంగనాః' అనుపదము వారి శరీరాభిమానమునకు సూచనగా వాడబడినది. యోని ఆచ్ఛాదనము వారి 'హ్రీ'కి సంకేతము. అది మూలాధార స్థానము. దానిని కౌలాచార పూజా భావనా సంకేతముగా భావింపవచ్చును. దానిని ఇంకా కప్పియుంచినట్లు భగవత్పూజా నమస్కారాలకు ఉపయోగింపవలసిన చేతులు "యోనిసేవకు" ఉపయోగించుట ఆచారము కాదుగదా!

**"కమలాక్షు నర్చించు కరములు కరములు"**

అని గదా భక్తిమార్గము. ఈ అపరాధమునకు మరియొక దండన విధింపబడినది.

**"యూయం వివస్త్రా యదపోధృతవ్రతాః**
**వ్యగాహతైతత్తదు దేవహేళనం**
**బధ్వాంజలిం మూర్ధ్ని అపనుత్తయేంహసః**
**కృత్వా నమో వో వసనం ప్రగృహ్యతామ్" - భాగవతం. 161**

ఇంతవరకు మనము చెప్పిన విషయములు ఈ శ్లోకములో సూచింపబడినవి.

160) చేతులతో యోని భాగమును కప్పుకొని అంగనలు తీరమునకు వచ్చిరి.
161) మీరు వ్రతం చేస్తూ వివస్త్రలయి స్నానమునకు దిగడం దేవతలను అవమానించటమే. ఆ పాపపరిహారం కొఱకై నెత్తిన దోసిలిబట్టి నమస్కరించి మీ మీ వస్త్రములను స్వీకరింపుడు.

1) వ్రతంలో నగ్నస్నానము తప్పు.

2) అది దేవతలను లేదా, దేవుని హేళన చేయుట.

3) ఈ పాప పరిహారమునకు తలపై అంజలి ఘటించి వస్త్రములను గైకొనవలసినది.

చమత్కారమేమనగా, "తల" బ్రహ్మరంధ్రమునకు స్థానము. అది దశమరంధ్రము. అది కృష్ణస్వరూపము. ప్రస్తుతము చేతులు మూలాధారము అనగా మర్మస్థానమును సేవించుచున్నవి. అది ప్రథమ రంధ్రము. పైది అనగా సృష్టికారణము. సంసారహేతువు. ఉపేక్షణీయము. కనుక దానిని వదలి ఆ చేతులను తలపై ఉంచి నమస్కరింపుదు – అని ఉపాసనాపరమయిన వ్యంగ్యము.

నారాయణతీర్థులవారు తమ 'తరంగిణి'లో గూడా ఈవిషయములనే సూచించిరి.

**1) పరిణామ విరస ఫలోదయ**
**కర్మణి పాటవ మతివితథం**
**పరిణామ విరహిత పరమ**
**పురుష మేవ భజ జగదేకనాథం" 162**

అనగా కృష్ణుడు అనబడే ఒక పురుషుడు పతిగా గావలెనని కోరుట మోక్షమార్గము కాదు. అది కర్మమార్గములో ఉపాసనామార్గము. ఫలితము శాశ్వతము కాదు. నిర్వికారుడయిన ఏకస్వరూపుడయిన స్వామిగా ఉపాసన చేయుడు– అని కృష్ణుడు గోపకుమారికలతో చెప్పెను. తరువత గోపికలు వచ్చినపుడుగూడా "అంగసంగముకన్న మనస్సంగము ముక్తిమార్గమ"ని స్వామి సెలవిచ్చిన విషయము గుర్తుంచుకొనవలయును.

---

162) చివరకు రసహీనమయిన ఫలితమునిచ్చే కర్మలమీద వ్యర్థమయిన తెలివితేటలు చూపరాదు. ఎటువంటి మార్పులు లేని జగదేకనాధుడయిన పరమ పురుషునే సేవింపవలయును.

**2) "పరిగృహాణ భువనబాహ్యదృ**
**గావరణం పరిహరసి వృధా కథం" 163**

అనగా బాహ్యదృష్టికి ఆవరణమయిన వస్త్రములను పరిహరించుట వ్యర్థము. కనుక వస్త్రములను ధరింపవలసినది.

తరువాత జరిగిన చమత్కార సంభాషణలోగూడా కృష్ణుడు అపహరించిన వస్త్రములు బాహ్య ఆవరణములు అని. ఆయన తద్వారా నిజముగా అపహరించినది, వారి "మానసికావరణ" మయిన "హ్రీ" అను మాయ అని తెలియుచున్నది. కావలసినవారు 'తరంగముల'ను చదివిన సందేహములు తీఱును.

మచ్చుకు కొన్ని తరంగ శకలములను ఇచ్చుచున్నాను. చూ॥ గోపికా కృష్ణుల సంభాషణ.

| | | |
|---|---|---|
| **కృష్ణుడు** | **"పరిగృహాణ భువనబాహ్యదృగావరణం" పరిహరసి వృధా కథమ్.** | |
| **గోపిక** | **"లోకాలోకనావరణం లోకేశ దేహి నౌమి తే"** | **164** |
| **కృష్ణ** | **"ఆవరణం మమ న హి తే దాతుం భావయ గోపవధూజనబృంద"** | **165** |
| **గోపిక** | **"దేవ యదావరణం మమ నీతం దేహి విభో భవతా యదనంత"** | **166** |
| **కృష్ణ** | **"నీతం నైవ మయా పరకీయం నైవ మమావరణం నిజదృష్ట్యా"** | **167** |

---

163) లోకంయొక్క బాహ్యదృష్టికి ఆవరణంగా ఉండే పైపైవస్త్రాలను వదలటంవలన ప్రయోజనములేదు. అలా వదలటం వ్యర్థము.

164) లోకేశ్వరా! లోకదృష్టికి ఆవరణమయిన దానిని నాకు ఇమ్ము నమస్కరించెదను.

165) నీకిచ్చుటకు నాదగ్గర ఏ ఆవరణమున్నులేదు. ఓ గోపస్త్రీ సమూహమా? ఆలోచింపుము.

166) దేవా! ఏ ఆవరణమును నీవు అపహరించావో అదినాకు ఇమ్ము.

167) పరసంబంధమయిన ఆవరణమును నేను తీసికొనలేదు. అసలు నా దృష్టిలో ఆవరణమేలేదు.

| | | |
|---|---|---|
| గోపిక | "ఆహ గృహాణ భవానితి పూర్వం<br>దేహి తదావరణం మమ బంధో" | **168** |
| కృష్ణ | "అక్షినిమీలన మేవ మయోక్తమ్<br>సాక్షా దిహతు గృహాణావరణమ్" | **169** |
| గోపిక | "లోకాలోకన విహితావరణం<br>లోకేశ్వర మమ దేహసముదితమ్" | **170** |
| కృష్ణ | "లోకస్యావరణం న విధాతుం<br>లోకే కోపి సమర్థః పురుషః" | **171** |
| గోపిక | "కశ్చన నాలోకయతి హి లోకే<br>కలయ తథావిధ మేవావరణమ్" | **172** |
| కృష్ణ | "లోక్యో నాలోకయతి యథాస్మాన్<br>లోకం కశ్చన కమపి విరోధాత్" | **173** |
| గోపిక | "లోక్యా ఏవ వయం పరభోగ్యాః<br>లోకేశావరణం తు విధేహి" | **174** |
| కృష్ణ | "తర్హి తదావరణై రల మల్పైః<br>తస్య న కించి దలోక్య మిహాస్తి" | **175** |

---

168) అయ్యా! ఇంతకుముందు ఏ ఆవరణను తీసికొనుమని నీవు మాతో అన్నావో ఆ ఆవరణాన్ని మాకు ఇవ్వవలసినది.

169) కనులు మూసికొనటమే ఆవరణమని నేను చెప్పాను. ప్రత్యక్షంగా ఆవరణమును గ్రహింపుము.

170) లోకేశ్వరా! లోకదృష్టికి విధింపబడిన ఆవరణము నాకు దేహం వలన వచ్చినది గదా!

171) లోకమునకు ఆవరణం చేసేందుకు ఎవరికీ సమర్థతలేదు.

172) లోకంలో ఎవడూ చూడకుండా ఉండేవిధంగా ఆవరణమును కల్పింపుము.

173) చూడదగినవాడు (ఆత్మ) మనలను గాని లోకమునుగాని చూడడు. అలా చూస్తాడను కొనటం అద్వైతమునకు విరుద్ధం.

174) లోకేశ్వరా! పరభోగయోగ్యలమయిన మేమే చూడదగినవారము. కనుక ఆవరణమును ఇమ్ము.

175) పరవస్తువుకు కనబడని దేదియు నుండదు. కనుక అల్పమయిన ఈ ఆవరణములు వ్యర్థము.

| | | |
|---|---|---|
| గోపిక | "కి మిద మలౌకికక సిద్ధావరణం<br>కే వా వయ మిహ లజ్జాభరణాః" | 176 |
| కృష్ణ | "యుక్తిసహం న హి భవదావరణమ్<br>యోగిభి రితి మీమాంసిత మబలాః" | 177 |

ఇవి వారిమధ్య జరిగిన సంభాషణలు.

ఈ సంభాషణల తరువాత గోపికలు ఒకచేతితో యోనిని ఆచ్ఛాదించికొని మఱొక చేతితో నమస్కారము చేసినారు.

ఇది రెండు పడవలమీద కాళ్ళుపెట్టే మన భక్తివంటిది. బాగా జరిగితే మన శక్తి, జరగకపోతే దేవుని ఆగ్రహము. ద్వంద్వ విధానము. మెట్ట వేదాంతము వంటి స్థితి. నమ్మితే పూర్తిగా నమ్మాలి. పూర్తిగా కావాలనుకొని ఆ తాత్పర్యంతో సాగాలి. అందువలన యోనిమార్గమును, జన్మను, పునర్జన్మను సూచించే కర్మమార్గమును వదలి రెండు చేతులెత్తి వారు నమస్కరింప వలయునని భగవానుడు కోరినాడు. కనుక వారు -

**"తత్పూర్తికామాః తదశేషకర్మణాం**
**సాక్షాత్స తం నేముః అవద్యముద్యతః"**

భగవన్నమస్కారము సర్వదోషములను (వ్రతదోషము) పోగొట్టునని భావించి సిగ్గువిడిచి ఆయనకు నమస్కరించిరి.

మనముగూడా పూజాంతములో-

---

176) అది అలౌకికమయిన సిద్ధవస్తువయిన బ్రహ్మంయొక్క ఆవరణము. సిగ్గు ఆభరణంగాగల మేమెవరము?

177) మీరు చెప్పే ఆవరణము యుక్తియుక్తమయినదిగాదు. భ్రాంతి అని పెద్దలు వేదాంతంలో చర్చించారమ్మాయిలూ - అనగా గోపికల దృష్టిలో ఆవరణలంటే వస్త్రాలు. అవి బాహ్యమయిన లోకదృష్టికి ఆవరణమయినవి. అవి తమ సిగ్గును అనగా ఇతరులనుంచి తమను దాచికొనాలనే భావమును రక్షించేవి. భగవంతుని దృష్టిలో అవి ఆవరణలు కావు. శరీరాభిమానము, తాముకాక ఇతరులు ఉన్నారనుకొనడం ఆవరణలు. పరమాత్మ ఒక్కడేనని కనుక ఆయనకు ఆయన తప్ప మఱొక పదార్థం కనబడదు కనుక ఆవరణ లుండవని ఆత్మనుంచి ఏదీ దాచటం సాధ్యంకాదని వస్త్రాలు వ్యర్థమని భావన. ఈ ద్వైత - అద్వైత భావనలలో ఎవరి భావంతో వారు సరదాగా సంభాషించారు.

**"మంత్రహీనం క్రియాహీనం**
**భక్తిహీనం జనార్ధన**
**యత్పూజితం మయా దేవ**
**పరిపూర్ణం తదస్తుతే" అని 178**

ఆ యజ్ఞ పురుషుని స్తుతింతుము గదా. ఇదియు అంతే. కనుకనే-

**"దృఢం ప్రలబ్ధాః త్రపయాచ హాపితాః"**

అని "సిగ్గు" పోగొట్టాడని భాగవతము ఈ కథ చివఱలో చెప్పినది. ఇది గోపికలకు మాత్రమే కాదు. అందఱికి కావలసిన విషయమే. ఉద్ధవునకు కృష్ణుడు చేసిన బోధలో-

**"విసృజ్య స్మయ మానాన్ స్వాన్**
**దంభం లజ్జాం చ దైహికీం**
**ప్రణమే దీశ్వరకలాం**
**ఆశ్వ చండాల గోఖరమ్" 179**

అని చెప్పబడినది. ప్రతివారును గర్వము, కపటము దేహసంబంధ మయిన బిడియము మానుకొని (జాతి లింగాది అభిమానములు) సర్వజీవుల యందు నిక్షిప్తమయిన "ఈశ్వరకళ"కు నమస్కరింపవలెను.

వస్త్రాపహరణ కథలో జరిగినది అదే. ఇక-

గోవులు - వేదములు : అను అర్థమున ఈ "గోపికా కుమారికలు" వేదము నుండి వచ్చిన "స్మృతి, పురాణ, ఆమ్నాయములు" కావచ్చును. ఆమ్నాయములు ఉపాసనాపరములు. ఉపాసనలు రెండు రకములు. కౌలాచారము, సమయాచారము. ఈ వస్త్రాపహరణ ఘట్టమును 'కౌలాచార' వ్యతిరేక సూచనగా భావింపవలయును. వారి ఉపాసన దిగంబరస్థితి

---

178) దేవా! విష్ణూ! మంత్రంలోగాని క్రియలోగాని, భక్తిలోగాని ఏలోపం గలిగినా నా పూజ నీదయవలన లోప పరిహారములు లేక పరిపూర్ణంగా నిలుచుగాక!

179) గర్వము, మానము, దంభము, దేహసంబంధమయిన సిగ్గు వదలి అశ్వం నుంచి గాడిదదాక సమస్త జీవులలో వ్యాపించిన ఈశ్వరకల అయిన చైతన్యమునకు నమస్కరింపవలెను.

మర్మావయవ పూజగా నుండును. ఈవిషయమై గౌడపాదాచార్యులవారి "సుభగోదయస్తుతి"లో–

**"అమీషాం కౌలానాం భగవతి భవేత్ పూజనవిధిః**
**తవ స్వాధిష్ఠానే తదనుచ భవేత్ మూలసదనే**
**అతో బాహ్యే పూజా భవతి భగరూపేణచ తతో**
**నిషిద్ధాచారోయం నిగమవిరహే నింద్యచరితే"** అన్నారు. **180**

బాహ్య యోనిపూజ నిషిద్ధాచారమని దీని భావము. ఇది కౌలుల ఆచారము. అయితే సమయాచారులు 'యోనిపూజ' వదలిపెట్టి నాభిస్థానము నుంచి కనబడు "భగవత్కల"ను ఉపాసించెదరు. 'స్వాధిష్ఠానము' అనే నీటిలో ప్రతిబింబించిన సూర్యచంద్ర కిరణములతో అచ్చట ఉపాసన సాగును. అంటే ఇది బాహ్యపూజకాదు. మానసిక పూజ.

సరిగా మనము వస్త్రధారణచేస్తే మూలాధార స్వాధిష్ఠానాలు మూసినట్లు అవుతుంది. వీరువస్త్రము విడిచివేయుటవలన "మూలాధార స్వాధిష్ఠానముల"ను వెలుగులోనికి తెచ్చినట్లు అవుతున్నది. పైగా రెండు చేతులతో తరువాత ఒక చేత్తో యోనిని ఆచ్ఛాదించి యుంచుట వారి దిగంబర పూజాభిమానమును సూచించుచున్నది.

కనుక నిషిద్ధమయిన కౌలాచారమునుండి వారిని ఉద్ధరించుటకు లేదా ఒడ్డున పడవేయుటకు స్వామి మణిపూరమున ప్రత్యక్షమయి అచ్చట ఉంచిన ఆచ్ఛాదనలు తొలగించెనని సూచన.

పైగా వారు యోని భాగమును 'వామహస్తము'తో మూసియుండెదరు. నమస్కారమునకు దక్షిణ హస్తమును ఉపయోగించి యుండెదరు. కనుక వామహస్తము వామాచార సూచకము భౌతిక సుఖానురాగ సూచకము. మనయందున్న ద్వివిధ ప్రవృత్తికి ఇది సూచన. భౌతిక సుఖములు కోరెదము. భగవంతుని పొందగోరెదము. కాని ఇవి అట్లు దొరకవు. భౌతిక సుఖములను తృణీకరించిననే భగవంతునివైపు మార్గము సుగమము అగును. అదే రెండు చేతులు ఎత్తి నమస్కరించుటలోని అంతరార్థము.

---

180) భగవతీ! కౌలపూజా ధురంధరులు నిన్ను స్వాధిష్ఠాన చక్రములోను, తర్వాత మూలాధార చక్రములోను, పూజించెదరు. ఇది యోనిపూజ. ఇది నిషిద్ధమయిన ఆచరణ.

మఱియు – వామకేశ్వర తంత్రములో నవధాతువులు నవయోనులని "దశమయోని" అనగా బ్రహ్మరంధ్రము పరాశక్తి అని చెప్పబడినది.

**"నవధాతు రయం దేవో నవయోని సముద్భవః**
**దశమీ యోని రేకైవ పరాశక్తిః తదీశ్వరీ"**

భావనోపనిషత్తులో–

**"శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః**
**తేన నవరంధ్రరూపో దేహః"** అని యున్నది. **181**

తంత్రరాజములో ఇట్లే గలదు.

**"గురురాద్యా భవేత్ శక్తిః సా విమర్శ మయీమతా**
**నవత్వం తస్య దేహస్య రంధ్రత్వే నావభాసతే"** **182**

**"గుర్వభిన్నరంధ్రవాన్"**
**"స్వదేహగత నవరంధ్రాణి నవనాధాః ఇతి యావత్"**

అని భాస్కరాచార్య భాష్యము.

కనుక శరీర నవరంధ్రములు నవగురువులుగా ఆగమ సంప్రదాయము అని స్పష్టము. మనలోని చైతన్యశక్తి ఈ రంధ్రముల ద్వారానే మనకు సర్వవిధ జ్ఞానములను ప్రసాదించును. కనుక ఈ రంధ్రములు మనకు జ్ఞానదాతలు, నాధులు, గురువులు, ప్రవర్తకులు. వీని అన్నింటికి మూలగురువు దశమరంధ్రము. అదే బ్రహ్మరంధ్రము, పైగా 'రంధ్రము' అనునది ఆకాశ స్వరూపము. ఆకాశము భగవంతునికి ప్రతీక.

**'ఆకాశః తల్లింగాత్'** – బ్రహ్మసూత్రం.

**"కం బ్రహ్మ ఖం బ్రహ్మ"** – ఉపనిషత్తు.

భగవంతుడు హృదయాకాశ నివాసి. ఆకాశమునుండి సృష్టి వచ్చినది.

---

181) శ్రీ గురువు సర్వకారణమయిన పరాశక్తియే.

182) ఆది గురువు పరాశక్తి. ఆమె భగవంతునియొక్క ప్రథమ సంకల్పము. అదే విమర్శ. దేహమునందలి తొమ్మిది రంధ్రములు గురువులే. అనగా దేహాన్ని నడపడం, దేహమాధారంగా యోగాన్ని నడపటం – వీటివలననే సాధ్యం కనుక ఈ నవరంధ్రములు నవ గురువులు వీరినే నవనాథులు అనెదరు.

**"ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః**
**అగ్నేరాపః అబ్భ్యః పృథివీ"** అని శ్రుతి. **183**

మఱియు, నవరంధ్రములు జీవికి జీవనాధారములు. బ్రహ్మరంధ్రము దశమరంధ్రము. అది ముక్తికి ఆధారము. మన జీవితము అంతయు రంధ్రముల మీదనే ఆధారపడియున్నది. ఉదా॥

ఇల్లు = ఎంత అందముగా కట్టినను దీనియందలి శూన్యమే మనకు అనుభవయోగ్యము.

గ్లాసు = సువర్ణ రత్నఖచితమయినను మనకు ఉపయోగపడునది అందలి 'రిక్త' ప్రదేశము.

శృంగారమంతయు - శాంత - పాపం - రంధ్రాన్వేషణయే గదా.

కనుక సగుణమయిన పదార్థాలనుంచి మనము ఆశించేది నిర్గుణమే అని చమత్కరింపవచ్చును. కనుక -

1) పరమాత్మ గురువని దశమరంధ్ర స్వరూపుడని తెలియక ఏకరంధ్రమును ఆచ్ఛాదించుట తత్వజ్ఞాన సూచకము కాదు. కనుక తప్పు.

2) రంధ్రాలు గురురూపములని, రంధ్రాభిమానమును దశమరంధ్రమునకు సమర్పింపవలెను. ఇతర రంధ్రములను మూయక ఈ ఒక్కరంధ్రమునే మూయదలచుట 'రంధ్రతత్వము' తెలియదని సూచన.

3) దశమయోని సేవకు వెళ్ళవలసిన చేతులు ప్రథమయోని సేవకు సిద్ధపడుట తప్పు. కనుక దశమరంధ్రజ్ఞానము కలిగినవేళ సర్వ రంధ్రాభిమానములు నశించి నమస్కారముతో ఆత్మసమర్పణ చేయుటయే కర్తవ్యము.

**జ్ఞానపరముగా :**

హేమంతస్నానము మొదలగు కఠోర నియమములతో అన్నమయ ప్రాణమయ కోశములను బాధింపరాదనియు, మనోమయకోశమును

---

183) ఆకాశము నుండి వాయువు. వాయువు నుండి అగ్ని అగ్నినుండి నీరు, నీటి నుండి పృథివి వచ్చినవి.

ఆవరించిన మాయావరణములను మాత్రమే తొలగించవలయుననియు ఈకథాతాత్పర్యము. బాహ్యావరణాలు అయిన వస్త్రాలు మొదలగు శారీరక భోగాలు విషయానుభవాలు అన్నమయ ప్రాణమయకోశములకు అవసరమయినవి. విషయాభిమానము, శరీరాభిమానము అనేవి మనోమయకోశమును బంధించునవి. అవి అంతరావరణములు. ఇవి తొలగించవలసినవి. ఇవి తొలగినచో పైబాహ్యావరణములు ఉన్నను దోషములు అంటవు. కనుక భగవంతుడు వారి 'హ్రీ' దోషమును పోగొట్టి వారి వస్త్రములను ఇచ్చెను. సారాంశమేమనగా-

**"భావాద్వైతంతు కర్తవ్యం క్రియాద్వైతం న కర్హిచిత్"** **184**

అన్నట్లు వదలనక్కరలేనివాటిని వదలకుండా వదలవలసిన వాటిని వదలి గమ్యమును పొందవలయును.

1) వదలనక్కఱలేనివి. లేదా వదలలేనివి లేదా ఉన్నను ఇబ్బంది లేనివి. అట్లే వదలగూడనివి. ఇవి బాహ్యావరణలు. కర్మమార్గములో విహిత కర్మలతోబాటు సహజ కర్మలు.

**"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్"**
**"యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్"** **185**

అని గీతలో చెప్పిన ఈ కర్మలు ఆచరించినను ఇబ్బందిలేనివి. కాకపోతే కావలసినది-

**"ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతే"** అన్నభావన. **186**

2) అసలు వదలవలసినవి అంతరావరణలు. అభిమానపూర్వక కర్మలు, కామ్యకర్మలు. కనుకనే -

---

184) అద్వైతం భావనలోనే ఉండాలి గాని ప్రాపంచిక క్రియలలో కాదు. ఏనుగును బ్రహ్మం అని అద్వైతంగా భావించాలిగాని నేరుగా ఢీకొనరాదు. ఎందుకంటే అది ప్రమాద హేతువు. వ్యవహారానికి సాగదు. ఏనుగుకు అద్వైతం తెలియదుగదా!
185) కౌంతేయా! సహజమయిన కర్మలో దోషములున్నా దానిని వదలరాదు. యజ్ఞము, దానము, తపస్సు మొదలయిన కర్మ, భ్రాంతి దూషితమయినా దానిని వదలరాదు.
186) ఇంద్రియాలు తమపని తాము చేసికొంటున్నవి. కన్ను చూస్తున్నది. నేనుకాదు అని భావించటం.

**"చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః** **187**
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ"** అని గీత చెప్పినది.

3) గమ్యము భగవత్పాద సన్నిధి. దానికి "సర్వధా – సర్వదా – శరణాగతి" ఒకటే కర్తవ్యము. కర్మలన్నియు భగవంతుని ఉద్దేశించి జరుపదగినవి.

**"తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః**
**ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్"** **188**

## గోపికలు ఉపనిషత్తులనుకొన్నచో :

గోపకుమారికలు "ఋగ్వేదము" మొదలగు కర్మభాగమును చెప్పే వేదభాగములుగా భావింపవలయును. అట్టి పక్షమున

1. గోపికా వస్త్రములు : వేద ప్రతిపాదితమయిన రకరకాల కర్మలు. వాటిని తాత్కాలికముగా వదలిపెట్టి వారు కృష్ణగానము చేసినారు. తరువాత మఱల యధాప్రకారముగా వారు తమ కర్మకాండలను తగిలించికొంటారు. మనము 'శనివారం' నిష్ఠగా ఉండి మామూలు కార్యక్రమాలు అవతలపెట్టి మఱల ఆదివారమునుంచి యధాప్రకారము అంతకుముందు వదలిన వాటిలోనే మునిగి తేలెదము. అట్టి 'కర్మలు' గోపికావస్త్రములు. నిజంగా వాటిని వదలవలసిన పనిలేదు. అవి భగవత్ప్రాప్తికి అడ్డములు కావు.

2) గోపికా దిగంబర శరీరము మఱేదో కాదు. వేదములలో దాగియున్న కర్మమార్గాభిమానము. వారు కంఠము వఱకు సరస్సులో దాగియున్నారు. అజ్ఞానములో కర్మమార్గాభిమానముతో దేవత 'అస్తిత్వము గుర్తించని స్థితిలో వేదములు మునిగియుండగా కంఠముపై భాగము, జ్ఞానకేంద్రము అయిన ఉపనిషత్తులు భగవంతుని దర్శించినవి. కర్మమార్గ వాదులకు శబ్దము దేవత. వేఱే దేవతగురించి వారికి పనిలేదు.

**"చతుర్థ్యంతః శబ్దో దేవతా"**

---

187) సర్వక్రియలను మానసికంగా నాకు సమర్పించి జ్ఞానయోగము నాశ్రయించి నిరంతరం నన్ను ధ్యానింపుము.

188) కనుక యజ్ఞం దానం తపస్సులను విధి ప్రకారము "ఓంకార భావనా పూర్వకంగా చేయవలయును.

వేదవిహితము చేయుట, కోరిన ఫలము అనుభవించుట ఇదే కర్మమార్గము. ఇది అజ్ఞాన మార్గము. అభిమాన నిలయము. దీనిని వదలవలెను. రెండుచేతులు జ్ఞానకర్మమార్గములు అనుకొనవచ్చును. అందు భగవంతునివైపు ఎత్తినచేయి జ్ఞానమార్గమును యోనియందుంచిన చేయి సంసార మార్గమును సూచించును. కర్మమార్గము సంసార మార్గమేగాని ముక్తిమార్గము కాదు.

3) అట్టి అభిమానమును పోగొట్టి, దేవపితృయానములను, ధూమజ్యోతిర్మార్గములను, భగవత్పరముగా చేయించి భగవంతుడు వారి కర్మమార్గములను వారికిచ్చినాడు. అనగా అభిమానరహితముగా భగవంతుని ప్రీతికొఱకు కర్మలను ఆచరించుట ముక్తికిమార్గము అని చెప్పినట్లు అయినది.

కనుకనే వారిలోని "లజ్జాపూరితమయిన సంగవాంఛ"ను గూర్చి భగవంతుడు చెప్పుచు "నాయందు మీరుంచిన కామము, కామముగా పనికిరాదని ముక్తిగానే పరిణమించును" అని పలికెను. అటుకులు చల్లినచో అంకురములు రావుగదా! భగవంతుడు అగ్నివంటివాడు. ఆయనపై పెట్టిన కామము భస్మమయి మోక్షకారణమగును. చూ॥

**"న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే**
**భర్జితాః క్వథితా ధానాః ప్రాయో బీజాయ నేశతే" 189**

కుచేలుని అటుకులు గూడా ఇట్టి నిష్కామకర్మలే. ఈ వ్రతమునకు ఫలితముగా భగవానుడు వారికి "రాసలీలా విహారము"ను వరముగా ఇచ్చెను. ఈకథలో అంతరార్థము చెప్పనిచో కథాసమన్వయమే కుంటుపడును.

ఇచ్చట గ్రహింపదగిన అంశములు–

1) కృష్ణుడు ఏడు వత్సరాల వయసువాడు. గోపకుమారికలు ఐదు ఏండ్లవారు. అందుకనియే స్తనములు కప్పుకొన్నట్లు చెప్పలేదు. వస్త్రాపహరణ చిత్రకారులు గోపికలను ఉన్నత స్తన జఘనములతో చిత్రించుట కేవలము

---

189) నాయందు మనస్సు లగ్నంచేసిన వారి కోరిక ఎట్టి ఇతరమయిన కోరికలు కలుగనీయదు. వేయించిన, వండిన వరిగింజలు విత్తనాలుగా పనికిరావుగదా!

అపోహమాత్రమే. లేదా ఆచ్ఛాదకమయిన శృంగారమునకు శోభ కలిగించుటకు అనుకొనవచ్చును.

2) గోపకన్యలు అడిగినది పతిత్వము. కృష్ణుడు ఇచ్చినది రాసలీలా విహారము. ఇది పొసగుటలేదు. కనుక యోగపరముగా సమన్వయము అవసరము. కనుకనే వారు 'యోగమాయ'ను ఉపాసించినట్లు గలదు. కృష్ణుని "యోగీశ్వరేశ్వరః" అని మాటిమాటికి ఋషి వర్ణించెను.

3) చెట్టుపైనున్న కృష్ణునకు చెట్టుక్రిందనున్న గోపికల శరీరము కనబడును. యోనిపై చేయి తీయించినను కనబడునది ఏమియు లేదు.

4) వారిని వెంటనే అనుగ్రహింపక శరద్రాత్రులవఱకు ఏల ఆగుమనెను.

ఈ శంకకు సమాధానము యోగత్రయీ పరముగానే సమన్వయము చేసిన సాధ్యమగును.





# ద్వాదశ పింఛము

## రా స లీ ల

"సలలితేంద్రియ గోపికలు వర ప్రీతిచే
జనుదెంచి తనుబొంది సంతసింప
బ్రహ్మదండిలతా విభాస్వదాధారాది
కపికావళి మహావికాస మొంద
ప్రస్ఫుటీకృత పటుస్పట గుండలీంద్రు డ
త్యానందకరముగా నాడుచుండ
పొందుగా భ్రూమధ్య బృందావనమ్మున
ప్రత్యక్షబోధ గోపాలమూర్తి
విమల మానస పవన హస్తములచేత
తన సుషుమ్నామురళి లీలదాల్చి మధుర
గాన మొనరించె ననగ నోంకార మొప్పు
వేణునాదస్వరూపమై వెలయునంత" **190**

– సీతారామాంజనేయ సంవాదము

రాసలీలా ఘట్టమునకు ఈ పద్యము అంతరార్థమును చెప్పినది. ముందు నేను చేయబోవు 'రాసలీలా వివరణము'నకు ఇది ఒజ్జబంతి. నా వ్యాఖ్య సంప్రదాయబద్ధము, శాస్త్రయుక్తము అనుటకు ఇది ప్రథమ ప్రమాణము.

రాసలీల అంతయు భౌతిక వృత్తాంతముకాదు. అది యోగవృత్తాంతము. కృష్ణునకు "యోగీశ్వరుడు" అను విశేషణము భాగవతములో చాలాసార్లు

190) ఇంద్రియాలనే గోపికలు వచ్చి తనను చుట్టి సంతోషిస్తున్నారు. 'బ్రహ్మదండి' అనగా వెన్నులోని ఆధారాది చక్రాలలోనున్న కోకిలలు (ఆయా నాదశక్తులు) గొంతు విప్పుతున్నాయి. స్ఫుటమయిన పడగతో కుండలినీ సర్పరాజు ఆనందకరముగా నృత్యం మొదలుపెట్టాడు. ఆ సందర్భములో ప్రత్యక్ష / అపరోక్షజ్ఞాన స్వరూపుడైన గోపాలుడు భ్రూమధ్యమనే బృందావనంలోకి వేంచేశాడు. నిర్మల మనస్సు, ప్రాణములనే చేతులతో 'సుషుమ్న అనే పిల్లనగ్రోవిని పట్టుకొని గానం చేసినట్లుగా ఓంకారం వేణునాదరూపంగా వెలసి బృందావనమంతా వశపరచికొన్నది.

వాడబడినది. ఆయన జగద్గురువు. గీతాచార్యుడు. మఱే అవతారమునకు లేని శంఖ, చక్ర, శార్ఙ్గ, గదాది ప్రహరణములు. గరుడవాహనము, విశ్వరూప ప్రదర్శనము మొదలగు కాంతికళికలు ఈ అవతార రత్నమునుండి బయలుపడుచున్నవి. అందుకనే యిది మణికాంతి తత్త్వము అని చెప్పబడినది. ఇట్టి విరుద్ధ విచిత్ర విషయములు అన్నియు అంతరార్థమునందే ఇముడగలవు. కనుకనే – "యోగమాయా ముపాశ్రితః" అని రాసలీలా ఘట్ట ప్రారంభ శ్లోకములో మహర్షి సూచించెను. కనుకనే కృష్ణుని వయస్సు మారలేదని చెప్పుచున్నాడు.

**"సో పికైశోరక వయో మానయన్ మధుసూదనః**
**రేమే తాభి రమేయాత్మా క్షపాసుక్షపితాహితః" – భాగ. 191**

అని చెప్పబడినది. వయస్సు మారలేదు. మనస్సు మారలేదు. వయస్సును అంగీకరించుట అనగా ఆ వయసుకు తగిన శరీరమును అంగీకరించుటయే గదా. కనుక శీలములు చెడలేదు. యోగమాయను ఆశ్రయించిన వెంటనే వాతావరణము మారినది. వేణువు రాగరస ప్రవాహమును విరజిమ్మినది. దానికి గోపికలు వశమయినారు. ఇది యోగమాయ కనుకనే గోపకులు దీనికి నోచుకొనలేదు. ఈ చంద్రోదయము, ఈ వేణునాదము వారికి రుచి కలిగింపలేదు. ఇది విశ్వరూప దర్శనము వంటిది. భీష్మాదులకు భక్తి, దుర్యోధనునకు కోపము మనము విన్న విషయములే. ఎవరికి ఎంత ప్రాప్తమో అంతే.

తనకొఱకై వ్రతము చేసిన గోపకుమారికలకు తనకు పాలు వెన్న ఇచ్చిన గోపికలకు భగవంతుడు ఏకకాలమున ఇచ్చిన రాసలీలానందము భౌతిక సురతముగా భావించుట అజ్ఞానము. ఎంతటి జారుడైనా, ఎంతటి జారిణులయినా తల్లి, పిల్లలు, అక్క, చెల్లెళ్ళు ఒకేసారి రతిప్రవాహములో కొట్టుకొనిపోయిరని చెప్పుట సంస్కృతి ద్రోహము. కనుక ఇదియంతయు యోగమాయ. ప్రారంభములోనే కృష్ణుడు యోగమాయ నాశ్రయించినట్లు

191) మాధవుడు తన కుమార వయస్సును కాపాడికొనుచూ ఆరాత్రులలో ఆ గోపికలతో క్రీడించెను.

'ఋషి' చెప్పుటకు కారణము ఇదే. లేనిచో యోగమాయా ప్రభావముతో కృష్ణుడు ప్రారంభములో ఏమియు అసాధారణ చర్యలు చేసినది లేదుగదా. మధ్యలో బహురూపములు ధరించుట ఒకటే అసాధారణ విషయము. యోగమాయతో ఆ రూపములను ధరించుట సత్యమే. ఆ సంగతి అచ్చటనే చెప్పవలెగదా! అట్లుగాక ప్రారంభములో 'యోగమాయ' ధరించి చేసినదేమి? ఇదుగో ఇది. 1) వేణుగానము, 2) వశీకరణము.

## 1. వేణుగానము :

కృష్ణుడు 'వేణుగానము' చేసినపుడు ప్రతిసారియు గోపికలు వెంటబడలేదు. ఇది యోగమాయా ప్రభావము. ఈ వేణునాదము దివ్యప్రణవనాదము. గోపికలు, ఇంతకుముందు చెప్పినట్లు సంకేతరూపమయిన పాత్రలు. యోగశాస్త్రములో "కుమారి ఒకతె మంద్రముగా ధ్వనించును. తరువాత మఱొక 'స్త్రీ' ఆ కుల చక్రమును వదలి త్రాచుపామువలె విజృంభించి ధ్వనించును. తరువాత హృదయాకాశమునందు పతి సంయోగము జరుగును" అని చెప్పబడినది.

**"కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషిదపరా**
**కులంత్యక్త్వారౌతి స్ఫుటతి చ మహాకాలభుజగీ**
**తతః పాతివ్రత్యం భవతి దహరాకాశకమలే**
**సుఖాసీనా యోషా భవసి భవసీత్కారరసికా" ॥ 192**

సుభగోదయస్తుతి= గౌడపాదాచార్యులు- ఈ విషయమునకు ప్రతి రూపముగా, ముందు గోప కుమారికల ప్రార్థన, తరువాత మహాగోపికా సమూహ శరణాగతి ప్రార్థన, రాసలీలయు జరిగినవి.

---

192) కుమారి అయిన ఒక స్త్రీ మంద్రంగా ధ్వనిస్తుంది. తరువాత మఱొక స్త్రీ మూలాధార చక్రమును వదలి నినదిస్తుంది. పడగెత్తిన మహాకాల సర్పం స్పష్టంగా కనబడుతుంది. తరువాత ఆమె హృదయాకాశంలో ఉన్న సహస్రారకమలంలో తన పతితో కలుస్తుంది. అచ్చట భవునికి ఆనందమును గోలుపుతూ, లేదా శివునితో వచ్చిన ఆనందమును పొందుతూ సుఖాసీనురాలయిన 'సింహాసనేశ్వరిగా ఉంటావు. ఒకే కుండలిని యొక్క వివిధ దశారూపాలివి.

**"భగవానపి తా రాత్రీః శరదోత్ఫుల్లమల్లికాః**
**వీక్ష్యరంతుం మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః" 193**
**- భాగవతం 10 స్కంధం**

**"కృష్ణస్తు యౌవనం దృష్ట్వానిశి చంద్రమసో వనం**
**శారదీం చ నిశాం రమ్యాం మనశ్చక్రే రతింప్రతి" 194**
**- హరివంశం**

రెండు గ్రంథములలోను "మనశ్చక్రే" అనే పదము కనబడుచున్నది. కనుక పదప్రయోగ స్వారస్యమునుబట్టి "మనస్సును చేసికొనెను" అని అర్థము మాత్రమేగాక, అంతరార్థపరముగా 'మనశ్చక్రము' నందు అనగా మనోమయ, బుద్ధిమయ కోశములందు అనియు ఆజ్ఞాచక్రమునందు అనియు అర్థము చెప్పవలెను. అవసరమయినచో క్రియను ఆధ్యాహారము చేయవచ్చును. భాగవత శ్లోకమునందు క్రియ అవసరమే లేదు. కాగా అర్థము ఇట్లు చెప్పవచ్చును.

"శరదృతు ప్రభావముచే" మల్లికలు వికసించిన ఆ రాత్రులను గమనించి భగవంతుడు 'మనశ్చక్రము' నందు రమింపదలచినవాడై యోగమాయను ఆశ్రయించెను. ఈ యోగమాయనే గోపకుమారికలు "కాత్యాయని" పేరుతో ఆరాధించిరి. కనుక భగవంతునకు, భక్తునకుమధ్య యోగమాయ అనుసంధాన కర్త. రుక్మిణి తన వివాహమునకు ముందు దుర్గాదేవిని శరణుజొచ్చెను. దుర్గాసమక్షముననే దుర్గా పూజానంతరమే ఆమెకు కృష్ణుడు లభించెను కనుకనే–

**"యోగమాయా ముపాశ్రితః"**

అను పదము రాసలీలా ఘట్ట మహామంత్రమునకు "కీలకము" కృష్ణావతారముతో బాటు "యోగమాయా జననము" గూడా జరుగుట యా

---

193) భగవంతుడు మల్లికలు వికసించిన ఆ శరద్రాత్రులను గమనించి యోగమాయను ఆశ్రయించి రమించదలచెను. లేదా మనశ్చక్రమున క్రీడించుటకు యోగమాయను ఆశ్రయించెను.

194) కృష్ణుడు వనాన్ని చంద్రుని యౌవనాన్ని రమణీయమయిన శరద్రాత్రిని గమనించి క్రీడించవలెనని మనసుపడెను.

మంత్రమునకు బీజము. "యోగీశ్వరేశ్వరః" అనుట యీ మంత్రమునకు 'శక్తి' అని సంభావింపదగును.

## 1) రాసలీలా స్థల కాలాది వివరణ

**1. రాత్రి :**

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" – భగవద్గీత**

అన్నవిధముగా మానవులు అజ్ఞానములో మేల్కొన్న దిన వ్యవహారములు యోగికి రాత్రివలె భాసించును. మానవులు గాఢసుషుప్తిలో మునిగి ఏది రాత్రిగా భావిస్తారో అదే జ్ఞానులకు 'పగలు'. కనుక ఇచ్చట 'రాత్రి' అనగా మానవ దృష్టిలో రాత్రి, యోగుల దృష్టిలో జ్ఞానదర్శనములు చక్కగా సాగే పగలు అని అర్థము. అంతేగాక పగలు ఆకాశములోని దివ్యనక్షత్ర లోకములు కనబడవు. అవి రాత్రి మాత్రమే దర్శనయోగ్యములు. కనుక దివ్యలోక దర్శన వేళ, వ్యక్తి తలయెత్తి ఊర్ధ్వలోకములను దర్శించువేళ అని చెప్పవచ్చును. పగలు విషయదృష్టి రాత్రి ఊర్ధ్వదృష్టి అని చెప్పవచ్చును. సంసారము తమోమయము కనుక 'రాత్రి' అనుకొన్నచో 'రాసలీల' మోక్షము గనుక రాత్రినుంచి పగటికి ప్రయాణము.

**"తమసో మా జ్యోతిర్గమయ"** మఱియు,
**"అర్ధః శంభుః శివా వాణీ దివా శంభుః శివా నిశా"**

అనుమాట ప్రకారము 'నిశలు' దేవీస్వరూపములు. కృష్ణుడు ధరించిన యోగమాయ దేవీస్వరూపము కనుక 'రాత్రి' రాసలీల ప్రారంభము. మఱియు, కృష్ణుడు పుట్టినదియు అర్ధరాత్రమే. యోగులు, శాక్తేయులు రాత్రియందే తమ అనుష్ఠాన రహస్యములను అవలంబించెదరు.

**2. శరదృతువు :**

ఇది వెన్నెలకు ప్రసిద్ధము. శుద్ధాకాశము దాని లక్షణము. అజ్ఞాన మేఘములు తొలగిపోయి జ్ఞానచంద్రుడు వెన్నెలలు కురిపించు లక్షణముగల 'క్షణము'. అయితే భగవంతుడు గీతలో–

"ఋతూనాం కుసుమాకరః" అని తనకు వసంత ఋతువును స్వరూపముగా చెప్పినాడు. మాసములలో

"మాసానాం మార్గశీర్షోస్మి" అని చెప్పినాడు. అంతేగాని శరదృతువుగా కార్తికమాసంగా చెప్పలేదుగదా. మఱి ఇదేమిటి?

ఇది సత్వప్రధానమయిన లీల. కామముగా కనబడుటయేగాని కామముగాదు. నిజంగా కామము అయితే మాధవమాసమందే ఇది జరగాలి. కాని భగవత్కామము కనుక దీనికి శరదృతువు తప్పనిసరి. అసలు రహస్యమేమనగా షట్చక్రములలో ఆఱు ఋతువులు న్యాసమయినవి. అవి మన శరీరములో నున్నవి.

**"హేమంతాద్యాశ్చ ఋతవః షట్చక్రే క్రమశః స్థితాః"** – చక్రకౌముది.

ఆ ప్రకారము లక్ష్మీనారాయణ స్థానమయిన మణిపూరచక్రము వసంత ఋతువు. అందువలన భగవంతుడు తాను "వసంతఋతువు"ను అని చెప్పియున్నాడు. లక్ష్మీనారాయణతత్వము సృష్టికి లోబడిన త్రిమూర్తులలోనిది. ఇది భూమిపై ద్వారకతో సమానము. గోలోకము వైకుంఠాతీత లోకమని, ఇదివఱకు చెప్పబడినది. అది భ్రూమధ్య ప్రాంతమనియు, సూచింపబడినది. గోలోకబృందావనప్రకరణములను రెంటిను మఱొక్కమాఱు చూడవలసి యుండును.

యోగశాస్త్రప్రకారము భ్రూమధ్యము శరదృతుస్థానము. ఇదే ఆజ్ఞాచక్రము. ఇచ్చటనే మనస్సు ఉండును. అది మనశ్చక్రము. దీనిని దివ్య ధ్యానలీలగా చెప్పిననే ఇది సరిపోవును.

జ్ఞానశాస్త్రప్రకారము మనోమయ విజ్ఞానమయకోశములు గావలెను. దత్తాత్రేయ తంత్రములో ఉపాసనాకాలమును గూర్చి చెప్పుచు–

**"కార్తికే జ్ఞాన సంభవః"** అని చెప్పినారు.

"వెన్నెల నెల" కనుక వెన్నెల సత్యమునకు జ్ఞానమునకు గుర్తు కనుక ఈ కార్తీకము తీసికొనవలసి వచ్చినది. ఇంతేగాక, శరీరములో షట్చక్రములతో బాటు పద్మములున్నవి. పద్మములకు శరదృతువు వికాస

కారణము. అంతర్గత పద్మములు వికసించుటకు జ్ఞానశరత్తు కావలయును. హంసలకు పరమహంసలకు ఇది ఆనందకాలము. ఇందులో రాత్రి వెన్నెలలో పద్మములు శరద్రాత్రిలో మల్లికలు వికసించుట యోగమాయ. శరదృతువును మహర్షి వర్ణించిన తీఋగూడా ఇది "జ్ఞానకాండ" అని సూచించుచున్నది.

**(ఆ) జహుః జహుః శనైః పంకం స్థలాన్యామం చ వీరుధః**
**యధాహంమమతా ధీరాః శరీరాదిష్వనాత్మసు**

అనగా, పండితులు శరీరాదులయందు అహంకార మమకారములను వదలినట్లు తీగలు బురదను వదలించుకొన్నవి.

**ఇ) "కేదారేభ్యః త్వపో గృహ్ణన్ కర్షకా దృఢసేతుభిః**
**యధా ప్రాణైః స్రవత్ జ్ఞానం తన్నిరోధేన యోగినః"**

అనగా ప్రాణవాయు క్రియలద్వారా జారిపోవుచున్న జ్ఞానమును ప్రాణనిరోధము ద్వారా యోగులు నిలువ చేసినట్లు కర్షకులు పొలముల నుండి ప్రవహించుచున్న నీటిని ఆనకట్టలతో కట్టివేసిరి.

**ఉ) "శరదర్కాంశుజం తాపం భూతానా ముడుపోహరత్**
**దేహాభిమానజం బోధో ముకుందో వ్రజయోషితాం"**

అర్థము : దేహాభిమానము వలన వచ్చిన గోపికల తాపమును వాసుదేవుడు హరించినట్లు శరత్కాలసూర్యుని ఎండవలన గలిగిన ప్రజల తాపమును చంద్రుడు హరించెను.

**ఋ) "ఖమశోభత నిర్మేఘం శరద్విమలతారకం**
**సత్త్వయుక్తం యధాచిత్తం శబ్దబ్రహ్మార్థదర్శనం"**

అర్థము : మబ్బులు తొలగి నిర్మలమయిన నక్షత్రములు వెలుగుచున్న శారదాకాశము నాదవేదార్థమును గ్రహించే సాత్వికచిత్తము వలెనున్నది. దీనినిబట్టి భాగవతములోని 'శరత్తు' జ్ఞానఋతువుగా భావించవలెను. నారాయణతీర్థులవారు తరంగములలో శరదృతువును శివరూపముగా వర్ణించినారు. శివుడు కాలకాలుడు, మహాకాలుడు, కాలీభర్త. జ్ఞానదాత ధవళాంగుడు చంద్రరేఖాభరణధారి.

**"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్**
**జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్ మోక్షమిచ్ఛేత్ జనార్ధనాత్" 195**

తంత్రములను ఉపదేశించినవాడు పరమశివుడే. కనుక జ్ఞానదాత.

**"శివాయ గురవే నమః"**

వారణాశిలో పంచాక్షరీ మంత్ర ముపదేశించుట గూడా గురులక్షణమే.
చూ॥

**"భోభో వ్రజపురనార్యః**
**శారదసమయం పరం శివం మత్వా,**
**కృపయా తస్య భజామో**
**గోవిందం ప్రాహురితి సదాన్యోన్యమ్" (కృష్ణలీలా-1) 196**

ఈ శరదృతు పరిసరము రుద్రగ్రంథి. కనుక తీర్థులవారు దీన్ని రుద్రరూపముగా వర్ణించుట జరిగినది. దేహములో ఇది ఫాలభాగము. కనుక ఫాలనేత్రుడుగా చెప్పబడినది. ఈ చంద్రశేఖర స్వరూపమయిన కాలమున "చంద్రకశేఖరుని" రాసలీల జరిగినదని స్మార్తభావన.

## 3. మల్లికలు

శరత్తులో మల్లికలు వికసించినవి అని కలదు. మల్లికలు వసంతములో వికసించును. రాత్రి వికసించుటలో అభ్యంతరము లేదు. కాని శరదృతువులో వికసించుట అద్భుతము. వ్యాఖ్యాతలు ఇది యోగమాయా మహిమ అన్నారు. అంతే కావచ్చు. కాని 'మల్లికలు' వికసించవలసిన అవసరమేమి? వాటిని యోగమాయతో ప్రయత్నపూర్వకముగా వికసింపజేయవలసిన అవసరమేమి.

**సమాధానము :**

రాసలీలా విహారము మన్మథ విజయము. ఏ అర్థములోనయినా 'మన్మథుడు' రాక తప్పదు. మన్మథబాణములు ఐదు.

---

195) సూర్యునివలన ఆరోగ్యమును, అగ్నివలన సంపదను, ఈశ్వరునివలన జ్ఞానమును విష్ణువు వలన మోక్షమును పొందవలయును.

196) ఓ గోకుల బృందావన మహిళలారా! ఈ శరద్రాత్రి పరమశివ స్వరూపమయిన మహాకాలము ఈతని దయతో గోవిందుని సేవించెదము. అని అన్యోన్యము గోపికలు అనుకొనిరి.

**"అరవింద మశోకం చ చూతం చ నవమల్లికా**
**నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః"**

| | | | |
|---|---|---|---|
| 1. | నీలోత్పలం | – | నీలవర్ణము |
| 2. | మల్లికా | – | తెలుపు |
| 3. | చూతం (మామిడి) | – | పసుపు |
| 4. | అశోకం | – | ఎఱుపు |
| 5. | అరవిందం | – | చాలా రంగులలో లభించును. |

ఇందులో 'మల్లికలు' తెల్లని బాణములు రాత్రి వికాసము కలవి. కనుక సత్వప్రధానమయిన నిర్మల కామమును కల్గించు కామబాణములుగా 'మల్లికలు' అవసరము. 'మల్లిక'లో ఉన్న అక్షరాలే 'క్లీం'లో గూడా నుండుట చిత్రమయిన సంఘటన. కాకపోతే ఎదురు వరుసనుంచి కనబడును. మఱియు శరత్తులో నక్షత్రములు వికసించును. అవి 'మల్లెలు' విరిసినట్లుండును. అందువలన అధ్యవసాయంతో వస్తువును కప్పి నక్షత్రములనే మల్లెలుగా చెప్పవచ్చును.

శ్రీశైలములో శివుడు "మల్లికార్జునుడు" అను విషయము ఇట్టి సంకేతము.

## 4. చంద్రుడు :

**"తదోడురాజః కకుభః కరైః ముఖం**
**ప్రాచ్యా విలింపన్నరుణేన శంతమైః**
**స చర్షణీనా ముదగా చ్ఛుచో మృజన్**
**ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః"** **197**

రాసలీలా రంగస్థలానికి అమృత దీపంగా చంద్రుడు ఉదయించాడు. నారాయణతీర్థులు చెప్పినట్లు, శారదకాలశివుని తలపై మెరిసిన యీ చంద్రుడు జ్ఞానసామగ్రిలో ఒక భాగము. మనస్సుకు చంద్రునికి లంకెకలదు.

---

197) అపుడు చంద్రుడు తన కిరణాలతో తూర్పుదిక్కుయొక్క ముఖమును అరుణ వర్ణంతో అలంకరించాడు. చాలాకాలంగా అదృశ్యంగా ఉన్న ప్రియుడు ప్రియురాలికి కనబడినట్లు చంద్రుడు గోవుల గోపికల దుఃఖాలను తుడిచివేస్తూ ఉదయించాడు.

**"మనసః చంద్రమాః ; చంద్రమా మనసో జాతః"**

చంద్రుడు భగవంతుని స్వరూపమే.

**"నక్షత్రాణా మహం శశీ"**
**"ఇంద్రియాణాం మన శ్చాస్మి"** **- గీత.**

అనగా నక్షత్రాలలో చంద్రుడు, ఇంద్రియాలలో మనస్సు ఈ రెండు తానే నన్నాడు కృష్ణుడు. 'మనస్సు, చంద్రుడు' ఒకేటనన్నది శ్రుతి.

మనస్సే సుదర్శన చక్రమని గూడా పురాణోపనిషత్తులు చెప్పుచున్నవి.

అ) **"చలస్వరూప మత్యంతం జవేనాంతరితానిలం**
**చక్రస్వరూపం చ మనోధత్తే విష్ణుః కరేస్థితమ్"** **198**
- విష్ణుపురాణం

ఆ) **"చలస్వరూప మత్యంతం మనశ్చక్రం నిగద్యతే"** - ఉపనిషత్తు

సారాంశమేమనగా-

మనస్సు, చంద్రుడు, భగవంతుడు, సుదర్శనము అన్నియు ఏకస్వరూపములు. ప్రపంచము భగవంతుని స్వరూపమయినను అంశలు భిన్నముగా కనబడును. గదా. ఈ కథలోని స్థలకాలాదులన్నియు హరిమయములే. అందులోనే ఇది లీల.

**"అఖండ మండలో వ్యోమ్ని రరాజోడుగణైః శశీ**
**యధా యదుపతిః కృష్ణో వృష్ణిచక్రావృతో భువి"** **199**

అనిమహర్షి కృష్ణ చంద్రులను, నక్షత్ర గోపాలకులను సరిపోల్చినాడు.

శరీరములో సహస్రారమున చంద్రమండలము కలదు. దానికి క్రిందుగా మనశ్చక్రములో 'మనస్సు' కలదు.

---

198) చంచలము, మిక్కిలి వేగంతో గాలిని గూడా లోగొన్న మనస్సునే చక్రంగా హరి ధరిస్తాడు. మిక్కిలి చంచలమయిన మనస్సే చక్రంగా చెప్పబడినది.

199) గోపసమూహ పరివృతుడయిన గోపాలునివలె ఆకాశంలో చంద్రుడు నక్షత్ర పరివారముతో సంపూర్ణ మండలంతో ప్రకాశిస్తున్నాడు.

**"ప్రదీపకళికాకారం మనోత్రాస్తే తినిర్మలం**
**తస్మిన్ ప్రదీపసదృశో హ్యంతరాత్మా వ్యవస్థితః" 199ఎ**

దీప కళికవలె నిర్మల మనస్సు కలదు. చంద్రుని నుండి మనస్సు పుట్టుట అనగా ఇదే. దీనివలన చంద్రుని, మనస్సును కలిపి ఆలోచింపవచ్చును. ఉదయిస్తున్న చంద్రుడు ఎరుపు. అది విమర్శ స్థితిలో విషయసంగముతో నున్న మనస్సుకు సంకేతము. తరువాత రాగము పోయి ధవళకాంతులతో వెలిగే చంద్రుడు పరిశుద్ధ మనస్సుకు సుదర్శన చక్రమునకు సంకేతము. అట్టి పరిశుద్ధ సామూహిక మనస్సే 'చంద్రుడు'. ఆయన ప్రకాశతత్త్వమునకు ప్రతీక.

**5. వెన్నెల :**

విమర్శ ప్రకాశములలో ఇది ప్రకాశ స్థితి. జ్ఞానప్రకాశము తప్ప వేఱులేదు. రాసలీలకు ముందు చంద్రోదయము. తరువాత కథ అంతా వెన్నెలలో జరిగినది. లంకలో సీతాన్వేషణ గూడా చంద్రోదయానంతరము వెన్నెలలో సాగినది. అది అశోకవనము. ఇది బృందావనము. అయితే ఇది సమాధిస్థితి. అది అన్వేషణస్థితి. రెండు స్థితులకు 'జ్ఞానప్రకాశము' అవసరము.

చంద్రకాంతి గూడా భగవత్ స్వరూపమే.

**"ప్రణవః సర్వవేదేషు ప్రభాస్మి శశిసూర్యయోః"** – గీత.

అమ్మవారు గూడా–

**"తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా"** – లలితాసహస్రం.

అని వెన్నెలగా చెప్పబడినది.

యోగపరముగా ఆజ్ఞాచక్రములోగల "హాకినీశక్తి" వెన్నెలగా చెప్పబడును.

**"ధ్యేయాతు హాకినీశక్తిః చంద్రకాంతి సమప్రభా"** – చక్రకౌముది.

భగవంతుడు స్వీకరించిన యోగమాయ ఈ "హాకినీ" శక్తి విలాసమే కావచ్చును. ఇదే "మనశ్చక్రము".

---

199) ఎ) భ్రూమధ్యంలో దీపకళికవలె నిర్మలమయిన మనస్సుండెను. దానియందు ప్రదీపంవలె అంతరాత్మ ఉండెను.

## 2. గోపికా వశీకరణము

చంద్రుడు అఖండ మండలములో పరవస్తువువలె ప్రకాశించుచున్నాడు. లక్ష్మీవదనమువలె కుంకుమవర్ణముతో నున్నాడు. దేవి విమర్శరూపిణి హిరణ్మయి. విమర్శను రక్తవర్ణముగా యోగులు చెప్పెదరు. చంద్రుడు లక్ష్మీ, సోదరుడు గనుక లక్ష్మీవదనమువలె నున్నాడు. వసంతమయి చంద్ర కిరణములు వ్యాపించినవి. అపుడు "పరమాత్మ" వామలోచనులకు అనగా వామాచారులకు అనగా సంసారులకు మనోహరమయిన అనగా మనస్సులను హరించునట్టి లేదా మనస్సులను ఆకర్షించునట్టి "కల" నాదమును గానముచేసెను. ఈ 'కల' శబ్దము "క్లీం" కారములోని అక్షరములకు సూచన.

ఆ గానము అనంగ వర్ధనము అనగా కామవర్ధనము అని ఒక అర్థము. శరీరేతరమయిన ఆత్మభావమును పెంచునది అని ఒక అర్థము. ఆ నాదము విని జవలోలకుండలలై అనగా వేగమునకు కుండలాలు కదలునట్లుగా గోపికలు పరుగెత్తి వచ్చినారు. కుండలములు అనగా రెండు అర్థములు స్ఫురింపవలెను. 'కుండలిని' శక్తి మూడు మడతలుగా నుండును. సత్వరజస్తమస్సులు ఆ కుండలములు. అట్లే రెండు చెవులకు రెండు కుండలాలు. రెండు చెవులు = రెండు ఉపాసనా మార్గాలు.

**"పితృహూః దక్షిణః కర్ణః దేవహూః ఉత్తరః స్మృతః"**

అనగా దక్షిణ కర్ణము పితృమార్గము. ఉత్తర కర్ణము అనగా ఎడమచెవి దేవమార్గము అని అర్థము. కనుక ఈ రెండు మార్గములను కుండల పదము సూచింపవచ్చును. భగవంతుని వేణుగానము వినినంతనే వారి యీ రెండు మార్గముల అభిమానపు పునాది కదిలినది. భగవంతునిగూర్చి "కాంతః" అన్నారు. కం – సుఖం అని అర్థము. ఆయన సుఖాంతుడు. సర్వసుఖములకు ఆయనయే చివటి లక్ష్యము కనుక 'కాంతుడు'.

అట్లు పరుగెత్తు గోపికలను బంధువులందఱు వారించిరి. అంటే బంధురూప బంధములు అడ్డుపడెను. కొందఱు గోపికలు భగవంతునిదాకా రాలేక అచ్చటనే ధ్యానించి బంధములు తొలగినవారై శరీరమును వదలినారు.

**"జహుః గుణమయం దేహం సద్యః ప్రక్షీణబంధనాః"** **200**

ఈ స్థితిగూడా కామమును సూచించుటలేదు. భగవద్భక్తిని ముక్తిని సూచించుచున్నది జారబుద్ధితో కల్సినా వారికి మోక్షము వచ్చినది. 'జార' అనగా విటుడు, కరిగించువాడు. ఇందులో సామాన్యార్థములో గోపికలకు భగవంతుడు విటుడు అని అందఱకు తెలిసినదే. రెండవ అర్థము అంతరార్థము. "అహల్యాయైజార" అన్నచోట మేఘపరముగా చెప్పిన అర్థములో 'మెట్టభూమిని కరిగించువాడు' అని అర్థము చెప్పబడినది. ఇది శాశ్వతార్థము. ఆ విధంగా సర్వబంధములను మనస్సుతో సహా కరిగించు పరమాత్మను బుద్ధితో కల్సినను అనగాశరీరముతో కలియకపోయినను ముక్తివచ్చినది.

**"త మేవ పరమాత్మానం జారబుద్ధ్యా పి సంగతాః"** **201**

ఇచ్చట భగవంతునియందు 'కామము' ఉంచినను మోక్షమే యని శుకమహర్షి పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానము చెప్పెను. ఆ ప్రశ్న సమాధానములు వాచ్యార్థమును బట్టి పామరులు చెడిపోకుండా చెప్పబడినది. అంతరార్థములో ప్రశ్న సమాధానములు రెండు అనవసరమే. ఇచ్చట గూడా కృష్ణుడు యోగీశ్వరేశ్వరుడని కారణము చెప్పబడినది.

**"యోగీశ్వరేశ్వరే కృష్ణే యత ఏత ద్విముచ్యతే"**

ఇందుకు గోదాదేవి మీరాబాయి మొదలగువారు ఉదాహరణము. వారి కృష్ణప్రేమ ఎట్టిదో గోపికల ప్రేమ అట్టిది. పరపురుష కామము కాదు. పరమపురుష కామము. అది దోషము కాదు.

గోదాదేవి ప్రేమతో, గోపకుమారికలను; మీరాదేవి ప్రేమతో, గోపికలను పోల్చవచ్చును. ఇట్లు వచ్చిన గోపికలతో కృష్ణుడు పెడమాటలు పలికినాడు. అందుకు కారణము వారి మనోగతమును మనకు ఆవిష్కరింప దలచుటయే తప్ప కృష్ణుని అజ్ఞానము కాదు. పరీక్షకాదు. కనుకనే నారాయణతీర్థులు అన్నారు.

---

200) వెంటనే కర్మబంధములు తొలగినవారై తమ గుణనిర్మితమయిన దేహమును (గోపికలు) వదలిరి.

201) జారుడనే బుద్ధితోనయినా గోపికలు పరమాత్మనే కలిసిరి.

**"జ్ఞాత్వా హరిః స్థిరం భావం పరస్మిన్ పుంసి యోషితాం**
**ఆవిష్కరిష్యన్ గోవిందః తాసాం ప్రాహేద మాదరాత్" 202**

స్వామి అన్నారు. "కులస్త్రీలకు ఉపపతి సమాగమము గర్హ్యము కదా." ఈ మాట గోపికలలో కొందఱికి మాత్రమే చెందును. అచ్చట అందఱువచ్చారు. అందఱు పెళ్ళయినవారే అని ఎక్కడను చెప్పలేదు. గోపికలను నాడులు మొదలగు విధముగా అనుకొన్నపుడు గోపాలకులను అధిదేవతలుగా చెప్పి యున్నాము. వారు వీరిలో కొందఱికి పతులు. భగవంతుడు ఉపపతి.

ఉపరి ఇంద్రుడు = ఉపేంద్రుడు అని ఒక నిర్వచనము. అట్లే ఉపరిపతి ఉపపతి అనియు అర్థము వచ్చును. ఏదయినను ఇది వారి భావమును మనకు తెలియపఱచుటకు వాచ్యార్థములో చెప్పిన మాట.

వారు కృష్ణుని కొఱకు 'తదర్థ వినివర్తిత సర్వకామలై' అనగా ఆయన కోసము అన్ని కోరికలు పరిత్యజించి, వచ్చినవారు. అందువలన వారాయనతో తమ గోడు వెళ్ళబోసికొన్నారు. ఇచ్చట ఒక సందేహము వచ్చును.

భగవంతుని కొఱకు "బ్రాహ్మణ స్త్రీలు" కొందఱు ఇట్లే భర్తలు వద్దన్నను యజ్ఞమండపమునుంచి పరుగెత్తికొని వచ్చినారు. వారిని కృష్ణుడు స్వీకరింపలేదు త్రిప్పి పంపినాడు. గోపికలను వాగ్వాదం తరువాత స్వీకరించెను. కారణము ఏమిటి?

1) విప్రకాంతలు భగవంతునికి అన్నము పెట్టుటకై వచ్చియున్నారు. వారికి భగవంతుని అంగసంగమునకై అభిలాష లేదు. దర్శనము మాత్రమే వారి కోరిక.

2) వారికి వేణుగానము వినిపింపలేదు. వారు గోపికలలో కొందఱివలె 'పతివాంఛ'తో కాత్యాయనిని ఆరాధింపలేదు.

3) పతులు విముఖులవుతారని విప్ర స్త్రీలు శంకించిరి. అందువలన తిరిగి వెళ్ళుటకు నిరాకరించగా అట్టి అవమానము ఘటింపదని హామీయిచ్చి

---

202) హరి ఆ గోపికలకు పరమ పురుషునియందు భావం స్థిరంగా ఉందని గ్రహించి ప్రత్యక్షం కాదలచిన వాడై వారితో ఆదరంగా ఇట్లనెను.

కృష్ణుడు వారిని గృహములకు పంపెను. గోపికలు కృష్ణునితో విహారమును కోరినారు. పట్టువదలలేదు. వారు వేణుగాన ప్రేరితలు. కేవలము ప్రతిరాత్రి అదియును శరద్రాత్రుల వఱకు. తరువాత ఆ పిచ్చిలేదు. పగలు ఆ లీలలేదు. కనుక ఇది వేరు.

4) దీనినిబట్టి గూడా కృష్ణుడు జారుడు గాడని చెప్పవచ్చును. జారుడయితే బ్రాహ్మణ స్త్రీలను త్రిప్పి పంపడు. దోషమున్నదనుకొన్నను లేదను కొన్నను సమానమేగదా.

5) కర్మమార్గమును గ్రుడ్డిగా ఆచరించిన ప్రయోజనము లేదని దైవతాత్పర్యమే భగవంతుని మనకు ప్రత్యక్షము చేయునని వివరించుటకు బ్రాహ్మణ స్త్రీల వృత్తాంతము నిదర్శనము. రాసలీల అతిలోకమయిన దివ్యసమాధి. మన శరీరములోని వృత్తాంతము.

ప్రస్తుత కథలో-

గోపికలన్న మాటలు ఆధ్యాత్మికములే. "సర్వవిషయములను పరిత్యజించి వచ్చినవారము ఆదిపురుషుడు మోక్షార్థులను పరిగ్రహించినట్లు నీవు మమ్ము పరిగ్రహింపుము. భర్తలను అనుసరించుట ధర్మమని చెప్పితివి. కాని ఆ భర్తలయందుగూడ వ్యాపించియున్న నీవు దేహధారులకు బంధువువు. ఆత్మవు. అనగా ఇది ఆత్మరూప సేవ. పతివ్రతలు తమ భర్తలయందు దేవతలనే ఉపాసించెదరు. ఆవిధముగా గోపికలు భర్తలయందు వ్యాపించిన దేవతామూర్తినే ఇచ్చట గోరుచున్నారు. కనుకనే భర్తగా, సుతుడుగా, స్నేహితుడుగా ఆయననే వారు భావిస్తున్నట్లు స్పష్టము. కనుకనే పోతనగారు

**"పతి పుత్రాదిక నామమూర్తివగుచున్ భాసిల్లు నీయందు త**
**త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించుటన్యాయమే"**

అని వ్రాసినారు. మూలముగూడా ఈ యర్థమే చెప్పుచున్నది. కాన గోపికలది కామవాంఛ గాదు, కృష్ణునిపై పుత్రభావం గలవారు, పితృభావం గలవారు, సోదర భావం గలవారు, పతిభావం గలవారు ఉన్నారు. గౌరీవ్రతము చేసిన కుమారికలకు పతిభావము ఉండవచ్చును. మిగిలినవారికి వారివారి

భావములు వయసునుబట్టి సంబంధమునుబట్టి యుండును. ఇదిగాక ఆయనయందు సర్వవిధ స్నేహభావ స్వరూపమయిన భక్తిగలదని అంతరార్థము.

**"శ్వేతాశ్వతరోపనిషత్తు"** చెప్పినట్లు

**"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం**
**తం దేవతానాం పరమం హి దైవతం**
**పతిం పతీనాం పరమం పురస్తాత్**
**విదామ దేవం భువనేశ మీడ్యం"** **203**

"సర్వప్రభువు సర్వవిధబంధువు ఆయనయే. ఆ బంధువులయందున్నది ఆయనయే" అని గోపికల జ్ఞానదృష్టి. భగవంతుడు వారికి పుత్రుడుగా సంవత్సర కాలమున్నట్లు బ్రహ్మవృత్తాంతంలో స్పష్టమే. కనుక వారి కోరిక సారాంశము.

**"తన్నః ప్రసీద పరమేశ్వర మాస్మ ఛింద్యాః**
**ఆశాం ధృతాం త్వయి చిరాదరవిందనేత్ర"**

నీయందు పెంచుకొన్న ఆశను తుంచివేయవలదు. కనుక వేణునాదముతో రేగిన మా మన్మధ తాపమును నీ అధరామృతముతో శాంతింప జేయుము. లేనిచో విరహాగ్నిలో భస్మమై నీ పాదములనే చేరెదము.

అంటే భగవంతుడనే భావం స్థిరంగానే ఉన్నది. ఎటయినా ఆయనయే వారి లక్ష్యము. భగవంతునితో విరహం అంటే నిరంతర స్మరణలో నిండి ఉంటుంది. దానివలన వచ్చే "అగ్ని"=జ్ఞానము. అందులో దేహాభిమానమును వదిలి ముక్తి పొందుతారు లేదా ఆయన అధరామృతము వేణునాదము మాత్రమే అని వెనుక సూచించినాము. వేణునాదముతో రేగిన వారి భగవత్కామము వేణునాద పరిపక్వ స్థితిలోనే తగ్గాలి అని భావము. వేణునాదంలో అగ్ని వచ్చింది అని చెప్పినారు. యోగశాస్త్రము ప్రకారము-

---

203) ఆయన ఈశ్వరులకే పరమేశ్వరుడు. దేవతలకే పరదేవత. పతులకు పరమపతి. అట్టి లోకేశ్వరుని మనము తెలిసికొందాం.

**"ధ్వనే రంతర్గతం జ్యోతిః"**

ధ్వనిలో జ్యోతి అంతర్లీనము. నాదమువలన అనాహతములో అగ్నిపుట్టును. అనాహతం హృదయంలో వుంటుంది కనుకనే గోపికలు "హృచ్ఛయాగ్నిం" అన్నారు. తమ వాంఛను 'ఉపాసన' అనిగూడా వారు చెప్పినారు.

**"తన్నః ప్రసీద వృజినార్దన తేంఘ్రిమూలం**
**ప్రాప్తాః విసృజ్య వసతీః త్వదుపాసనాశాః"** **204**

లక్ష్మివలె, తులసివలె, పరమాత్మ పాదపరాగము కొఱకు ఆశ్రయించి నామని వారి ప్రార్థన. పశువులు, పక్షులు, చెట్లు, మృగములు ఏమిచూచి పులకించినవో ఆ రూపమునే మేము ప్రేమించుచున్నాము" అనగా ఇది భగవత్ప్రీతిగాని మానవ శృంగారము కాదని సూచన కనబడుట లేదా? వారు భగవంతుని స్వస్వరూపము తెలిసినవారే, 'భక్తి' గలవారే. తమది కామము గాదని భగవంతుడు తుచ్ఛ మాంసమయ శరీరమును కానుకగా గ్రహించువాడు గాదని తెలిసినదే. కనుకనే వారు కోరినది ఇది.

**"వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోభిజాతో**
**దేవో యధాదిపురుష స్సురలోకగోప్తా**
**తన్నో విధేహి కరపంకజ మార్తబంధో**
**తప్తస్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్"**

అనగా "స్వామీ! ఆదిదేవుడు సురలను రక్షించినట్లు నీవు గోపాలకులకు ఆర్తిహరుడవు. 'ఓ ఆర్తబంధూ! నీవు ఈ దాసీమణుల తప్తస్తనములపై తప్త శిరస్సులపై నీ కరపంకజ ముంచుము అని అర్థము. మఱొకచోట పాదాంబుజము స్తనములపై ఉంచుమని కోరినారు.

**"తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా**
**శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జధూళికా"** **205**

204) పాపసంహారా! మానివాసమును వదలి నిన్నుపాసించాలనే ఆశతో నీ పాదమూలమును చేరితిమి అనుగ్రహించుము.

205) తాపత్రయమనే అగ్నితో సంతప్తులయిన వారిని ఆనందపరచే వెన్నెల; వేదములు తమ పాపటసిందూరముగా ధరించిన పాదధూళి కలది.

అను లలితా నామములను ఇచ్చట అనుసంధానము చేయవలయును. ప్రేమశోకాదులకు ప్రతిస్పందించు లక్షణమునుబట్టి హృదయము భావములకు స్థానముగాను శిరస్సును జ్ఞానస్థానముగాను చెప్పుట లోకప్రసిద్ధము. ఆయన కరపంకజము అభయహస్తమే. స్తనములు హృదయానికి ప్రతీక. పైకి ప్రతీయమానమయిన శృంగారము కొఱకు 'హృదయము' అనుటకు బదులు 'స్తనములు' అన్నారు. తాపత్రయతప్త హృదయమే స్తనములు. వాటియందు అభయహస్తము. ఉంచమని వారికోరిక. ఆయన చేతిని గూర్చి-

**"శంతమే నాంగ పాణినా"**

**"విరచితాభయం వృష్ణిధుర్య తే"**

**"దత్తాభయంచ భుజదండయుగం విలోక్య"** - భాగవతం **206**

అని అభయహస్తముగా చెప్పినారు. అనగా ద్వైతము వలన భయము వచ్చును. అదే హృదయ గ్రంధి.

**"ద్వితీయాద్వైభయం భవతి"**

కనుక అద్వైతజ్ఞానము ఇమ్ము అని అర్థము. ఎలాగూ స్తనముల ప్రస్తావన వచ్చినది కనుక 'స్తనములు' అను పదమునకు అంతరార్థము పరిశీలించవలయును. 'నఖక్షతములు' గూడా చెప్పబడును. కనుక స్తనముల సంగతి యిచ్చటనే పరిశీలించుట మంచిది.

## స్తనములు :

గ్రంథకర్త (వ్యాసుని) ఉద్దేశ్యమును బట్టి విమర్శ సాగవలెను. మన ఇష్టము వచ్చిన భావము గ్రంథముపై రుద్దరాదు. గ్రంథస్వభావము మోక్షజ్ఞాన దానము. గ్రంథభాగాలు అందుకు తగినట్లే సమన్వయము చేయవలయును.

**"శ్రుతిమతస్తర్కోను సంధీయతామ్"** **(శంకరులు)** **207**

---

206) శుభకరమయిన చేతితో, గోపవీరా! అభయహస్తమును చూచి, అభయమిచ్చిన నీ భుజదండ యుగళమును చూచి,

207) వేదమునకు అనుకూలమయిన / వినుటకు ఇంపైన తర్కమును చేయవలయును.

**1. హృదయము :**

**"ఋషిః గురుత్వాత్ శిరసి ధ్యేయత్వాత్ దేవతా హృది**
**ఛందోక్షరత్వాత్ జిహ్వాయాం న్యస్తవ్యం యంత్రవిత్తమైః" 208**

అని తంత్రము. హృదయమునందు దేవతను ధ్యానము చేయవలయును.

**"మధురాయాం విశేషేణ మాంధ్యాయన్ మోక్షమశ్నుతే**
**అష్టపత్రం వికసితం హృత్పద్మం తత్ర సంస్థితమ్ 209**
**దివ్యధ్వజాతపత్రైస్తు చిహ్నితం చరణద్వయమ్"** – గోపాలోత్తరతాపిని.

అని ధ్యానములు చెప్పబడినవి. హృదయపద్మము మధుర. అచ్చట భగవంతుని పాదములను ధ్యానము చేయవలెనను. కనుకనే గోపికలు మఱొకసారి పాదములను తమ స్తనములందుంచమని కోరిరి. భగవంతుడు పాదములు ఉంచుట అనగా ఆయన మన హృదయములందు ప్రవేశించినట్లే గదా. భగవంతుని కాళ్ళను ఆలింగనము చేయవలెను. అనుభావము గూడా చెప్పవచ్చును. అది శరణాగతికి సూచన. కామమునకు గాదు.

**2) హృదయము – "నేను"కు స్థానము :**

"నేను" అనే అహంకారమునకు 'నాది' అనే మమకారమునకు స్థానము హృదయమే.

**"సర్వేషామేవ జంతూనాం సంవిత్ హృదయ ముచ్యతే,**
**న దేహావయవైకాంశో జడజీర్ణోపలోపమః"**

అని యోగవాశిష్ఠము చెప్పుచున్నది. అనగా సమస్త జంతువుల "సంవిత్" అనే జ్ఞానమే హృదయమని, దేహములో నుండే 'గుండె' కాదని చెప్పబడినది. ఇట్టి 'సంవిత్తు' అనే హృదయము మన వక్షస్థలములో కుడివైపు ఉన్నదని శ్రీరమణమహర్షి వివరించియున్నారు. "నాది నేను" అనునపుడు మన చేయి

---

208) గురువు కనుక ఋషిని శిరస్సునందు, దేవత ధ్యానవస్తువు గనుక హృదయమునందు, అక్షరము కనుక మంత్రచ్ఛందస్సును నాలుకమీద ఆవాహన చేయవలయును.

209) నన్ను మధురయందు (హృదయం) విశేషంగా ధ్యానం చేసేవాడు మోక్షమును పొందును. అచ్చట 8 రేకులతో వికసించిన పద్మమున్నది. అచ్చట దివ్యమయిన ధ్వజము, ఛత్రము మొదలగు గుర్తులుగల నా పాదద్వంద్వమును ధ్యానించవలెను.

ఎదురు రొమ్మును తాకేచోటనే ఈ 'హృదయము' ఉన్నదని రమణమహర్షి వెల్లడించెను.

**"పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం"**

అని సుషుమ్నాంతర్గతముగానున్న హృదయస్థానము ఇదే.

'నేను' అను భావము పుట్టగనే నేనుకానిది, ఒకటి ఉన్నదని తెలుస్తున్నది. అది "నాది" కావచ్చును. నీవు కావచ్చును. ఈ ద్వైత్వానికి 'స్తనద్వంద్వము' గుర్తు. రాగద్వేషాలు, అహంకార మమకారాలు మొదలగు ద్వంద్వాలు స్తనద్వంద్వముచేత సూచింపబడును. వీటిపైన కుంకుమ వారి రాగచిహ్నము, రజోగుణ చిహ్నము. ఆ రాగము భగవంతుని పాదములకు సోకుట అనగా తమ అనురాగము ఆయన పాదములపై నిల్చుట అని అర్థము. హృదయము నుండి వెలువడిన అనురాగము, కుంకుమ చూర్ణముగా సంకేతమయినది. ఇచ్చుటనే హృదయగ్రంథి, విష్ణుగ్రంథి గలవు. అవి విడివడిననే మోక్షమార్గము లభించును. సూక్ష్మదేహము, దానిపైగల అభిమానము ఈ విష్ణుగ్రంథిగా చెప్పబడును. భగవంతుని దర్శనమయినచో-

**"భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః**
**క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"** **210**

**"మామకాః పాండవాశ్చైవ**
**కి మకుర్వత సంజయ"** అన్నచోట-

**"మామకాః పాండవాః"** అనగా అహంకార మమకార వృత్తులు అని భావింపవలెనని, కంచిస్వామి రహస్యార్థము సూచించినారు. అట్టివే ఈ స్తనములు. వాటియందు భగవంతుని అభయహస్తము పెట్టినచో 'నేను' అనుభావము తొలగి 'అద్వైతము' సిద్ధించును.

## 3. హృదయం - చిత్తం :

యోగశాస్త్ర ప్రకారము హృదయ స్థానములో 'చిత్తము' ఉండును. ఇది మనస్సులో ఒకరకము.

---

210) ఆ పరాత్పరుని దర్శనమయిన మరుక్షణమే హృదయగ్రంధి ఊడిపోవును. సమస్త సంశయములు భిన్నమగును. సర్వకర్మలు (ప్రారబ్ధంకాదు) తరిగిపోవును.

**"హృదయాన్మనో మనసశ్చంద్రమాః"**

**'హృదిచిత్తం సమాఖ్యాతం'**

మనస్సు సంకల్ప వికల్పములు చేయును. శ్రీరమణమహర్షి 'మనస్సునే మహిషాసురు'డని చెప్పి, వాని కొమ్ములు ఈ సంకల్ప వికల్పములు అని సెలవిచ్చినారు. అట్టి 'మనస్సు' భేదములలో 'చిత్తము' ఒకటి. దీని స్వభావము "ధారణ" ఈ చిత్తము మూడు విధములు.

**"చిత్తం హి ప్రఖ్యా ప్రవృత్తి స్థితి శీలత్వాత్ త్రిగుణం ।**
**ప్రఖ్యారూపం హి చిత్తం సత్వమ్ । రజస్తమోభ్యాం సంసృష్టం**
**చిత్తం ఐశ్వర్య ప్రియం భవతి । ప్రఖ్యాశీలత్వాత్ సత్వగుణం ।**
**ప్రవృత్తిశీలత్వాత్ రజోగుణం । స్థితిశీలత్వాత్ తమోగుణమ్"॥ 211**
**- వాచస్పత్యమ్.**

ప్రఖ్య అనగా జ్ఞానము. భగవద్గీతలో గూడా-

**"సత్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత**
**జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత"**

అనగా సత్వము జ్ఞానరూపమయి సుఖమును గల్గించును. రజోగుణము ప్రవృత్తిరూపమయి కర్మను చేయించును. అజ్ఞాన రూపమయిన తమోగుణము ప్రమాదమును గల్గించును. చిత్తమునకు రజోగుణ తమోగుణములు తగిలినచో ఐశ్వర్యము కావలయునను కోరికలతో తూగుచుండును. ఈ చిత్త స్థానహృదయము నందున్న స్తనములు చిత్తముయొక్క రజోగుణ తమోగుణములకు సంకేతము. ఇవి కాళియుని పడగలవంటివి. వీటిపై నలుపుగూడా కృష్ణపాద చిహ్నముగా భావించవలయును.

**"ఫణిఫణార్పితం తే పదాంబుజం**
**కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్"** - భాగవతం. **212**

---

211) చిత్త్రమునకు 3 గుణాలు కలవు. 1) ప్రఖ్య అనగా జ్ఞానము అది సత్త్వగుణము. ఇది రజోగుణంతోను, తమోగుణంతోను కలిసి ఐశ్వర్యం మీద మక్కువ పెంచుకొంటుంది. కాగా ప్రఖ్యా శీలమయినది సత్త్వగుణం. 2) ప్రవృత్తి శీలమయినది రజోగుణము, 3) అందులోనే నిలిచి మొద్దుబారినది తమోగుణము గలది.

212) కాళియ సర్పము పడగలమీద పెట్టిన నీ పాదపద్మమును మా స్తనము మీద నుంచి మా హృదయ తాపమును పోగొట్టును.

అన్నారు గోపికలు. కాళియుని విషము విఱిచినట్లే స్తనములందలి విషమును అనగా రజోగుణ తమోగుణ ప్రభావములను అణచవలెను అని కోరినట్లు.

## 4. హృదయము - భక్తి :

"కవిభూషణుడు" భక్తిని స్తనములను పోల్చి స్తనములు అనగా భక్తి అని అర్థము చెప్పవలెనని సూచించినాడు.

**"ప్రథమముదితా కించిత్పశ్చా ద్విపృద్ధి ముపేయుషీ**
**హరతి హృదయం పుంసః కాఠిన్యభాగపి భోగదా**
**యదియ మనఘాభక్తిః కాలేన యాత్యపిమార్దవం**
**త దగణి బుధైః గౌణ్యావృత్త్యా కుచాదిపదైః ధ్రువమ్"** **213**

ఈ విషయము వాసుదాసుగారు ఉదాహరించినట్లు గుర్తు.

## స్తనములు - మాతృత్వము :

గోపికలు స్తనములను కుంకుమాక్తములుగా అక్కడక్కడా చెప్పినారు. అది రజోగుణ చిహ్నము. ప్రాణశక్తికి చైతన్యమునకు గూడా చిహ్నము. దేవియొక్క విమర్శ స్వరూపము రక్తవర్ణమే. గోపికలు పచ్చని వర్ణముగల వారుగా చెప్పబడియున్నారు.

**"తటిత ఇవ తా మేఘచక్రే విరేజుః"** - భాగ.

**"మణయ ఇవ తాః పద్మరాగా ఇవాసన్"** - తీర్థులు.

కనుక వారి స్తనములు పచ్చని బంగారు రంగుగా చెప్పవచ్చును. పై 'కొనలు' నలుపుగదా. కనుక రజోగుణ తమోగుణ స్వభావమునకు స్తనములు "రంగును" బట్టి చిహ్నములుగా గ్రహింపవచ్చును. అనగా రజస్తమోగుణములు బలిసి ద్వంద్వరూపములై హృదయమును ఆక్రమించినవి. వాటియందు

---

213) ముందు కొద్దిగా పుడ్తుంది. తరువాత పెరుగుతుంది. పురుషుని మనస్సు లాగుతుంది. కఠినమయినా మంచి భోగం కలిగిస్తుంది. కొంత కాలానికి మృదువుగా మారుతుంది. ఇదంతా భక్తి లక్షణము. ఇదే స్తనలక్షణము గూడా. అందువలన పండితులు పరోక్ష పద్ధతిలో దీనిని 'స్తనం' మొదలయిన పదాలతో సూచించుతారు.

లీనమయియున్న 'సత్వగుణము' ఇంకా పుట్టని క్షీరసంపద వంటిది. భర్త సమాగమము వలననే అది జరుగును. ఇచ్చట పరమేశ్వరుని హస్త స్పర్శవలన సత్వగుణము సమృద్ధిగా ఏర్పడును. కామమునకు భర్త సమాగమము తద్వారా మాతృత్వము ఫలము. భక్తికి భగవంతుని సమాగమము తద్వారా జగన్మాతృత్వము ఫలితము. ఈ స్తన వ్యవహారము గోపికలకే గాదు మనకున్ను అట్లే అన్వయించును.

"జగన్మాత" అయిన లక్ష్మిని వర్ణించిన వేదాంత దేశికుల వారు ఆమెను చైతన్య స్తన్యదాయిని అని స్తుతించినారు.

**"సమస్తజననీం వందే చైతన్య స్తన్య దాయినీం**
**ప్రేయసీం శ్రీనివాసస్య కరుణా మివరూపిణీం"**(దయాశతకం) **214**

అదేవిధముగా గోపికల స్తన్యము చైతన్యము కావలెను. వారు భగవత్కారణ స్వరూపమయిన వారుగదా. కిరణ స్వభావము చైతన్యము.

'సూర్యచంద్రౌ స్తనౌ దేవ్యాః' అన్నసూక్తి ప్రకారము సూర్యచంద్రులు దేవీ స్తనములు. వారు మనకు ఇచ్చేది చైతన్యము. సూర్యచంద్రులకు మూలము అయిన గోలోక గోపికల స్తన్యము చైతన్యము. అది భగవత్ ప్రసాదము వలన సంభవించును. సర్వకాంతులు ఆయనవే గదా.

**"తస్య భాసా సర్వ మిదం విభాతి"** అని గదా శ్రుతి. ఈ అర్థము ప్రకారమే.

**"కమలా కుచచూచుక కుంకుమతో**
**నియతారుణితాఖిల నీలతనో"** **215**

అని సూర్యకాంతిచ్ఛన్నమయిన ఉదయాకాశ స్వరూపముగా సుప్రభాతము నందు స్వామిని వర్ణించుట జరిగినది. అది లక్ష్మీనారాయణుల

---

214) సర్వజనని, చైతన్యమనే స్తనాన్ని ఇచ్చే తల్లి, రూపందాల్చిన దయ అయిన వేంకటేశ్వర ప్రేయసికి నమస్కరించెదను.

215) కమలాదేవియొక్క స్తనములయిన సూర్యచంద్రాదుల ఎర్రని (సుప్రభాతంగదా) కాంతి అనే కుంకుమతో తప్పక ఎర్రబడిన నీలశరీరం గలవాడా!

శృంగారము కాదు. ఇంతవఱకు జ్ఞానపరముగా స్తనములను వర్ణించినాము. ఇక యోగపరముగా చెప్పెదము.

## స్తనములు – యోగార్థము :

1) రెండు చెవులు రెండు మార్గాలను సూచిస్తాయి అని శాస్త్రవాక్యము.

**"పితృహూః దక్షిణః కర్ణః ఉత్తరో దేవహూః స్మృతః"**

కుడిచెవి "పితృయానము"ను అనగా కర్మమార్గమును ఎడమచెవి "దేవయానము"ను అనగా ముక్తిమార్గమును సూచించును. అదేవిధముగా ఎడమ ముక్కు చంద్రమార్గము కుడిముక్కు సూర్యమార్గము అని శాస్త్రము. దీనినిబట్టి స్తనములు గూడా ఈ రెండు మార్గములను సూచించునట్లు భావింప వలయును. అనగా ఇడాపింగళా మార్గములుగా వీటిని గుర్తింపవలయును. వీటిమధ్య భగవంతుడు అనగా సుషుమ్నానాడి, లేదా ఇడా పింగళా నాడులవలన మనము ప్రాణాయామములో పూరక రేచకములు చేసెదము. వాని మధ్య కుంభకముగా పరమాత్మ చేరవలయును. పూరకము బ్రహ్మగాను, రేచకము శివునిగాను, మధ్యస్థితి అయిన కుంభకమును విష్ణువుగాను చెప్పవచ్చును. కృష్ణుడు ఆ మధ్యస్థితి. స్తనములు పూరక రేచకములకు సంకేతము. వాటికి కావలసినది సాధింపవలసినది కుంభకమే. అదే మనోనిశ్చలతకు సమాధికి కారణము.

**"సవ్యాపసవ్య మార్గస్థా"** అని దేవికి విశేషణము. దేవీమంత్రములకు అగస్త్యుడు ప్రధాన శిష్యుడు. ఆయన కుంభసంభవుడు అనగా 'కుంభక ప్రాణాయామశక్తి' దేవీ ప్రసాదమునకు అర్హత తెచ్చిపెట్టును.

2) అజపా మంత్ర విధానము గలదు. "సోహం" అను మంత్రోచ్చారణ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను సూచించును. వానిమధ్య హంసగా ఓంకారముగా అవతరించుటయే స్తనముల మధ్య భగవంతుడు పాదస్పర్శ చేయుట. అనగా అచ్చట నిలుచుట. "గోపికలు= వేదము మొదలగు వాక్కులు. అనుపక్షమున–

'స్తన' ధాతువుకు శబ్దము అని అర్థము.

'స్తనశబ్దే' స్తనయిత్నుః – అనగా మేఘము.

'స్తనితం' అనగా ఉరుము. కనుక "స్తనములు" అనగా ధ్వనులు అని అర్థము చెప్పవచ్చును. ఈ అర్థములో 'స్తనములు' పదము వాడబడినది. తరువాత స్తనములు అను అర్థములో కుచములు మొదలగునవి వాడబడినవి గనుక స్తన పదమును వ్యాఖ్యానించుట ఉత్తమము. కనుక స్తనము=ధ్వని, శబ్దము అనుకొన్నచో-

1) వేదధ్వనులు ఉదాత్తము అనుదాత్తము అను వానిమధ్య సర్వసమాన స్వరమయిన స్వరితముగా భగవంతుడు అవతరించును. కనుకనే ఆయన వేణువును-

**"స్వరితవేణునా సుష్ఠు చుంబితం"** - భాగవతం.

అన్నారు గోపికలు.

2) ఋగ్వేద యజుర్వేదములు మంత్ర, కర్మలకు సంబంధించినవి. అందు స్తోత్రరూపమయిన సామవేదముగా భగవంతుడు అవతరించుటయే స్తన స్పర్శ.

**"వేదానాం సామవేదోస్మి"** - భగవద్గీత.

3) వాగ్దేవికి సాహిత్య సంగీతములు స్తనములని లోకప్రసిద్ధి.

**"సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్"**

లోకసాహిత్యము లోక సంగీతముతోబాటు వేదసాహిత్యము సామసంగీతము చెప్పవచ్చును. ఈ రెండు స్తనములకు గమ్యమయినవాడు లోకభర్తయే గదా.

4) వాక్కునే ప్రత్యక్షముగా ధేనువుగా రూపకము చేసిగూడా చెప్పవచ్చును.

**"వాచం ధేనుముపాసీత తస్యాః చత్వారః స్తనాః స్వాహాకారో వషట్కారః హంతకారః స్వధాకారః"** - బృహదారణ్యం.

1) స్వాహాకారము - ఇది దేవతలను పూజించునది.

2) వషట్కారము.

3) స్వధాకారము - పితృదేవతలను తృప్తిపరచునది.

4) హంతకారము - మనుష్యులను తృప్తిపఱచునది.

అనగా “అతిథిదేవోభవ” ఇత్యాది వచనములచే విధింపబడిన అతిథి పూజాదులు మనుష్య యజ్ఞములు. వానియందు హంతకారము చెప్పబడినది. హంతకారమనగా “కావలసినది అడిగి బాగా తినండి” వంటి మర్యాదలు అని ఆనందగిరి వ్యాఖ్య-

**“యద్య దపేక్షిత మిత్యా ద్యర్థః”**

శ్రాద్ధములందు భోక్తతో గృహస్థు ఇట్టి మర్యాదా వాక్యములను పలుకును. ఇట్లు నాలుగు రకముల స్తనములుగల వాగ్ధేనువును ఉపాసించినచో వాడు వేదస్వరూపు డగును.

**“ఏవం వాగ్ధేనూపాసకః తాద్భావ్యేన ప్రతిపద్యతే” - శం. భా.**
**“తాద్భావ్యం యథోక్తవాగంశాధిక బ్రహ్మరూపత్వం ఇత్యర్థః” 216**
- ఆనందగిరి.

కనుక అట్టి స్తనములందు భగవంతుని తాత్పర్యము ప్రవేశించుటయే ఆయన కర పాదములను స్తనములపై నుంచుమని కోరిన గోపికల రహస్య హృదయము. అంతేగాని స్తనమర్దనము కాదు. పశు శృంగారము కాదు.

ఇక కథలోనికి వచ్చెదము. వారి మొఱ విని యోగీశ్వరేశ్వరుడైనహరి వారితో విహరించెను. ఆ సందర్భములో వైజయంతీ వేణునాదములు తోడున్నవి.

**“ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశత యూథపః**
**మాలాం బిభ్రద్వైజయంతీం వ్యచర త్సవనాద్వనమ్” 217**

ఈ శ్లోకంలో మఱికొన్ని విశేషములున్నవి.

‘ఓమిత్యక్షర ముద్గీథ ముపాసీత’ అను శ్రుతి ప్రకారము ‘ఉద్గాయన్’ అనగా ఉద్గీథ ప్రణవము అని తెలియుచున్నది. వేణునాదము ఓంకారము అని నిరూపించియున్నాము.

---

216) ఇలా వాగ్ధేనువునుపాసన చేయువాడు వేదరూపుడగును. అనగా వేదభాగాతీతమయిన బ్రహ్మముగా అగును.

217) వారిచేత కీర్తింపబడుచు, తాను గానము చేయుచు, ఆ వనమాలాధరుడు వనము నుండి వనమునకు తిరుగుచుండెను.

"వనితాశత" అనుపదము "శతం చైకాచ హృదయస్య నాడ్యః" అన్నట్లు శతనాడుల మధ్యనున్న సుషుమ్నా నాడిని సూచించును. నాడులది ప్రాణఘోష. స్వామిది ఉద్గీథము. ఈ రెండు కలిసి వినబడుచున్నవి. ఇది నాదయోగమును సూచించుచున్నది.

తరువాత స్వామి యమునా నదీతీరమున బంగారు రంగు ఇసుకలో విహరించసాగెను. ఆ రాత్రి ఆ నదిలో తామరపూలు కలువలు కల్సి పరిమళించినవి. రాత్రి తామరపూలు వికసించవు. అట్లు వికసించుట యోగమాయ. అనగా ఈ కథ అంతా యోగవృత్తాంతము. బాల్యముననే యమున చేత తండ్రికి దారి యిప్పించుట యోగవృత్తాంతము కాదా. వారి విహారము విశృంఖలముగా సాగినది. ఆ శ్లోకము వివాదాస్పదమయినది. మొత్తం కథను వివాదంలో ఇరికించిందిదే. చూ॥

**"బాహుప్రసార పరిరంభ కరాలకోరు**
**నీవిస్తనాలభన నర్మనఖాగ్రపాతైః**
**క్ష్వేల్యావలోక హసితైః వ్రజసుందరీణాం**
**ఉత్తంభయన్ రతిపతిం రమయాంచకార"** **218**

1) చేతులు చాపి కౌగిలించికొనుట.

2) చేతులు, ముంగురులు, తొడలు, చీరముడి, స్తనములు వీనిని తాకుట.

3) వేడుకగా గోళ్ళతో గిచ్చుట (నఖక్షతములు)

4) వినోదపు చూపులు, చిఱునవ్వులు – జరిగినట్లు వర్ణన. దీనిద్వారా వారిలోని కాముని భగవంతుడు ప్రోత్సహించినట్లు ఋషివాక్యము. ఇందులో తల్లీపిల్లల మధ్య, అన్నాచెల్లెళ్ళ మధ్యగూడా ఆట సాగునపుడు సహజముగా జరుగు విషయములు ఉన్నవి. ఇక వివాదాస్పదమయిన విషయాలుగా

---

218) చేతులు చాచడం, కౌగిలించికొనడం, చేతులను, ముంగురులను, తొడలను, చీరముడులను, స్తనములను తడమటం వినోదమయిన నఖక్షతములు నవ్వుతూ కేరింతలు గొడ్తూ చూడటం. ఈ క్రియలద్వారా గోపికలలో మన్మథుని వృద్ధి పొందించుచూ శ్రీహరి క్రీడించెను.

కనబడేవి, 'స్తనములు, చీరముడి, నఖక్షతములు అను మూడు మాత్రమే. కౌగిలించికొనినపుడు స్తనములు, ఒడిలో గూర్చొనినచో తొడలు తగుల వచ్చును. ఒక పిల్లవానిని గోపికలందఱు ఎత్తుకొని ముద్దాడినను, ఇట్లు జరుగవచ్చును. తల్లి పాలిచ్చునపుడు గూడా స్తనములపై పిల్లల నఖ దంత చిహ్నములు పడవచ్చును. పిల్లలు మాతృ స్తనములను క్షీరపాన సమయమున తడవుచుండుట కొఱకుట లోకసహజము. ఐదు ఏండ్లవఱకు పిల్లలకు పాలు ఇచ్చుటకు పూర్వము అవకాశము గలదు. మఱియు-

ప్రద్యుమ్నుని బాల్యముననే శంబరాసురుడు హరించెను. యౌవనము వచ్చిన తరువాత శంబరాసుర సంహారముచేసి "రతి" దేవితో వచ్చిన ప్రద్యుమ్నుని చూచిన రుక్మిణీదేవికి స్తనములు ప్రసవించినవి. చూ॥

**"అస్మరత్ స్వసుతం నష్టం స్నేహస్నుతపయోధరా"**

అట్లే కృష్ణశక్తివలన మృతపుత్రులను మఱల చూడగల్గిన దేవకికి స్తనములు స్రవించినట.

**"తాన్ దృష్ట్వా బాలకాన్ దేవీ పుత్రస్నేహ స్నుతస్తనీ" 219**

కనుక స్తన స్పర్శ బాలుడైన కృష్ణునకు అసంభవము కాదు. ఆయన వృద్ధిచేసిన కామము శృ:గారము కాదు. తనయందలి కామము అనగా రతి అనగా భక్తి అనగా 'పరమప్రేమ'. అలంకార శాస్త్రములో సంప్రదాయము ఇదే. ఆ ప్రేమ (ఇంతకుముందు చెప్పినట్లు వారి వయసునుబట్టి పతిపుత్ర సోదరాది బంధుభావన) వారికి ఉన్నది. దానికి తగినట్లు వారు ఆయనను ముద్దాడుచున్నారు. జయదేవుడు చెప్పినట్లు-

**"శ్లిష్యతి కామపి చుంబతి కామపి**
**కామపి రమయతి రామాం**
**పశ్యతి సస్మితచారు పరా**
**మపరా మనుగచ్ఛతి వామాం" 220**

---

219) ఆ పిల్లలను చూచి పుత్రప్రేమతో చనులు చెమర్చినదై దేవకీదేవి.

220) ఒకతెను కౌగిలించుకొనును. ఒకతెను ముద్దాడును. మఱొకతెను ఆడించును. దరహాసంతో అందంగా ఒకతెను చూచును. మఱొక స్త్రీ వెంటపడును.

భౌతికంగా ఆలోచించేవారు కృష్ణుడు సుమారు ఏడు సంవత్సరముల పిల్లవాడని గుర్తుంచుకోవాలి. కనుక పతిగా గోరిన కన్యలతో కొన్ని క్రీడలు పుత్రునిగా చూచువారితో కొన్ని క్రీడలు ఇలా సమన్వయము చేయాలి.

**"గజత్రాతేతి వృద్ధాభిః శ్రీకాంత ఇతి యౌవతైః**
**యధాస్థితశ్చ బాలాభిః దృష్టః శౌరిః సకౌతుకమ్"** అన్నట్లు **221**
**"యే యధా మాం ప్రపద్యంతే తాం స్తధైవ భజామ్యహం" 222**

అన్నట్లు ఈ శ్లోకము సమన్వయము చేసినచో ఆర్ష గ్రంథమునకు న్యాయము జరుగును. కనుక స్తనాలభనం అందఱికి చేసినట్లు చెప్పనక్కఱలేదు. చెప్పినను అది శృంగార సంబంధమని చెప్పనవసరములేదు – అని సారాంశము. ఇది అంతయు భౌతికముగా ఆలోచించినచో అవసరమయిన సమన్వయము. స్తనములు గురించి చెప్పిన యోగజ్ఞాన అర్ధములనుబట్టి ఆలోచించినచో దోషములేదు. సమన్వయము అంతరార్థపరముగా బాగానే కుదురును.

ఇంకొక్క రహస్యము.

ఈ పద్యమునందు జరిగినవన్నియు ప్రధానముగా శరీరములో మధ్య భాగమునకు సంబంధించినవి. ముంగురులు తొడలు తప్ప మిగిలినవి శరీర మధ్యభాగమునకు సంబంధించినవి. 'కంఠము నుంచి కటి' వఱకు మధ్యకూటము అనిపేరు. అధిపతి విష్ణువు. గ్రంథివిష్ణుగ్రంథి బీజము 'క్లీం'.

కామమును ఊర్ధ్వముఖము చేయుచు మధ్యకూటమునందు భగవంతుడు చేసిన శోధనయే యీ పద్య తాత్పర్యము.

**"కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ" 223**

---

221) మధురానగరంలో ప్రవేశించిన కృష్ణుని గజేంద్ర రక్షకుడని వృద్ధస్త్రీలు, లక్ష్మీవల్లభుడని యువతులు మంచి అందమయిన అలంకారములు గలవాడిని బాలికలు చూచిరి.

222) ఎవరు నన్ను ఎలాసేవిస్తే / ధ్యానిస్తే వారిని అలా వరిస్తాను.

223) కంఠము నుంచి కటివఱకు మధ్యకూటం అంటారు. అదే స్వరూపంగా గలది దేవి.

నీవి అనగా చీరముడి. "చీర" మనకు ఆవరణము. గ్రంథి అనగా 'ముడి' అని యర్థము. ఇచ్చట అంతరార్థములో 'నీవి' అనగా విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులు అని భావింపవలయును. అవి నాడీగ్రంథులు గోపికలకు నాడులకు మధ్య సంబంధము నింతకుముందే చెప్పియున్నాము.

భౌతికముగా స్తనములను బహిరంగముగా వర్ణించుట కారణము–

1) ఆ రోజులలో స్తనములకు ఇంతటి గోప్యత లేదు. ప్రాచీన శిల్పమును చూచినను యీ విషయము వాస్తవము. ఇప్పటి కేరళ స్త్రీల పరిస్థితి గమనింపవచ్చును.

**"నో ఘూర్జరీస్తన ఇవాతితరాం ప్రకాశః"** **224**

2) కృష్ణుడు బాలుడగుట. ఇతర పురుషులు లేకుండుట.

3) తరువాత కాలములోగూడా కుచపట్టికలే తప్ప (అంటే కదలికలకు జారే అవకాశము గలవి మాటిమాటికి బిగించవలసిన అవసరము ఉన్నవి) ఇప్పటి రవికలు లేవు. శాకుంతలములో శకుంతల 'నారచీర' ముక్కతో తన వక్షస్థలమును ఆచ్ఛాదన చేసికొన్నట్లు ప్రియంవద బిగించి కట్టినట్లు సాక్ష్యము.

స్తన వర్ణన విషయములో నేటికి నాటికి ఉన్న తేడాను అవగాహన చేసికొనవలసియుండును. కనుక నాటి గోపికా స్తనములు గూఢములు కావు.

**నఖక్షతాలు :**

నరసింహుని నఖములను ఇచ్చట గుర్తు తెచ్చుకొనవలయును.

ఖం= అను పదమునకు చాల అర్థములు గలవు. చూ॥

**"ఖంస్వః సంవిది వ్యోమని ఇంద్రియే**
**శూన్యే బిందౌ సుఖే ఖస్తు సూర్యే"** – హేమచంద్రః.

**"ఖమింద్రియ నఖవ్యోమ నక్షత్రక్షేత్ర పట్టణే"**

– నానార్థ రత్నమాల.

224) గుజరాతీస్త్రీ స్తనమువలె మిక్కిలి బయటకు కనబడదని భావము.

**"ఖ మింద్రియే పురే క్షేత్రే శూన్యే బిందౌ విహాయసి**
**సంవేదనే దేవలోకే కర్మణ్యపి నపుంసకమ్"** – మేదిని.

'ఇఖ' – గతౌ – అని ధాతువు

**"న విద్యతే ఖం స్పర్శగ్రాహకం ఇంద్రియం ఆకాశః 225**
**యత్ర తత్ నఖం"** – గురుబాల ప్రబోధిని.

కనుక 'నఖ' శబ్దానికి అనేక అర్థములు గలవు. ప్రస్తుత గ్రంథ సందర్భానికి అవసరమయిన అర్థాలు ఇవి.

1) సంవిత్తు = జ్ఞానము = ఖం, నఖం = అజ్ఞానము.

2) ఖం = బ్రహ్మ; నఖం = బ్రహ్మకానిది / బ్రహ్మలేనిది.

3) ఖం = ఇంద్రియము; నఖం = ఇంద్రియము కానిది. ఇంద్రియము లేనిది. అనగా అతీంద్రియజ్ఞానము.

4) ఖం కర్మ – నఖం కర్మకానిది.

5) ఖం – శూన్యం. నఖం – శూన్యము కానిది, పూర్ణము.

6) నఖములు 10 కనుక నఖాగ్రములు అనగా దశేంద్రియముల కొనలు. అంటే వాటి ప్రసరణలుగా చెప్పవచ్చును. వాటికి వేఱుగా కొనలు అంటూ ఉండవు గదా!

7) నఖ – గోళ్ళు. భగవంతుడు కాంతి స్వరూపుడు ప్రణవ స్వరూపుడు కనుక ఆ కాంతికొనలు నఖాగ్రములు అని చెప్పవచ్చును.

ఇక 'పాత' శబ్దమునకు రెండు అర్థములు గలవు. ప్రసరింపజేయుట, పడగొట్టుట. పై అర్థములకు ఈ యర్థములను యోగ్యతనుబట్టి జోడించినచో క్రింది అర్థములు వచ్చును.

1) అజ్ఞాన ప్రసరణలను, బ్రహ్మ భిన్నమైన ఆలోచనలను పడగొట్టుట.

2) అతీంద్రియ జ్ఞానమును, 'కర్మ' భిన్నమయిన జ్ఞానమును, పూర్ణభావనను ప్రసరింపజేయుట.

---

225) ఖం అనగా స్పర్శేంద్రియము. అది లేనిది గనుక 'గోరు' నఖం.

3) భగవంతుడు తన కాంతులను / ఓంకారము తన నాదకిరణములను ప్రసరించుట.

ఇందు రెండవ అర్థము శ్రేయస్కరము. కారణము భౌతిక శృంగారము నందు నఖక్షతములు చేయబడిన గుర్తులుండును. అట్లే 'జ్ఞాన' ప్రసరణకు గూడా చిహ్నములు మిగిలియుండును. మొత్తముమీద మూడు అర్థములు సమానమే.

భగవంతుని కాంతిప్రసారము వలన వ్యక్తికి పూర్ణత జ్ఞానము భాసించును. దీనికిముందు అజ్ఞానము నివర్తించును. కనుక మూడు అర్థములు కలిపి ఆలోచింపవలయును. ఈ యర్థములకు నిఘంటు ప్రమాణము చూపబడినది. ఇక పురాణ ప్రమాణము.

**పద్మపురాణము :**

**"నఖేందు కిరణ శ్రేణీ పూర్ణబ్రహ్మైక కారణం**
**యన్నఖేందు రుచిః బ్రహ్మ ధ్యేయం బ్రహ్మాదిభి స్సురైః" 226**

అనగా గోళ్ళ కిరణములు పూర్ణ బ్రహ్మస్వరూపము. నఖ చంద్రకాంతియే బ్రహ్మము.

ఇక కాలిగోళ్ళ సంగతి.

**"తదంఘ్రి పంకజ ద్వంద్వ నఖచంద్ర మణిప్రభాః**
**ఆహుః పూర్ణ బ్రహ్మణోపి కారణం వేదదుర్గమం" 227**

అనగా కాలిగోళ్ళు గూడా ప్రపంచ హేతువులు, బ్రహ్మస్వరూపములు. చేతి గోళ్ళకు, కాలి గోళ్ళకు తేడాలేక పోవుటకు కారణము ఏమి? అవి అన్నియు భగవత్కిరణములే కనుక. భగవంతుడు ఓంకార స్వరూపుడయినచో ఆయున నఖములు ఓంకార నాదములు కావలసియుండును.

---

226) కృష్ణుని నఖచంద్ర కిరణసమూహమే పూర్ణబ్రహ్మకారణము. ఆయున నఖచంద్రకాంతియే బ్రహ్మాది ధ్యేయమయిన బ్రహ్మము.

227) కృష్ణుని పాదపద్మ నఖచంద్రుల మణికాంతులే పూర్ణబ్రహ్మకు కారణ పదార్థములని అందురు.

నాదాంతర్గతమయిన (ధ్వనేరంతర్గతం జ్యోతిః) కాంతియే నఖాగ్ర ప్రసారములు అని చెప్పవచ్చును. కనుకనే పద్మపురాణము చెప్పినది.

**"తం భజే నందసూనుం యన్నఖతేజః పరం మనుః"**

పరమనువు అనగా ఓంకారము. తంత్రములలో ఓంకారమును 'పరాప్రాసాద మంత్రము' అని పిలిచెదరు. భగవంతుని నఖతేజస్సు 'ఓంకార మంత్రము' అని సారాంశము అదే 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'.

ఓంకార నాదము నఖాగ్రములు అను ఈ సందర్భములో పూర్వవిషయములు కొన్ని గుర్తు చేసికొనవలయును.

1) శరదృతువు అనగా భ్రూమధ్యము అని రాసలీలాస్థలము భ్రూమధ్యములోని ఆజ్ఞాచక్రము అని.

2) ఆజ్ఞాచక్రమునందే మనస్సు, ఓంకారము ఉండునని, అది కాంతికేంద్రమని, అచ్చటినుంచి కాంతికిరణము క్రిందకు వచ్చుననియు గ్రహింపవలయును.

ఈ కాంతి సమక్షముననే శరీర శోధన జరుగును. చంద్రునికాంతిలోనే లంకలో సీతాన్వేషణ జరిగినది. పైగా ఈ నాదము ఆజ్ఞాచక్రము దాటిన తరువాత అర్ధచంద్ర స్వరూపముగా మారునని యోగశాస్త్రము. నఖములకు అర్ధచంద్రునితో పోలిక కవి సమయములలో నున్నదియే. ఓంకారము పైన నుండే అనునాసికములో అర్ధచంద్రుని సామ్యము కలదు. ఈ భ్రూమధ్యమునే అవిముక్తక్షేత్రమని అనగా వారణాసి అని 'తారసారోపనిషత్తు', 'జాబాలోపనిషత్తు' చెప్పినవి.

**"భ్రువోః ఘ్రాణస్య చ సంధిః ఏతద్వైసంధిం**
**సంధ్యాం బ్రహ్మవిద ఉపాసతే - సో విముక్త ఉపాస్యః" 229**

ఇచ్చట ఓంకారముండునని అద్వయతారకోపనిషత్తు చెప్పుచున్నది.

---

228) తన నఖకాంతియే మహామంత్రమయిన ఓంకారము. అట్టి కృష్ణునకు నమస్కారము.
229) కనుబొమ్మలకు ముక్కుకు మధ్యనున్న సంధి. దీనిని సంధ్యగా బ్రహ్మవేత్త లుపాసించెదరు.

**"భ్రూయుగ మధ్యబిలే దృష్టిః తద్వారా ఊర్ధ్వస్థిత**
**తేజః ఆవిర్భూతం తారకయోగో భవతి"** **230**

కనుకనే కాశీలో మరణించువారికి పరమశివుడు తారక మంత్రోపదేశము చేయును అందురు. ఆజ్ఞాచక్ర ప్రకరణములో 'చక్రకౌముది'

**"సౌదామినీ సమం తస్మిన్ వేదాదిం సంస్మరేత్ బుధః"** **231**

అని చెప్పినది. కనుక భ్రూమధ్యగతంగా 'కాంతి' కనబడును. అది ప్రణవమే అని తెలియుచున్నది. కనుకనే లలితాదేవిని సహస్ర నామములలో ఇట్లు వర్ణించిరి.

**"నఖదీధితి సంఛన్న సమజ్జన తమోగుణా**
**భక్తహార్దతమోభేద భానుమద్భాను సంతతిః**
**కరాంగులి నఖోత్పన్న నారాయణ దశాకృతిః"** **232**

అని "నఖముల" మహిమ కొనియాడబడినది.

కనుక కృష్ణుని నఖములు అటువంటివే. ఆ నక్షఖతములు అట్టివే. హృదయగతమయిన తమో రజోగుణములు అహంకార మమకారములు. ఇతర ద్వంద్వబాధలు వీటివలన వచ్చిన తాపత్రయము – ఇదంతా స్తనములకు రహస్యార్థము. వానికి పరిహారముగా ఈ నఖములు 'ఇంద్రియ జన్యబాధలను' పోగొట్టి జ్ఞానకాంతి ప్రసారములు కల్గించుటద్వారా హృదయగ్రంథిని ఛేదించుట అతీంద్రియమయిన ఆనందమును కల్గించుట అను రెండు పనులను చేయును. అదే గోపికల మాట.

గోపికలు = వాక్కులు అనుకొన్నపుడు వాటి స్తనములను అనగా స్వాహాస్వధా మొదలగువాని అంతరార్థమును పిండి అసలు విషయమును లేదా క్షీరమును అందటికి ఇమ్ము అని అర్థము. పొదుగునుంచి పాలు

---

230) కనుబొమ్మలమధ్యనున్న రంధ్రమున గుహలో దృష్టి నిలపాలి. దానివలన పైన ఉన్న తేజస్సు ఆవిర్భవించును. ఆ తేజస్సు తారక (ఓం) యోగము.

231) అచ్చట మెరుపు తీగవంటి ఓంకారమును స్మరింపవలయును.

232) గోటికాంతులతో భక్తుల తమస్సును పోగొట్టునది. భక్త హృదయాంధకారమును పోగొట్టు కిరణములు గలది. చేతివ్రేళ్ల నుంచి దశావతారములను పుట్టించినది.

పిండునపుడు గోళ్ళు తగులుగుట సహజమే. కనుక నఖక్షతములు అవి. ఆ నఖములు ఓంకార కాంతులే. ప్రతి మంత్రమును ఓంకారరూప పరబ్రహ్మకు సంబంధించినదిగా గ్రహించునట్లు చేయుటయే ఇచ్చట ప్రార్థన. అంతేకాని భౌతిక శృంగారము కాదు. లేనిచో 'గోప్యో గావ ఋచః' అను సంప్రదాయ స్వారస్యములు గతిహీనములగును.

## గర్వభంగము - అంతర్ధాన లీల :

అపూర్వమయిన కృష్ణసమాగమముతో గోపికలకు ముందు, తర్వాత రాధకు గర్వము వచ్చినది. భగవంతుడు గోపికాలోలుడు కాదు కనుక వారిని గర్వమణచి బాగుచేయదలచి అంతర్ధానమయ్యెను.

**"ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంత రధీయత" 233**

ఈ అంతర్ధానమునుగూర్చి నారాయణ తీర్థులు వ్రాయుచు-

**"కదాచిద్గోవిందే గతవతి పరానందసదనం**
**నిరాకారం ధామ స్వక మితి చ విజ్ఞాపయతి తాః" 234**

అన్నారు. సగుణంగా వారికి కనబడిన స్వామి 'నిర్గుణం'గా అయినాడు. ఇచ్చట ధామ=కాంతి, గృహము అని రెండు అర్థములు.

హనుమంతుడు సీతను వెదకినట్లు వారు కృష్ణుని ఆరాత్రి వెన్నెలలో బృందావనములో వెదకిరి. ఈ అన్వేషణ అంతా 'అద్వైతభావన'తోనే జరిగినది. తామే కృష్ణుడుగా భావించి విహరించుట. ప్రతిచెట్టు, ప్రతి పుట్ట కృష్ణునితో నిండి ఉన్నట్లు భావించుట అనునవి ఇందు ప్రధానాంశములు. పైకి శృంగారపు ఉన్మాదము లోపల భక్తి జ్ఞానదృష్టి ఇందు మిళితమయి యున్నవి. వారి అన్వేషణ కాళిందీ నదీతీరములలో వెన్నెల సోకినంతవఱకు జరిగినది. చీకటిగానున్న నదీప్రాంతమును వదలినారు. దానికి కారణము-

1) చీకటిలో శ్యాముని వారు వెదకలేరు కనుక. ఇది బాహ్యకథలో కారణము.

---

233) వారి గర్వశాంతికి అనుగ్రహానికి హరి అచ్చటనే అంతర్ధానమయ్యెను.
234) ఒకనాడు గోవిందుడు పరమానంద స్థానమును చేరి తనరూపము నిరాకారమని వారికి తెలిపెను.

2) అజ్ఞానమే చీకటి. భగవంతుడున్నచోట అజ్ఞానముండదు. అజ్ఞానములో భగవంతుడు దొరకడు. కనుక అచ్చట వెదకనవసరములేదు. ఇది జ్ఞానపరమయిన కారణము.

3) మూలాధార స్వాధిష్ఠానములు చీకటి చక్రములు. వాటిలో భగవంతుని జాడ దొరకదు. కనుక కాంతిచక్రములయిన మణిపూరము వఱకు వారు భగవంతుని జాడకై శోధించారు. కాని భగవంతుడు దొఱకలేదు. కారణము తీర్థులవారు చెప్పినట్లు కృష్ణుడు నిర్గుణ స్వరూపములో లీనమయినాడు. నిర్గుణ స్థానము బ్రహ్మరంధ్రము. వీరి ప్రయాణము అందుకు వ్యతిరేక దిశలో సాగినది. పైగా ఆరోజు 'పూర్ణిమ' కనుక చంద్రాస్తమయము లేదు. పైగా రాసలీలా నృత్యము వెన్నెలలోనే జరుగును. చీకటిలోనే బృందావనము వచ్చినవారికి చీకటి భయములేదు. కనుక భయముకాని, చంద్రాస్తమయము కాని యీ చీకటి విషయములో కారణములుగా చెప్పరాదు. పైన చెప్పిన మూడు కారణములే చెప్పదగినవి.

**గోపికాగీత :**

సురతనాథ! మేము నీకు జీతములేని పరిచారికలము. అనగా పీఠికా భాగములో చెప్పినట్లు సురతము అనగా సహస్రారము పైన బిందుస్థానములో కుండలినీశక్తి కలియుటయే సురతము. జీతములేని వారమనగా నిష్కామభక్తి యోగినులము అని సూచించుట. మానసిక చింతలను తొలగించే నీ పాదాంబుజము మా స్తనములపై అర్పింపుము. ఆ పాదాంబుజము ఇంతకుముందు పాము పగడలపై ఉంచావు. అది హృదయతాపమును ఆర్పగలదు. సురతాన్ని బాగా నడిపించేది శోకాన్ని పోగొట్టేది మనుష్యులకు ఇతర రాగములను పోగొట్టే నీ అధరామృతమును మాకు అందిమ్ము. (ఈ యధరామృతము వేణుగానమే అని ఇంతకుముందే చెప్పియున్నాము.)

వారి ప్రార్థనవిని కృష్ణస్వామి ప్రత్యక్షమయినాడు. ఈ ప్రత్యక్షము అంతర్ధానము - ఇవి అన్నియు కథ యోగవృత్తాంతము అని చెప్పుచున్నవి.

ఆయన సాక్షాత్తు మన్మథమన్మథుడై ఆవిర్భవించాడు. "పుంసాం మోహనరూపుడు" అని అర్థము. కోరికలన్నీ భగవంతుని ముందఱ నశించి ఆయన యందలి కోరికయే నిలుచును. కనుక ఆయన మన్మథమన్మథుడు. పైగా

**"ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ"** **235**

తరువాత గోపికలంతా ఆ భగవంతుని సేవించారు. ఒక స్త్రీ ఆయన చేతిని ఒక గోపిక ఆయన కాలును పట్టుకొనిరి. ఒక స్త్రీ ఆయనవైపు తేరిపాఱ చూచుచున్నది. మఱొక ఆమె చూచిన కృష్ణరూపమును మనసున నిలుపుకొని యోగివలె మనస్సులోనే కౌగిలించికొన్నది. పూర్వముగూడా మనము ఈ విషయము చెప్పియున్నాము. గోపికలందఱు అన్ని విధముల సేవించారని చెప్పవలసిన పనిలేదు. వారి యిష్టాన్నిబట్టి, వయస్సునుబట్టి, వరుసనుబట్టి సేవించారు. వారి మధ్యలో కొలువు దీఱిన వాసుదేవుడు ప్రకృతి మొదలగు తత్వముల మధ్యనున్న పరమ పురుషునివలె, జ్ఞానవీర్యబలాదుల మధ్యనున్న సాధకునివలె, కనిపించెను.

**"పురుషః శక్తిభిర్యథా"     – భాగ.**

భగవద్దర్శనంతో వారు వేదమాతవలె పూర్ణకామలయినారు. స్తన కుంకుమ సోకి ఎఱ్ఱవాఱిన తమ పైటలతో ఆసనము చేసి స్వామికి సమర్పించారు. అంటే హృదయగత అహంకార మమకారాలు మడిచిపెట్టి సర్వం స్వామిపరం గావించారు.

తన అంతర్ధానానికి కారణము చెప్పిన స్వామి అంతర్ధాన సమయములో వారిలో చెలరేగిన తాత్పర్యమే ముక్తి హేతువని శరీరసంగము తాత్కాలిక మని మానసిక సంయోగము శాశ్వతమని బోధించాడు. వారికి తత్వబోధ చేసినాడు. **తీర్థులవారి గ్రంథములో అది చదివి తీరవలసిన ఘట్టము.** ఉపనిషత్సారము కరిగించి పోసిన అచ్చులు అందులో ఉన్నవి. కనుక 'భాగవత తరంగములు' చదువవలెను.

## హల్లీసకము :

"మొదట కృష్ణుడు వేఱు మేము వేఱు" అన్న భావముతో గోపికలు భక్తియోగము చూపినారు. కనుక కృష్ణుడు బహురూపములు స్వీకరింపలేదు. తరువాత కృష్ణుడు అదృశ్యముగా అయినపుడు వారు తమను కృష్ణరూపాలుగా

235) ధర్మ సమ్మతమయిన కామమును నేను.

భావించి క్రీడించారు. చెట్టు చేమలు పరిసరాలలో కృష్ణుడున్నట్లు భావించి వెదకినారు. పరిసరజీవులుగూడా చైతన్యరూపములే తమవంటివే యని భావించి వాటిని ప్రశ్నించారు.

**"తచ్చింతయాన్యత్ నిభృతో నవేద"** అన్నట్లుగా అయినది. **236**

**"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** **237**

అన్నట్లు వారు సర్వత్ర 'నారాయణ కవచము' భావించినారు. ఈ అర్హతనుబట్టి స్వామి బహురూపధారియై 'కాయవ్యూహ' యోగమును ప్రదర్శించినాడు. అదే రాసలీలా హల్లీసకము.

హల్లీసకమనగా మధ్యకేంద్రము చుట్టూ "మండలాకార నృత్యము" చేయుట. ఇది అణువులో కేంద్రముచుట్టూ ఎలక్ట్రానులు ప్రదక్షిణము చేయుట వంటిది. సూర్యునిచుట్టూ సౌరకుటుంబము ప్రదక్షిణము చేయుట వంటిది. అయస్కాంతము చుట్టూ సూదులు ప్రదక్షిణము చేయుట వంటిది. ఆజ్ఞాచక్ర ప్రాంతము కనుక ఇచ్చట మనస్సుండును. మనస్సు బిందువు .దీపకళిక వంటిది. అది గుండ్రము కనుక హల్లీసకము గుండ్రము. మనసు మధ్యలో ఓంకారము. ఓంకారములో అంతరాత్మ ఉండును. ఆ విధముగా హల్లీసకం మధ్యలో కృష్ణస్వరూపం వారి అందటిలో అంతరాత్మ అంతర్యామి. ఇదీ పరిస్థితి. నటరాజ నాట్యలీలవలె ఇందులో వాగర్థములు కలిసి నృత్యము చేయుచున్నట్లు భావింపవచ్చును. ఈ రాసలీలా సమయములో దేవదుందుభులు మ్రోగుట మొదలగు విషయములు లయ యోగమును సూచించుచున్నవి. గోపికలు శబ్దస్వరూపలు. అందువలననే-

**"స ప్రియాణా మభూత్ శబ్దః తుములో రాసమండలే"** **238**

అన్నారు మహర్షి.

**"రంజనీ రమణీ రస్యా రణత్కింకిణి మేఖలా"**

**"రతిరూపా రతిప్రియా రామా రమణలంపటా"** **239**

---

236) హరిచింతనతో లీనుడై ఇతర జ్ఞానము లేకుండెను.

237) లోపల బయట వ్యాపించి నారాయణుడుండెను.

238) రాసమండలమున ప్రియురాండ్ర సవ్వడి సందడిగా నుండెను.

239) ఆనంద పఱచునది, మనోహరమయినది, రసోచితమయినది, కింకిణి మేఖలా ధ్వనులు గలది, రతి రూపమయినది. రతి యందాసక్తి గలది, ప్రియునిపై ప్రేమగలది.

అను లలితా స్వరూపములు ఈ గోపికలలో గోచరించుచున్నవి. గోపీ అనగా కాపాడునది అనియు అర్థము. ఆ రక్షణశక్తి స్వరూపములే వీరు. మధ్యలో గోవిందుడు ఆమె రూపమే. "గోప్త్రీ గోవిందరూపిణీ" గదా. **240**

శాక్తేయదృష్టిలో దేవికి స్వశక్తి రూపములతో జరిగిన క్రీడ యిది.

**"కామకేళీ తరంగితా హల్లీస లాస్య సంతుష్టా**
**ధ్యానధ్యాతృధ్యేయరూపా ధర్మాధర్మ వివర్జితా" 241**

అన్నట్లు గోపికాకృష్ణులు ఏకమై చేసిన రాసలీల యిది. ఈ రాసగోష్ఠికి భ్రమరములు గాయకులుగా ఉన్నారట. భ్రమరములు తుమ్మెదలు మాత్రము అనుకొనరాదు. ఇవి జీవులకు సంకేతములు.

**"భ్రమరగాయక రాసగోష్ఠ్యామ్" - భాగ 242**

తుమ్మెదలు జీవులు అనుకొనుటకు ప్రమాణము భువనేశ్వరీ సంహితలో గలదు.

**"ద్విరేఫా జీవరూపాః స్యుః తయా హస్తే ధృతాః సదా,**
**జీవాధీశా తతః ప్రోక్తా భ్రామరీ లోకసుందరీ" 243**

తరువాత వచ్చే భ్రమరగీతకు గూడా ఇదే సూచన.

ఈ రాసలీలలో కృష్ణుడు "ఒక బాలుడు తన ప్రతిబింబములతో క్రీడించినట్లు క్రీడించెను.

**"యధార్భకః స్వప్రతిబింబ విభ్రమైః"**

అనగా భేదభావము లేదు. బాలుని స్థితి నిష్కల్మషస్థితి. ఈ రాసలీలను మహనీయులు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు కాలపరముగా ఊహించిన తీరు జిజ్ఞాసువులకు మార్గదర్శకముగా నున్నది. సృష్టి, ప్రళయలీలగా–

---

240) గోప్త్రి, రక్షకురాలు, గోవిందరూపం గలది.

241) కామకళలయందు సంతోషించినది, హల్లీసకమనే నృత్యమునందిష్టము గలది. ధ్యానము, ధ్యానకర్త, ధ్యానలక్ష్యము తనే అయినది. ధర్మము - అధర్మములకు దూరమయినది.

242) భ్రమరులు గాన కర్తలుగా నున్న రాసలీలలో

243) తుమ్మెదలు జీవులే. ఆమె వారిని తన చేత ధరించి యున్నది. అందువలన జీవాధీశురాలయిన దేవిని భ్రామరి అందురు.

**"ఒకట విస్తృతమండలాకృతి నున్మిషద్రసభావలై**
**వికచనేత్రలు విస్తృతాంబరవేష్టితల్ వ్రజకాంత లిం**
**కొకట గుంచితమండలాకృతి నోలి మూయగ గన్నులన్**
**సకలసృష్టి లయమ్మునందుచ సాగివచ్చినయట్టులై"** **244**

అనగా మండల నృత్యములో వారు వృత్తమును పెద్దది చేయుచు దూరముగా జరుగగా అది సృష్టి కాలలీల. మఱల దగ్గరగా ముందుకు జరుగుచు రాగా అది ప్రళయకాలలీల. వారు కన్నులుతెఱచినపుడు సృష్టిలీల.

**"ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః"** అని అర్థము. **245**

## సంవత్సరలీల :

వారు ఋతువులుగా కృష్ణుడు ఋతువుల ఆద్యంతమయిన మధుమాసం లాగాను ఉన్నారట.

## మాసలీల :

గోపికా మందహాసములు శుక్లపక్షములు వారికి ఆ కాంతినిచ్చు కృష్ణుడు కృష్ణపక్షములు.

**"ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండల పూజితా"**
అను లలితా స్వరూపము ఇది.

## దినలీల :

ఎఱ్ఱటి పెదవులు సంధ్యాకాలాలు. గోపికలు పగళ్ళు. వారి నడుమ నున్న నీలమేఘశ్యాముడు (అవ్యక్తరూపుడు గనుక ఆకాశమువలె నీలము) రాత్రులుగా నున్నాడు. ఇదిగాక ప్రణవలీలగా గూడా శ్రీ ఇ.కె.గారు భావించారు.

---

244) వ్రజభామలు ఒకవైపు విశాలమయిన మండలాలుగా సరసభావాలతో వికసించిన నేత్రాలతో సృష్టి నృత్యము నిర్వహించుచుండగా, మఱొకవైపున మండలమును సంకోచించుచు కన్నులు మూయుచు లయనృత్యము చేయుచుండిరి. ఇదే సకల సృష్టి లయములను సూచించుచుండెను.

245) కన్నులు తెరవడంతో లోకసృష్టి కన్నులు మూయడంతో లోకప్రళయము జరుపునట్టి తల్లి.

**"నవ్యతరమైన యాత్మగానమ్ము నందు**
**స్వరములై గోపకాంతలు మురిసియాడ**
**నాదకందరహర్యక్ష వేదమూర్తి**
**యందు నెడనెడ శ్రుతియౌచు వ్యక్తమయ్యె" 246**

**"రాసలీలా" సమన్వయము**

**యోగపరముగా :**

భగవంతుడు సహస్రారమున బిందురూపముగా గలడు. అచ్చటనుంచి ఆజ్ఞయందు సృష్టికి ఉన్ముఖమయి ద్వైతరూపము స్వీకరించాడు. ఆయననుంచి బయలుదేరిన అణిమాదికిరణములు క్రమముగా లోకసృష్టి చేసినవి. లోకమున కంతకు పరమాత్మ కేంద్రము. ఆయనచుట్టూ ఆయన శక్తితో "తమేవభాంత మనుభాతిసర్వం" అన్నట్లు ఈ ప్రపంచము తిరుగుచున్నది. సమాధి స్థితిలో క్రిందనుంచి పైకి ఒక్కొక్క లోకమే దాటివెళ్ళే జీవునకు భగవంతునితో తాదాత్మ్యము వచ్చును. ఆ స్థితిలో ఆజ్ఞలో కిరణచక్ర పరివేష్టితుడయిన స్వామి దర్శనము జరుగును. దీపంచుట్టూ కిరణాలున్నట్లు ఆజ్ఞలో కనబడే ప్రణవదీపం అంతరాత్మచుట్టూ ఉండే యీ కిరణాలే గోపికలు. అదేరాసలీల. ఆజ్ఞకు పైన నిత్యఘనమయిన బ్రహ్మమే. ఈ రాసలీలా దృశ్యము వేదంలో గూడా ఉన్నదని హరివంశ దీపవ్యాఖ్యాకారుడు వివరించెను.

**"పద్యా వస్తే పురురూపా వపూంషి**
**ఊర్ధ్వాతస్థౌ త్ర్యవిం రేరిహాణా**
**ఋతస్యసద్మ విచరామి విద్వాన్**
**మహద్దేవానా మసురత్వ మేకం"**

ఇది రాసక్రీడలో కృష్ణుడు అదృశ్యమయినపుడు ఒక గోపిక అన్నమాట. భావమేమనగా–

నీ మూర్తి అనేక రూపములను ధరించినది. అది తనముందు తన ప్రక్కలనున్న రూపమును చూచుచున్నది. అది ధర్మగృహము. దానిని తెలిసి

246) నూతనమయిన యీ ఆత్మగానంలో గోపికలు స్వరములుగా నృత్యం చేస్తున్నారు. నాద (ఓంకార) గుహలోనున్న సింహమువలె నున్న కృష్ణుడు రాగంలో శ్రుతిలాగా మధ్యమధ్య దృశ్యమగుచుండెను.

కొనుటకు తిరుగుచున్నాను. కాని దానినుంచి నన్ను దూరము చేసిన దేవతలు నిర్ఘయులు రాక్షసులవంటివారు. దీనిని పోలినదే “నమకం”లో-

**“అసౌ యోపసర్పతి నీలగ్రీవో విలోహితః**
**ఉతైనం గోపా అదృశ న్నదృశన్నుదహార్యః**
**ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతి నః” 247**

**జ్ఞానపరముగా :**

1) “గోవులు రశ్మిలు” అనుకొన్న పక్షమున, భగవంతుని అణిమాది శక్తులు ఈ రశ్మిలు భావింపవచ్చును.

2) “తమేవ భాంతమనుభాతి సర్వం” అన్నట్లు ఉపగ్రహము లన్నియు సూర్యుని నుంచి కాంతిని గ్రహించి సూర్యునకే ప్రదక్షిణముగా తిరుగుచు హారతి ఇచ్చుచున్నట్లు కిరణములన్నియు కాంతి మూలమయిన భగవంతునకు ప్రదక్షిణ నీరాజనాలు చేసినట్లు.

3) 24 తత్వాలు ఉరుక్రముడైన భగవంతుని సాన్నిధ్యముననే అర్థవంతములయి సృష్టికి పరస్పరము సహకరించికొనును. 24 తత్వములకు ప్రతీక అయిన గాయత్రిలో ప్రతి అక్షరము ఒక తత్వమునకు సంకేతము. గో శబ్దమునకు గాయత్రి అనిగూడా అర్థము. అధారాధేయభావసంబంధము వలన గోవులు గోపికలు ఒకటేనని చెప్పాలి. ‘అగ్ని’ ఆయనయొక్క దాహకశక్తి ‘స్వాహాదేవి’ అంతా ఒక్కచోటనే అగ్నియందే భావించాలి.

**“శక్తి శక్తిమతో రభేదః”**

సంధ్యావందనములో చెప్పినట్లు ఆ గాయత్రి గోపికారూపముగా ఈ అక్షరపరబ్రహ్మను కల్పినట్లు-

**“ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మ సమ్మితమ్” 248**

---

247) నీలకంఠుడై లోహితుడై వెళ్ళుచున్న ఈ దేవుని గోపకులు, జలస్త్రీలు, సమస్త జీవులు చూచిరి.

248) వరదురాలయిన గాయత్రి బ్రహ్మసమానమయిన ఓంకారమను అక్షరమును చేరుగాక.

గోవులు = వేదములు వాక్కులు అను పక్షమున మంత్రము= గోవు, మంత్రశక్తి= మంత్రదేవత= గోపిక. మంత్ర మంత్ర దేవతలకు అభేదము ఆగమ సంప్రదాయము.

గోపికలు= వేదములు, కర్మకాండ, ఉపనిషత్తులు. జ్ఞానకాండ= ఆవులు.

భగవంతుడు 'ఓంకారము'. కర్మకాండకు జ్ఞానకాండకు 'ఓం' కారము అవసరము.

వేదములు = గోపికలు గోవులు ఆవులు అయితే,

ఓంకారము = వృషభము

ఈ విషయములకే ప్రమాణములను ఇచ్చెదము.

**"కర్మకాండే పరమేశ్వర మపశ్యంత్యః తత్తత్కా
మానుబంధైః అపూర్ణా ఇవ భవంతి జ్ఞానకాండేతు
పరమేశ్వరం దృష్ట్వా పరిపూర్ణాభవంతి" - భాగవత వ్యాఖ్య. 248**

అనగా వేదములు కర్మకాండలో పరమేశ్వరుని చూడలేక అసంతృప్తితో విరహవేదనతో వేగుచూ, జ్ఞానకాండలో పరమపురుషుని దర్శించి సంతృప్తి నొందును" అని అర్థము.

భాగవతారంభములో వ్యాసమహర్షిగూడా అంతవఱకు వ్రాసిన పురాణేతిహాసముల వలన సంతృప్తి లేక, చివఱికి భాగవతము వ్రాసి సంతృప్తి చెందినట్లు ఈ కథలో వేదములుగూడా రాసలీలలో తృప్తి చెందినవి.

దేవతలు అందఱును మృత్యుభయముతో పరుగిడినవారై ఋగ్యజుస్సామ వేదములలో ప్రవేశించిరి. అయినను వారిని మృత్యువు వెంటాడగా చివఱకు ఋగ్వేదముకన్న అతీతమయిన స్వరమునందు జేరిరి. చూ॥

**"తే ను విదిత్వా ఊర్ధ్వాఋచః సామ్నో యజుషః
స్వరమేవ ప్రావిశన్" - ఛాందోగ్య.**

248) కర్మకాండలో ఇంద్రాది దేవతలు తప్ప పరమేశ్వరుడు కనబడకపోవటంవలన ఆయా కోరికలు మాత్రమే ఉండడంవలన అపరిపూర్ణంగా ఉంటాయి. జ్ఞానకాండలో పరమేశ్వరునిచూచి పరిపూర్ణులగుదురు.

అట్లే –

**"ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః"**

అని 'శ్వేతాశ్వతరం' చెప్పుచున్నది.

**"సర్వే వేదా యత్పద మామనంతి**
**తపాంసి సర్వాణి చ యద్వదంతి**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్"** – కఠోపనిషత్తు. **249**

**"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ"  "ప్రణవః సర్వవేదేషు"**

**"గిరామస్మ్యేక మక్షరం"** వంటి వాక్యములు సర్వ వేదశాఖలకు 'ప్రణవము' ప్రాణము అని ఘోషించుచున్నవి. వేదశాఖలన్ని ప్రణవ ప్రణయముతో చేయు ప్రదక్షిణములే "రాసలీల". ఈ ప్రణవమును వృషభముగా చెప్పిన ప్రమాణములు ఇంతకుముందు 'కృష్ణుడు' అను అధ్యాయమున చెప్పబడినవి.

గోపికలు = కర్మకాండ
వారిమధ్య కృష్ణులు = కర్మకాండలో ఓంకారములు.
మధ్యలో గోపిక = ఉపనిషత్తు (రాధిక) జ్ఞానకాండ.
మధ్యలో కృష్ణుడు = ఓంకారము.

**సారాంశము :**

"కిరణము, నాదము, ధ్వని, జ్యోతి, ఋక్కులు, రశ్మలు తత్వాలు" ఇవి అన్నియు ఒక్కటే. సృష్టి ప్రక్రియగా భగవంతునినుంచి దిగిన అంశలే. కనుకనే–

**"ధ్వనే రంతర్గతం జ్యోతిః జ్యోతిరంతర్గతం మనః"** అన్నారు.

వాయువు నాదము అగును. నాదము జ్యోతిగా మారుతుంది. ఆజ్యోతి పరంజ్యోతిని చేరుతుంది. ఇది క్రిందనుంచి వరుస. ఇదే పైనుంచి తీసికొంటే

249) సమస్త వేదాలు దేనిని చెప్తాయో, సర్వతపస్సులు దేనిని గూర్చి చెప్తాయో, దేనిని సాధించటానికి బ్రహ్మచర్యం పాటిస్తారో ఆ పదం – సంగ్రహంగా "ఓం".

'పరంజ్యోతి ఓంకారము' భగవంతుడు. ఆయననుంచి జ్యోతి / కిరణములు / రశ్మలు / నాదములు. ఇలా జీవులుగా, వాక్కులుగా, ఇంద్రియాలుగా, గుణాలుగా, దేవతలుగా, శక్తులుగా, నాడులుగా, తత్వములుగా, మనోవృత్తులుగా ఆవిర్భవించినవి. ఇవి లోకమునందు సుఖదుఃఖములలో మునిగినవి. భగవంతుడు వీనిని అప్పుడు వేణురవముతో ప్రబోధింపజేసెను. చివఱకు ఇవి ఊర్ధ్వముఖములై ఆ పరమేశ్వరుని చేరినవి. ఆ చేరుటయే ఆప్రదక్షిణమే రాసలీల. అదే 'రతి' సురతము.

భగవంతుడు పురుషుడు. మిగిలినదంతా ప్రకృతి. కనుక అందఱు స్త్రీలే. ఈ సమ్మేళనే రాసలీల. ప్రకృతిపురుషుల ఆధ్యాత్మిక శృంగారము. ఈ శృంగార ప్రదక్షిణలకు భగవంతుడే కేంద్రబిందువు. అష్టావక్ర గీతలో చెప్పినట్లు జీవతరంగాలు పరమాత్మ సముద్రంలో పడిలేచుటయే రాసలీల.

**"మయ్యనంతే చిదంభోధౌ ఆశ్చర్యం జీవవీచయః**
**ఉద్యంతి ఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః" 250**

"మెదడు" వంటివాడు భగవంతుడు. నాడీమండలము, ఇతర శరీరావయవముల వంటివారు గోపికలు.

**"ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ"**

అన్నట్లు పరమాత్మ సర్వసారుడు.

ఈ సమ్మేళనము శివశక్తి సామరస్యమే. ఈ సామరస్యానందమును మించినదిలేదు.

**"ఏతస్యై వానందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" 251**

ఈ ఆనందమునకు, ఫలితము బ్రహ్మమయులై బ్రహ్మలీనమగుటయే.

**"బ్రహ్మవి దాప్నోతి పరం" - తైత్తిరీయం.**

**"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" - ముండకోపనిషత్.**

---

250) అనంత జ్ఞానసముద్రమయిన నాయందు జీవులు తరంగాల వంటివారు. పుట్టారు. ఆడుతారు, చంపుతారు. నాలో ప్రవేశిస్తారు.

251) ఈ ఆనందముయొక్క అంశలే మిగిలిన జీవుల ఆనందానుభవములు.

**"యేపూర్వం దేవా ఋషయశ్చ తద్విదుః**
**తేతన్మయా అమృతా వై బభూవుః" – శ్వేతాశ్వతరం. 252**

చెప్పినట్లు గోపికలు కృష్ణతన్మయులైనారు. ఇది వారి సురతము ఇది వారి రాసలీల.

**"ఏవం శశాంకాంశువిరాజితానిశాః**
**స సత్యకామోనురతాబలాగణః**
**సిషేవ ఆత్మన్యవరుద్ధ సౌరతః**
**సర్వాః శరత్కావ్యకథా రసాశ్రయాః" 253**

ఈ విధంగా చంద్రుడున్న శరద్రాత్రులన్నియు, కృష్ణుడు గోపికలతో విహరించాడు. ఆత్మయందే సౌరతమును నిరోధించుకొన్నవాడై రాసలీలలను నిర్వహించెను.

సౌరతము అనగా ఏమి? రెండు అర్థములు.

1) సురత సంబంధమయినది – వీర్యము.

2) సురతము అనగా శివశక్తి సంయోగము దానివలన వచ్చిన 'సమాధి' వలన గలిగిన ఆనందము.

ఈ రెండు అర్థములను విడిగాను, కలిపి, సమన్వయము చేయవచ్చును. బాలుడు గనుక బాలునితో శృంగారము కనుక అస్థలిత శృంగారమని చెప్పవచ్చును. భగవంతుడు ఊర్ధ్వతేజస్కుడై అసంగముగా అసిధారావ్రతముగా చేసిన శృంగారమని చెప్పవచ్చును. పతిగా గోరినవారు గూడా పిల్లలు గనుక వారి శృంగారము అస్ఖలితము. ఇతర గోపికలు కృష్ణుని పతిగా గోరినట్లు ఋజువు లేదు. పుత్రుడుగా సోదరుడుగా జగన్నాథుని గోరినవారికి దర్శన స్పర్శన చరణసేవన మొదలగు సేవాభాగ్యము గోరినవారికి శృంగారముతోనే పనిలేదు. పైగా బహురూపములతో జరిపినది రాసలీల. అది మండలాకార

---

252) బ్రహ్మవేత్త పరమును పొందును. బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమే యగును. దేవతలు, ఋషులు బ్రహ్మము నెరిగి బ్రహ్మరూపులయి అమరులయినారు.

253) సత్యకాముడయిన భగవానుడు అనురక్తలయిన గోపికలతో కలిసి శరద్రాత్రులు గడపెను. తనలోనే సురతానందమును ఇముడ్చుకొని ఆ శరత్కావ్య కథలను సేవించెను.

నృత్యసంగీత గోష్ఠీరూపముగనే కన్పట్టుచున్నది. భగవంతుడు ఏకరూపుడు గనేయున్నట్లు అంతకుముందు క్రీడాసమయ వర్ణనలో స్పష్టముగనే యున్నది. ఏకరూపుడయిన భగవంతునిచుట్టూ గోపికలు వదలకుండా ఉండిరి. ఆయన అంతర్ధానమయిన సమయమున ఒక్క గోపికయే తోడున్నట్లు గ్రంథసాక్ష్యము ఆ గోపికయు రాధయే అని వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు. ఆ రాధను కృష్ణుడు పరీక్షించి గర్వభంగము చేసినట్లు గలదు.

**"రాధా మాధాయ హృదయే తత్యాజ వ్రజసుందరీః" – జయదేవః 254**

కనుక మొదట వర్ణించినట్లు చీరముడి తాకటం, స్తన స్పర్శ, నఖ క్షతాదులు రహస్యక్రియకు సంబంధించినవి కావు. ఒక్కడే అందఱి ముందఱ సంభోగించినట్లు చెప్పుట గ్రంథ సాక్ష్యములేని దురుక్తి. కనుక వారి శృంగారము అస్థలిత మనుటకు ఎట్టి ఆటంకమును లేదు. శృంగారమనగా రతిభావమే కాని శారీరక సంసర్గము కాదు. వియోగము శృంగారమే కదా. తీవ్రమయిన పరస్పర ప్రేమ స్త్రీ పురుషుల మధ్య ఏర్పడినపుడు అది వారిలో 'తహ తహ' కల్గించినపుడు 'శృంగాము' అనెదరు.

సమాధిగత ఆనందము అనుకొంటే;

భగవంతుడు తనయందే తన ఆనందమును నిలుపుకొన్నాడు అని అర్థము. అనగా ఆత్మారాముడు అని అర్థము. మొదట్లో చెప్పినట్లు–

**"ఇతి విక్లబితం తాసాం శ్రుత్వా యోగీశ్వరేశ్వరః**
**ప్రహస్య సదయం గోపీ రాత్మారామో ప్యరీరమత్" 255**

అని ఆత్మారాముడై గోపికలను గూడా ఆనందింపజేసెను. అంటే ఆత్మానంద మెటువంటిదో అట్టిదే గోపికలతో పంచుకొనెను. అనగా ఆత్మానందమే కదా.

సారాంశమేమనగా – భగవంతుడు ఆత్మ భావననుంచి అచ్యుతుడై యున్నాడు. గోపికలకు ఆయనయందు పరమాత్మ భావన యున్నది. భక్తి

254) రాధను హృదయమున ఉంచికొని గోపికలను వదలెను.
255) గోపికల ఆర్తిని విని యోగీశ్వరేశ్వరుడయిన హరి నవ్వి దయతో వారియందు ఆత్మారాముడై రమించెను.

యున్నది. కనుక వారి యందు కొంత ద్వైతవాసన యుండవచ్చును. భగవంతునియందు "సర్వం ఆత్మ" అనే భావన యున్నది. కనుక ఆయన సురతానందము ఆయనయందే నిలిచియున్నదని నిష్కర్ష. వారు వేఱు వారుకాదు. వారు తన రూపాలే. తన రూపాలతో తనకు ఆనందమేమిటి? తనకాలు గిల్లుకొన్నను తన చేతులు తనే ముద్దుపెట్టుకొన్నను ఏమి ప్రత్యేకత. కనుకనే ఋషి-

**"యధార్భకః స్వ ప్రతిబింబ విభ్రమైః"** అన్నారు.

ఇట్టి పుణ్యలీల కనుకనే ఈ రాసలీలా వృత్తాంతము భక్తులకు పరమ పవిత్రము. దీన్ని వర్ణించినా ధ్యానించినా భగవద్భక్తి లభించి 'హృద్రోగము' నశించును. గోపికలు గూడా తమ 'హృచ్ఛయ' తాపమును పోగొట్టుకొనిరి.

## పరీక్షిత్తు - ప్రశ్న :

అంతరార్థము నిజమయితే పరీక్షిత్తు ఎందుకు మహర్షిని ఇలా ప్రశ్నించాడు. ఆయనకు అంతరార్థము తెలియదా? శుకమహర్షికి తెలియదా? అని ప్రశ్న. తెలియును. కాని బాహ్యార్థమును దృష్టిలో పెట్టుకొని పామరులను హెచ్చరించుటకు ఆ ప్రశ్న ఆ సమాధానము వచ్చినవి. ఆ సమాధానములో పండిత పామరులకు ఉభయులకు సమాధానము ఉన్నది. అది చర్చించెదము.

## ప్రశ్నలు :

1) ఇది ధర్మోల్లంఘనము - సాహసము.

2) దీనివలన లోకము చెడిపోవును.

## సమాధానము :

1) సాహసమే, ధర్మోల్లంఘనమే. పాపహేతువే. కాని సామాన్యులకు. అసామాన్యుడైన దేవునకు మహిమాన్వితులయిన మునులకు ఇది కీడు చేయలేదు. మన భోజన నియమాలు 'అగ్ని'కి వర్తింపవు.

2) కనుకనే 'రుద్రుడు' కాలకూటము తిని సలక్షణంగా ఉన్నాడు. మనము అలా ఉండలేము. కనుక మహాత్ముల అసాధారణ ప్రవర్తన మనకు ఆదర్శం కారాదు.

3) మహాత్ములు చేసిన చరిత్రలు మనకు 100% ఆదర్శము కావు. వారి ఉపదేశములు పూర్తిగా ఆచరింపదగినవి. వారి ఉపదేశములతో వారి చరిత్రలు సరిపోలుచున్నపుడు మాత్రమే, అంతవరకే 'చరితలు' ఆదర్శము.

**"ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితం క్వచిత్" 256**

4) దైవచరిత్రలు పూర్తి సత్యములు కావు. అవి మిధ్యలు కావచ్చును. అనగా జగత్తు మిధ్య అన్నట్లు పైకిసత్యముగా కనిపించినను అవిసత్యములు కావు. వానికి అంతరార్థముండును. జగత్తులో బ్రహ్మము అంతర్లీనముగా నున్న "సత్యము" కదా. అట్లే అంతరార్థము సత్యము. కనుక వారి చరిత్రలను చూచి నమ్ముట మయసభలో దుర్యోధనుని అవస్థవలె తరువాత పతన హేతువగును.

5) కథలకు అంతరార్థములుండును. ఉపదేశములకు ఆ అవస్థలేదు. కనుక వాటిని యధావిధిగా పాటింపవచ్చును.

6) భగవంతుడు అంతరాత్మ. ఆయన గోపికలలోను వారి పతులలోనూ ఉన్నాడు. కనుక దోషములేదు. ఈ సమాధానము పండితులకుగూడా అవసరము.

**"గోపీనాం తత్పతీనాం చ సర్వేషాం చాపి దేహినాం**
**యోంతశ్చరతి సోధ్యక్షః ఏష క్రీడనదేహభాక్" – భాగవతం. 257**

7) సర్వస్వరూపాలు భగవంతునివే. ఆయన తన రూపముతో తానే ఆడుకొన్నాడు. ఇది ప్రతిబింబములతో క్రీడ. కనుక దోషములేదు. కనుక ఇది శృంగారము గాదు. కేవలము ఆత్మానందము.

**"స్వశరీర పరిష్వంగాత్ రతిర్నాస్తి శుభాననే**
**సర్వం జగచ్చ తస్యాంగం పృథగత్ర నవిద్యతే**

---

256) ఈశ్వరుల వచనము సత్యము. వారి ఆచరణ కొంతవఱకే సత్యము.
257) గోపికలకు వారి భర్తలకు సమస్త దేహధారులకు అంతర్యామి అయిన ఈశ్వరుడు ఈ లీలా శరీరమును దాల్చెను.

**స్వాంగాలింగే రతి ర్నస్యాత్ అంగనాలింగనే రతిః**
**యస్యాంగం జగత్ ఈశస్య తస్య రాగాదయః కుతః" 258**
**- పద్మపురాణం - ఉత్తరఖండం.**

ఇక కథకు వచ్చెదము. ఆ విధముగా ప్రతిరాత్రి రాసలీలలు జరుగుచున్నను గోపికలు భర్తలు తమ భార్యలు తమప్రక్కనే యున్నట్లు భావించినారట ఇది భగవంతుని మాయ అట. చూ॥

**"నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్యమాయయా**
**మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః"**

ఇచ్చట భగవంతుని ప్రక్కన గోపికలుంటే వారందఱు తమ ప్రక్కన ఉన్నట్లే భావించారు. కృష్ణుని కడుపునిండితే దుర్వాసుడు ఆయన శిష్యగణము కడుపులు నిండినట్లుఈ "లీల" కనబడుచున్నది.

అడుగడుగున యోగమాయ కనబడుతున్న యీరాసలీలా విభూతిని భౌతిక విభూతిగా గ్రహించి కృష్ణుని నిందించుట పాపహేతువు. కనుక పూర్వపండితులు గోపికా కృష్ణలీలను నిందింపలేదు. గీతలో చెప్పినట్లు-

"జన్మ కర్మ చ మే దివ్యం" అని కృష్ణుని చరిత్ర అంతయు దివ్యము. అనగా మానవాతీతము. గ్రంథసాక్ష్యమునుబట్టి దాని దివ్యత్వము "యోగజ్ఞానలీల" అగుటయే.

## సంక్షేపము :

రాసలీలకు రెండు స్వరూపములు.

1) భౌతికము, 2) యోగపరము.

భౌతికముగా జరిగినచో కృష్ణునకు అది అపవాద కారణమే. గోపికలకు తప్పదు. అసలు జరుగలేదనగా మహర్షి అబద్ధము వ్రాసినట్లు "ఋషయ

---

258) తన శరీరం తనే కౌగిలించికొనటం వలన ఆనందం ఉండదు. సమస్త జగత్తు ఆయన శరీరమే. వేరుగా ఏమియు లేదు. స్వశరీరాలింగనం వలన సంతోషం లేనట్లు తన శరీరాలయిన స్త్రీలను ఆలింగనం చేసికొనటం వలన రతి ఏమి ఉంటుంది. కనుక ఆయనకు రాగద్వేషాలు ఎవరిమీద ఎలా ఎందుకు ఉంటాయి?

స్సత్యవచనః" అను అమరకోశము అబద్ధము. కనుక అసలు 'రాసలీల' అనే వృత్తాంతము అసలు జరిగినట్లా? జరగనట్లా? జరిగినట్లే. అయితే యోగపరముగా జరిగినట్లు. మన శరీరములలో మనకు రాసలీల జరిగినట్లే కృష్ణుని మహిమతో యమునాతీరమున గోపికలకు 'సమాధి' రూపమయిన 'రాసక్రీడ' జరిగినది. అది భౌతికం కాదు. ఎందుకంటే–

1) '....మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః' యోగీశ్వరేశ్వరః కృష్ణః మొదలగు మాటలనుబట్టి కృష్ణుని గోపికలు విష్ణువుగనే భావించి ధ్యానించుటను బట్టి.

2) గోపికలు భగవంతునియందు పతిపుత్రసోదరాది బంధుభావనలు చేసెదమని చెప్పిరి కనుక, వారు మాత్రమే వేణునాదము వలన వచ్చినారు కనుక వేణునాదము, శరదృతువు మొదలగునవి ఆజ్ఞాచక్రమునకు సరిపోవుచున్నవి కనుక.

3) గోపికలు గోవులు అనే పదములు రశ్మలను సూచించుచున్నవి. కనుక వారు సూక్ష్మశరీరములతో భగవంతుని వద్దకు వచ్చినట్లు తెలియుచున్నది. కనుకనే స్థూలశరీరములు తమ ప్రక్కనే యున్నట్లు వారి బంధువులు భావించుట సంభవించినది.

నఖక్షతం మొదలగు అనుభూతులు ఎట్లు? ఇట్లు

శ్రీకృష్ణుడు విశ్వరూప ప్రదర్శనలో సకలవిశ్వము తనయందు ఉన్నట్లు చూపెను. తను ఒంటరివాడను కాదని దుర్యోధనాదులకు తెలియుటకు అది అవసరము. కురుక్షేత్రములో, సకల వీరులను తనే కాలరూపమున మ్రింగుచున్నట్లు అర్జునునకు చూపించెను. అది అచ్చట అపేక్షితము. సర్వపదార్థములు తన నోటిలో ఉన్నట్లు యశోదకు చూపెను. అది ఆమెకు అవసరము. రాసలీలలో సర్వవిభూతులు తనవిగా చూపబడినవి. ఇదియును ఒక విశ్వరూప ప్రదర్శనమే. ఇవి ధ్యానానుభూతులు. జరుగబోయే యుద్ధము కాలవ్యూహములో జరిగినట్లు చూపబడినవి. కట్టవలసిన యింటిని కట్టినట్లు 'ఇంజనీరు' బొమ్మగీయుట వంటిది. విశ్వరూపుని నోటిలోనికి అందఱు పోవుచున్నట్లు కొందఱు కోరలకు తగిలి నలిగి తునిగిపోయినట్లు అర్జునుడు

గమనించెను. కాని ఆ క్షణము అది జరుగలేదు. తరువాత యుద్ధములో ఆ వీరులు చచ్చిరి. భగవంతుని కోరలు వారికి తగులలేదు. ఆయుధములు తగిలి చచ్చిరి. ఈ యనుభూతులు ఎట్లు ఎంతవఱకు సత్యములో గోపికల అనుభూతులు రాసలీలలు అంతే సత్యములు.

**"యే యధామాం ప్రపద్యంతే తాం స్తధైవ భజామ్యహం"**

అన్నట్లు వారికి దివ్యానుభూతి దశలో నారాయణుడుగా, లక్ష్మీపతిగా, మనోహరుడుగా, బాలకృష్ణుడుగా, నఖక్షతాద్యనుభూతులను కల్గించెను.

కురుక్షేత్రంలో చూపిన 'విశ్వరూపం' అర్జున సంజయులకు దప్ప ఎవరికి కనబడలేదు. ఎదురుబదురుగా ఉన్న సేనలకు ఏమియు తెలియదు. అట్లే యీ రాసలీల గోపికాకృష్ణులకు తప్ప వేఱెవరికి తెలియదు. అందువలననే నందునికి తెలియదు. గోపాలకులకు తెలియదు. గోపాలకులకు తెలియనిచో వారు గోపికలను మొదట ఎట్లు ఎందుకు నివారించిరి – అను ప్రశ్నకుపతి, పుత్రుడు మొదలగు బంధములు అడ్డువచ్చినవి అని అంతరార్థపరముగా సమాధానము. కనుకనే తమ భార్యలు తమవద్దనే ఉన్నట్లు గోపకులు భావించుట సంభవించినది. ఒక స్వప్నానుభూతి వంటిది. స్వప్నము అసత్యము. అనుభూతి సత్యమే. కనుక మహర్షి వాక్యము సత్యమే.

## పరీక్షిత్తు ప్రశ్న :

సీత లంకలో ఉన్నందుకే అపవాదు వచ్చినది. అందువలన యీ స్త్రీల విషయములో పామరులకు వచ్చే శంకను నివారించుటకే ఆ ప్రశ్న. మీరాబాయికి గూడా అపవాదులు తప్పలేదు. తరువాత సమాజం వారిని గౌరవించినది. అందుకు పరీక్షిత్తు ఈప్రశ్న వేసెను.

కాదంటే –

1) దశేంద్రియోపాఖ్యానమువలె (భాగవతంలోనే)

2) 27 తత్వములు తపస్సుచేసి 'ఉరుక్రముని' పొందిన ఘట్టమువలె, కేవలాధ్యాత్మిక కథకు ఇది భౌతికరూపము కల్పించుట. నిరంజనోపాఖ్యానము వంటిది కావచ్చును. అది సత్యమయితే ఇది సత్యమే. లేకపోతే లేదు.

తరువాత అవతార; పురుషుడు కంసవధకై మధురా నగరానికి చేరాడు. యోగపరంగా హృదయ పద్మమునకు (అనాహతమునకు) చేరినాడు. అచ్చట నుంచి 'ఉద్ధవుని' గోపికల వద్దకు పంపినాడు. భ్రమరగీతలు మొత్తము గోపికల విరహ శృంగారమును నిరంతర చింతనారూప భగవద్భక్తిని చెప్పుచున్నవి. భగవంతుడు కోరినది అదే. అంగసంగము కాదు మానసిక సంగము నేర్చుకొనమని మొదటనే హెచ్చరించిన జనార్దనుడు వారికి మానసిక సంగమును నేర్పుటకే మధురాయాత్ర చేసినట్లు చెప్పినాడు. ఏ జారుడు తన ప్రియురాండ్రకు ఇట్టి సందేశమిచ్చును? భగవంతుడు భక్తునకు, గురువు శిష్యునకు మాత్రమే యిట్టి సందేశము ఇవ్వగలడు.

గోపికల కృష్ణావేశమును గమనించిన ఉద్ధవుడు వారికి నమస్కరించి తనలో అనుకొన్న మాటలు మనమందఱము అనుకొనవలసినవి. గోపికలు **వనచరా వ్యభిచారశీలలు**. అనగా, వనములో తిరుగుట తప్ప వేఱు స్వభావము లేనివారు అంటే అడవి మనుషులు. అంతరార్థములో అయినచో సంసార వనమునందు శరీరారణ్యమునందు సంచరించుచు విషయాభిలాషతో నిత్య సంచారశీలమయిన ఇంద్రియవృత్తులు నాడీక్రియలు అని చెప్పవలయును. అంతేతప్ప గోపికలు వ్యభిచారశీలలు అని అర్థము చెప్పరాదు. వారికి భర్తలు గలరు. యశోద పతివ్రత. భర్తలను వదలి వారు భగవంతుని సేవించినట్లు మాత్రమే బాహ్యకథ చెప్పుచున్నది. అది వ్యభిచారము కాదని శాస్త్రయుక్త సిద్ధాంతము. మహర్షి ఆశయము. కనుక "వ్యభిచారిణులు" అను అర్థము చెప్పరాదు. 'వేదములు' అను పక్షమున భగవంతుని బోధింపవలసిన వేదములు కర్మను, ఇతర ఇంద్రాది దేవతలను బోధించినట్లుండుట వ్యభిచారము.

కనుకనే బృందావనములో ఒక తీగగా నయినా పుట్టనందుకు ఉద్ధవుడు విచారపడెను. ఏమనగా భగవచ్చరణారవిందములను తమ స్తనములపైన ఉంచి కొని తాపమును చల్లార్చుకొనిన గోపికల అదృష్టము తనకు లభించలేదట. ఆ యదృష్టమును ఉద్ధవుడు ప్రశంసించుటనుబట్టి స్తన పాదారవింద సంయోగము శృంగారము కాదని ఆధ్యాత్మికమని తెలియుట లేదా? కనుక ఉద్ధవుని గొంతుతో గొంతుకలిపి గోపికలకు నమస్కరించుచు 'శ్రుతి' ప్రారంభించెదము గాక.

**"వందేనంద వ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః**
**యాసాం హరికథోద్గీతం పునాతి భువనత్రయమ్" 259**

**ముగింపు :**

"సోపాధిక బ్రహ్మ విద్యాదర్పణము" నందు ఈ విషయములే సంగ్రహ శ్లోకరూపముగా చెప్పబడినవి.

**"కాంతాషోడశ సాహస్రం కలాసు పరికల్ప్యతే**
**నాడీశతే చాష్టదిక్షు శేష పుష్టోత్తరం శతమ్" 260**

**"భానోః కరసహస్రస్య కళాసంజ్ఞా నుమీయతే**
**తస్మాత్ షోడశసాహస్రం కలాషోడశవిస్తరమ్" 261**

**"కలానాడీదిశస్సర్వాః అధ్యాత్మని ప్రతిష్ఠితాః**
**ఆత్మనశ్చ కలాదీనాం అతో దాంపత్యవర్ధనమ్" 262**

**"లోకాశ్చ లోకపాలాశ్చ ఆత్మాచాప్యఖిలంజగత్**
**అధ్యాత్మస్థిత మిత్యేవ చైతరేయేహి శ్రూయతే" 263**

**తాత్పర్యము :**

సూర్యకిరణములు= కళలు. అవి 1000. 16 రోజులకు 16000 కిరణాలు. కళలు = తిథులు. వీరే కృష్ణుని 16 వేలమంది భార్యలు. 100 నాడులు. అష్టదిక్కులు ఇవి 108 మంది భార్యలు.

---

259) ఎవరు చేసిన హరికథాగానము ముల్లోకములను పవిత్ర పఱచునో అట్టి నందగోపికల పాదధూళికి నమస్కరించెదను.

260) కలలే 16 వేల కాంతలు. 100 నాడులు 100 భార్యలు. 8 దిక్కులు 8 మంది పట్టమహిషులు. కాగా 16,108 మంది భార్యలు.

261) సూర్యకిరణాలు కళలు. కనుక 16 × కలలు = 16000 కిరణాలు భార్యలు. షోడశ కలలవిస్తారమే ఈ భార్యలసంఖ్య.

262) కలలు, నాడులు, దిక్కులు మనయందే ఉన్నవి. అందువలన ఆత్మను భార్యగా కలలను భార్యలుగా దాంపత్యంగా చెప్పారు.

263) లోకాలు, లోకపాలకులు, ఆత్మ సమస్త ప్రపంచము, అంతా మనయందే ఉన్నదని ఐతరేయోపనిషత్తులో నున్నది.

కళలు, నాడులు, దిక్కులు, లోకములు, లోకపాలకులు ఇవి అన్నియు ఆధ్యాత్మికములని ఐతరేయమున చెప్పబడినది. లేనిచో ఘోరసంసారమును, వ్యభిచారమును వర్ణించుట వలన ఏమి ప్రయోజనము పైగా పై సంఖ్యలకు సార్ధకత ఏమిటి? కారణము ఏమిటి?

కనుక అనేక గ్రంథ పర్యాలోకమునుబట్టి 'రాసలీల' ఆధ్యాత్మికలీలగా సృష్టిలీలగా స్పష్టమగుచున్నది. గ్రంథమింత గహనము గనుకనే పండితులు–

**"హుతాశనే హాటక సంపరీక్షా విద్యావతాం భాగవతే పరీక్షా" 264**

అన్నారు. కనుకనే "బమ్మెరపోతన" కవీంద్రుడుగూడా–

**"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు**
**శూలికైన తమ్మిచూలికైన**
**విబుధజనుల వలన విన్నంత కన్నంత**
**తెలియవచ్చినంత తేటపఱతు"**

అని అనెను. కనుక భాగవతమును పైపైన చూచి భగవచ్చరిత్రను నిందించినందుకు వచ్చు ప్రయోజనము లేదు. దాని మర్మము కొఱకు ప్రయత్నింపవలయును. సాధ్యము కానిచో మూఢగాఢ భక్తితో భాగవతమును పఠించినచో పరమపురుష దయాకటాక్షముతో చివఱకు జ్ఞానము లభింపగలదు. చూ॥

**"యథా యథాత్మా పరిమృజ్యతే సౌ**
**మత్పుణ్యగాథాశ్రవణాభిధానైః**
**తథా తథా పశ్యతి వస్తు సూక్ష్మమ్**
**చక్షు ర్యథైవాంజన సంప్రయుక్తమ్" – భాగ. 265**

---

264) విద్వాంసులకు భాగవతంలో పరీక్ష. బంగారానికి అగ్నిలో పరీక్ష వంటిది.
265) నా పుణ్య గాథలను వినడం చెప్పటం ఎక్కువగా చేసేకొద్దీ ఆత్మ శుద్ధమగును. అపుడు సూక్ష్మమయిన బ్రహ్మతత్త్వము బోధపడును. సిద్ధాంజనము వేసిన కన్నులాగా మనస్సు శక్తిమంతమవుతుంది.

అన్నట్లు ఆత్మశుద్ధి, సుదర్శనము లభింపగలదు. ఉద్ధవుడు చెప్పినట్లు భగవంతుని స్మరణ తెలిసిగాని తెలియకగాని చేయుచున్నచో మందువలె తన పని తాను చేయును. చూ॥

**"నన్వీశ్వరోపి భజతో విదుషోపి సాక్షాత్**
**శ్రేయ స్తనోత్యగదరాజ ఇవోపయుక్తః" 266**

ఇంత చెప్పినను కాదన్నచో భర్తృహరి సుభాషితమే శరణ్యము.

**"జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి" 267**



266) తనను సేవించేవారు అజ్ఞానులయినా భగవంతుడు మంచి ఔషధంలాగా మేలు కలిగిస్తాడు.
267) కొద్దిపాటి జ్ఞానంతో పొగరెక్కిన వానిని బ్రహ్మగూడా ఆనందపఱచలేదు.

# వరివస్యా నివేదనమ్

"ఎందుకుజన్మమెత్తినొ ఏమయియుంటినొ ఏమియౌదునో
ఎందుకునన్ను నీవు సృజియించితివో ఒక వీసమైన నా
కందుటలేదు నే పుటుకనంది ఫలించినదేమియుండె నీ
మందకు తక్కువాయెనని మాధవ! నన్ను సృజించినావటే?

జీవితమెంతయో గడచె చేదులు తప్పులు చాలచూచితిన్
పావనమైనదేదియును భావనలో గనుపింపలేదు నా
కీవిధివ్యర్థజీవితము నేమిదలంచి యనుగ్రహించితో
ఆవలనేమియో? యని భయంపడనే సృజియించినావటే?

ఎక్కడనుండి వచ్చితినొ? ఎచ్చటకేగెదనో? మఱెప్పుడో?
ఎక్కడ పుట్టువాడనొ? ఇకెప్పుడు మోక్షము దక్కనున్నదో?
దిక్కెవరుండునో? తుదకు, దిక్కుగ నీవును నుండకుండెదో?
ఇక్కథ ఎట్లుసాగునొ? మఱేమి మిగిల్చితివో? ఎఱుంగరా!

నిజముగ గర్మలున్నవొకొ? నీదగు నిచ్ఛయె సర్వహేతువో?
నిజముగ విశ్వమున్నదొ? గణింపగ నంతయు భ్రాంతిమాత్రమో?
నిజముగ నన్ను నేనెఱుగ, నిన్ను నెఱింగితి నన్నయాశతో
వ్రజవర! వ్రాసినాడ నిదివాస్తవమై యలరారనీయురా!

ఆకు లతల్పయింబడ భయంబుల వెచ్చదనంబు హెచ్చగా
చీకటులందుగ్రుగ్గి తనచేదులనొగ్గి విరక్తమైన యీ
"కాకరపండు" నీకొసగు కానుకగా తనలోని "తీపు"లన్
చేకొనుమోయి! కాదనక శేషఫణాంతరశాయి! ఓహరీ!

*"నమో భగవతే వాసుదేవాయ"*